## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# జయవిజయులు

గ్రంథకర్త

కీర్తిశేషులైన


బ్ర॥ శ్రీ॥ చావలి శ్రీరామశాస్త్రిగారు

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు,

బాలికోన్నతపాఠశాల, గుంటూరు.



ప్రకాశకులు

సత్యనారాయణబ్రదర్సు,

కొత్తపేట, గుంటూరు.

వెల రు 0-14-0

# తొలిపలుకు



శ్రీయుత చావలి శ్రీరామశాస్త్రిగారు బాలురకుఁ దగిన పుస్తకములు వ్రాయుటయందు సమర్థులు. వారీసారి రచించిన యీ "జయవిజయులు" నాతికఠినమును రసవంతమును నగు పుస్తకము. భాగవతాది పురాణములలోఁ గల హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు, శిశుపాల దంతవక్త్రులు— వీరల చరితము లిం దెంతో సొంపుగ వర్ణింపఁబడి యున్నవి. ప్రాఁతవడిన కథలని పాఠకు లెంత మాత్రమును దీనిని నిరసింపక, మీఁదుమిక్కిలి సంతోషముగఁ జదువుదు రనుట స్పష్టము.

ఈపుస్తకము * * * పఠనీయగ్రంథముగ నుండుట కెంతయు ననువుగ నున్నది.

Nellore,<br>
25-10-'26.

(Sd.) R. Venkata Sivudu, M. A., L. T.,<br>
*Principal,*<br>
*Venkatagiri Raja's College.*



# విషయసూచిక

—:O:—

## మొదటి భాగము



## రెండవ భాగము

## మూడవ భాగము

శ్రీరామచంద్రాయ నమః

# జయ విజయులు

—:0:—

అలుకనైనఁ జెలిమినైనఁ గామంబుననైన బాంధవముననైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ జేరవచ్చు వేఱు సేయ

వైరానుబంధనంబునఁ జేరినచందమున విష్ణుఁ జిరతరభక్తిం
జేరఁగ రాదని తోఁచును నారాయణభక్తియుక్త నాచిత్తమునన్.

కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా !

...నారదముని.

## మొదటి భాగము

—♦ జయ విజయుల శాపకారణము ♦—

శ్రీనిలయంబై భక్తలోకపాలనగుణధామంబై ఆర్యజన సన్నుతిభూమంబై వైకుంఠపురంబలరారుచుండు. అప్పురవాసు లెల్లప్పుడు మాధవాంఘ్రిసరోజంబులఁ బూజించుచుఁ దదీయాకారంబులఁ దాల్చి సదాసుఖించుచుందురు. అన్నగరోపవనమ్ము లెల్లప్పుడును నిర్మలధర్మమూర్తియగు నాహరి పేరఁ బెంపెసఁగుచుఁ బుష్పఫలభరితంబులగు సంతానవనసంతానంబులచే

నెంతయు నలరారుచుండును. అం దెచ్చటఁజూచినను నారాయణ భజన పరాయణులై చరించు సుందరీయుక్తవైమానికులే. అచ్చటి హంససారస శుకపిక చాతక తిత్తిరి మయూర రథాంగ ముఖ్య విహంగంబు లరవిందనయను కథాగానంబు లనూనంబుగా మొరయించుచు నిర్భరానంద భరితంబులై యుండును. మఱియు నయ్యాది ప్రవాళలతికాకులంబులయిన కూలంబులుగల నడబావులు గలిగి సుకృతంబునకు శరణ్యంబును, న్యాయంబునకు నాలవాలంబును, బుణ్యంబునకుఁ బుట్టినిల్లునై యొప్పారుచుండును. భగవద్దాసులుండు నాగొంది హరివిముఖులును, పాపవర్తులును, దుష్కథానిరతిఁ జరియించువారలును జొరదుష్కరంబై యహంకారవిదూరులగు సుకృతాత్ములకుఁ జొర సుకరంబై యుండును. ఆవైకుంఠంబను కమలాకరంబున నుండు భవనాంభోజంబున నారాయణుండు భృంగాకృతి నేపారుచుండును.

హరిచేఁ బాలితమై యొప్పు తదీయధామంబు, వృద్ధులయ్యును బంచాబ్దంబుల కుమారకులై కానఁబడు నిస్పృహులును ధీరులునగు సనకాదులు భువనములెల్లఁ దిరుగుచు,నొక్కనాఁడు డాయంజని, యందు నవరత్నతోరణ సమంచితకుడ్యకవాట గేహాళీవిరచిత కక్ష్యాషట్కముం దాటి యనంతరకక్ష్యయందు వివిధభూషణాంబర ధారులును, వనమాలికావిరాజితోరస్కులును, గదాధారులును, జతుర్బాహులును, వేత్రదండాభిరాములును, నుదారులునగు ద్వారపాలుర జయవిజయాభిధానులఁ గాంచిరి.

# మొదటి భాగము

శ్రీవల్లభదర్శనలాలసులై యేగు నప్పరమభాగవతో
త్తములఁ గుటిలాత్మకులై దుశ్శీలత నాద్వారపాలు రిరువురును
వారించిన వారును రోషారుణితాంబకులై బృందారకు లీక్షిం
చుచుండ, నచటివారు వినుచుండ "భక్తపరిపాలుఁడగు నీశ్వరు
సేవింపఁగోరి మే మరుగుచుండ ముకుందభజనంబున కంతరా
యంబు గల్పించు నిద్దురాత్ములఁ గంటిరే ?" యని యంత
నిలువక కోపంబున నా జయ విజయులం గాంచి "మంద
బుద్ధులై మమ్ము వారించిన యనుచిత కర్ములగు మీరలు
మదీయ శాపార్హులగుదురు. కావున భూలోకంబునఁ గామ
క్రోధాదు లనుశత్రువులు బాధింపఁ బుట్టుఁ"డని పలికిరి.

అంత నావిష్ణుమందిర ద్వారికులు వారింపరాని యా
భూసురవాక్యంబుల కులికి తల్లడమంది పరితాపమునొందుచు
నిటలతటఘటితాంజలులై యా మునీశ్వరుల పాదములకు
మ్రొక్కి, "మహాత్ములారా! మామది నొవ్వఁజేసిన మీనిష్ఠుర
వాక్యంబులకు మేము శోకింపము. ఏలయన సత్పురుషులకుఁ
బరాభవమొనరించిన మాదురితంబు మమ్మింతకుఁ దెచ్చె. మా
యపరాధంబు మన్నించి రక్షింపఁదలఁచితిరేని కామలోభా
దులతోఁ బుట్టినను బంకజాక్షు మఱువక యుండునట్లనుగ్రహిం
చితిరేని మీఁది జన్మంబుల మాకు శుభంబగు"నని మొఱ
లిడిన నమ్మహాత్ములు కరుణించి మూడుజన్మంబులకు వైరంబు
వలన విష్ణుసన్నిధానంబు గలిగెదుమని యనుగ్రహించిరి.

తత్సమయంబున నారాయణుఁ డాకలకలంబునాకర్ణించి
లక్ష్మితోడి వినోదములఁజాలించి వక్షంబున వైజయంతి విరా

జిల్లుచుండఁ బాదచారులై యా యోగివర్యుల సమీపమునకు వేంచేసిన నమ్మునులును నాపురుషోత్తము నిజాంతరంగముల నిలి పియుఁ దనివిసనక పునఃపునరభివందనము లొనరించి యిట్లని స్తుతించిరి."భక్తజనవత్సలుఁడవగు నో దేవా ! మజ్జనకుఁడగు విధాత మాకుపదేశించిన భవదీయమంగళవిగ్రహము గనుఁ గొని కృతార్థులమైతిమి. అనఘా నేఁడు మీపాదభక్తుల కలిగి మేము శాపం బిచ్చితిమి. ఆ యధిక దుష్కృతముచే నిర యము నొందవలసివచ్చె; కావున నీపాదకమలంబులఁ గొలువ నేతెంచిన మమ్ము నేరమెంచక కరుణింపుము నీ సహజశరీరంబు గాంచి మదీయనేత్రంబులు కృతార్థతనొందె. మమ్మాదరింపు ము"అనివారలు భగవంతుని పాదములకుఁ బ్రణమిల్లిన భక్త వత్సలుఁడగు గోవిందుఁడు ముదితాత్ముఁడై మునివరులఁజూచి "ఈయిరువురును జయవిజయాభిధానములుగల మదీయ ద్వార పాలురు.వీరలుమిమ్ముఁ గైకొనక నాయాజ్ఞ నతిక్రమించియొన రించిన యపరాధంబునకుఁ దగినదండనగావించితిరదియ నా కును నభిమతమయ్యె. అదియునుంగాక సేవకులు సేయునపరా ధంబు స్వామిదియె. కాన నీయపరాధమునకు మాననీయుఁడ నగు ననుమన్నించిప్రసన్నులగుదురుగాక. తనువునఁబుట్టినకుష్ఠ వ్యాధిచేఁ దదీయచర్మము వివర్ణతనొందినట్లు భృత్యులపరా ధంబు సేసిరేని యజమాను లపయశము పాలగుదురు. మఱియు నవివేకులై సాధుజనుల కపకృతిగావించు దుష్టులు మత్సముల య్యును వారునాచే నాశంబునొందుదురు. ఇతరులఁ జెప్ప నేల? నా భావంబుఁ దెలియ నేరక మిమ్ముఁ బరిభవించిన వీరలకుఁ దద్దోష

ఫలంబుసంప్రాప్తమయ్యె. కావున వీరు భూమిపైఁబుట్టి యచిర కాలంబున నానాయంతికమునకే తెంచునట్లనుగ్రహింపుఁడనిపలికె. వారును సంతసించియతివినయంబునమస్తకన్యస్తహస్తులై యామాధవుఁగాంచి "భగవంతుఁడవగు నీవు మత్కృతంబులన్నియు నభిమతమంటివి విది కడుచిత్రంబుగదా? దేవా! నీమహిమ నెఱుఁగ మేమెంతవారము? మునులమగు మమ్మ మోదాతిశయంబున నిట్లు సత్కరించుట సజ్జన పరిగ్రహార్థంబై యుండుఁగాదె! ఈ జయవిజయులకు మేమలిగి శాపం బొసఁగితిమి. వీరల నింతకంటె బెడిదంబుగ శిక్షింప నీయభీష్టమేని యట్లుసేయుము. దయతో రక్షించెదవేని రక్షింపుము. నిర్మలాంతఃకరణులగు వీరల నన్యాయంబుగఁ దిట్టితిమేని మమ్మైన దండింపుము. మాకదియ ప్రియము"ని కృతాంజలులై యున్న మునులఁ గరుణార్ద్రదృష్టిఁ గనుఁగొని భగవంతుఁ డిట్లనియె. మునివర్యులారా! వీరలు భూమికిఁజని యసురులై జనియించి లోకకంటకులై చరింపుచు నాయందలి వైరంబుచే సాహసమున సంగరరంగమున నన్నెదిర్చి మదీయ చక్రానలంబున కాహుతులై నాకు సన్నిధి కేతెంచెదరు. నన్ను వైరమున నైన మనమునఁ దలఁచుటయు నాయాననంబు వీక్షించుచు నాయెదుట నంతము నొందుటయుఁ గారణంబుగ వీరు నాపదమున నివసింతురు. ఇందుకై మీరు వగలంబొగలకుండుఁడు." అనిన నా బ్రహ్మమానసపుత్త్రులు మనమున ఘనంబగు నానందంబు నొంది దేవదేవుని సెలవుగైకొని నిజనివాసంబులకుఁ జనిరి. పదంపడి యాపురుషోత్తముఁడు ద్వారపాలురఁ

గాంచి "విప్రవచనంబు లమోఘంబులగుటచే నే బల్యాధ్యుఁడ నయ్యు వాని వారింపఁజాలనైతి. అక్కారణమున మీరుభూలోకమున నసురులై జననమొందవలసె. కావున, దనుజులై జనియించి నాకుఁ బరమశత్రువులై యెప్పుడు నన్నే తలఁచుచు నాచేతఁ జచ్చినవారై నన్నుఁ జేరెదరు; వగవకుండ"ని యూనతిచ్చి రమారమణీమణితోడఁ గలసి నిర్మలంబగు తన పుణ్య మందిరమున కేఁగెను.

## — హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జననము —

దక్షప్రజాపతితనూభవయగు దితి సంతానవాంఛచే నిజనాథుఁడగు కశ్యపుఁగాంచి, "మహాత్మా! నాతోడిసవతులెల్లరును భవత్కృపాకటాక్షంబుచే గర్భంబుల ధరించి సంతసమున నున్నవారు. కాన నాకును సంతానము నొసఁగి దీనురాలనగు నను రక్షింపుము. అదియునుగాక దీపంబువలన మఱియొక దీపంబు ప్రభవించునట్లుగఁ దన ధర్మపత్నియందుఁ బురుషుఁడు తానే పుత్రరూపమున నుదయించును గదా! ఈ యర్థ మీరెఱుంగనది కాద"ని కామవిమోహితమతియై యనేక విధములఁ బ్రార్థింపఁ గశ్యపుఁడు తన ప్రియసతిం గని యిట్లనియె. "దుర్గాధిపతియైనరాజు శత్రుసంఘంబుల జయించుచందంబున భార్యాసమేతుఁడైన గృహస్థుఁడు దుర్జయంబులైన యింద్రియశత్రువర్గంబుల జయించును. కర్ణధారుఁడు నావచే సముద్రంబు దాటునట్లు గృహమేధి సర్వాశ్రమవాసుల రక్షించుచు వ్యసనార్ణవంబుఁ దరియించును. అట్లగుటచే భార్య మన

మునఁగలవాంఛఁదీర్పుట పతులకుఁగర్తవ్యంబు. అయినను ఇది సంధ్యాసమయంబు. భూతేశుఁడీవు భూతగణంబులతోఁగూడి తిరుగుచుండును. కాఁబట్టి సంతానప్రాప్తికిది సమయంబుగాదు.” అని యెంత చెప్పినను వినక తన్ను నిర్బంధింప నానిర్బంధమునకుఁ దొలఁగనేరక యాతఁడాయంగన యభిమతంబు దీర్చె.

దితియును సర్వభకులులేనిదగుటచే నిజనాథువలన గర్భం బావిర్భూతంబగుట కెంతయు సంతసించుచుండెను. అంతఁ గశ్యపుఁడు తనపత్నిం జూచి “ఇంతీ! దుష్కాలంబున నీవు గర్భంబుధరించుటం జేసి లోకకంటకులును, బుధజనపీడాకరులు నగు నిరువురు పుత్త్రులు నీకు జనింతురు. వారి దుష్కర్మముల నారాయణుఁడెత్తిఁగి యింద్రుఁడు వజ్రాయుధముచే గిరులఁగూల్చినట్లు వారల వధియించు” నని పలుక దితియు విగత కౌతుకయై “నాథా! నాపుత్త్రు లార్యుల కెగ్గొనరించి నను వారల కపాయంబు లేకయుండున ట్లనుగ్రహింపుమ” ని వేఁడుకొనెను అంత నాతఁడు తన లలనం జూచి “రమణీ మణీ! ఈయవస్థ నీవిపరీతకర్మంబున నయ్యె. అయినను నీవు దేవదేవు మనంబున నిల్పి హృదయతాప మొంది నన్ను భజియించితివి గావున నీదు పుత్త్రులలో హిరణ్యకశిపునకు భగవద్భక్తుఁడగు తనయుఁ డుదయించును. ఆతనివలన వంశమంతయు దుర్వర్ణంబగు హేమం బగ్నిముఖమునఁ బరిశుద్ధమైనట్లు, పావనముగును; వగవకుమ” ని పలుక దితియుఁ దన తనయులు కేశవునిచే హతులగుదురనియుఁ దనమనుమఁడు భాగవతోత్తముఁడగుననియు దుఃఖహర్షంబు లొందుచుండె.

ఇట్లుండ దితి శతవర్షంబులు గర్భంబు ధరియించి యంత దేవమానవ కంటకులైన సుతుల నిరువురఁగనియె. అయ్యవసరంబున ధరణి గంపంబునొందె. కులపర్వతంబులు వడఁకె. అంబుధులు గలఁగె. నక్షత్రంబులు రాలె. దిగ్గజంబులు మ్రొగ్గె. పిడుగులు పుడమిందొరఁగె. మొయిళ్లురక్తంబువర్షించె. పట్టపగలు నక్కలుకూయఁదొడఁగె. దేవతాప్రతిమ లొరగె. మొదవులు రక్తమ్ముపిదికె. ఇట్టి మహోత్పాతంబులు వీక్షించి సనకాదులుదక్క నందఱును భయవిహ్వలులైరి. కులపర్వతంబుల యాకృతినొంది వివిధరత్నభూషణకాంతులచే సూర్యుని దిరస్కరించుచున్న యాతనూభవులఁ జూడఁగోరి కశ్యపుఁడు దితిమందిరమునకుఁజని వారలఁగాంచి హిరణ్యకశిప, హిరణ్యాక్షులను నామంబులిడి తన పుణ్యాశ్రమంబున కేఁగెను. విప్రశాపంబుచే జయవిజయులిట్లుప్రథమజన్మంబున భూలోకంబున జన్మించిరి.

## — హిరణ్యాక్షుని మరణము —

అంతఁగొంత కాలంబునకు హిరణ్యాక్షహిరణ్యకశిపులు తపమొనర్చివిరించివరదానగర్వంబున నఖిలలోక పాలురజయించి సంతుష్టాంతరంగులై యెందును దమకు మృత్యుభయంబు లేక నిర్భయులై సుఖముగనుండిరి. అందు ద్వితీయుఁడైన హిరణ్యాక్షుఁడుప్రతివాసరంబునుభుజాదండంబునగదాదండంబుధరించి తన్నెదిర్చి సంగరంబు సేయంజాలినయరివీరునిం గానక భూలోకంబంతయుఁదిరిగి స్వర్లోకంబునకేఁగ,నందలి దేవతాగణంబులు గరుడునింగని పఱచు నాగంబులవలెఁ దమ నివాసంబు లర్క

నివాసంబులుగఁ గాంచనావాసంబులుగ నొనర్చి యెక్కడి కేనిం జనిరి. అంతఁ గసకాసురుండు తన మనంబున " ఈ గీర్వాణులు శౌర్యవిహీనులయి తమ సాధనంబుల విడనాడి భయమ్మొంది పాఱిరి. అయ్యో! ఏమి చిత్రమ్మ"ని తలంచి యార్చి భూరిభుజావిజృంభియై, జలధిఁ జొచ్చె. జలవిభుఁడగు వరుణుని సైన్యంబులును నాదేవాంతకుని తేజంబు దేఱిచూడఁ జాలక సముద్రమధ్యభాగమున నొదిగిరి. పిమ్మట నద్దనుజుం డమ్మహాజలధి మధ్యంబున ననేక వర్షంబులు క్రీడించి వరుణు నిచేఁ బాలింపఁబడు విభావరీపురంబున కేఁగి యప్పయోధి నాథుతో "లోకపాలురందుఁ బ్రఖ్యాతబలుఁడవని నీతోఁ గయ్యంబున కేతెంచినవాఁడ. కదనరంగంబున నాతో నంగ రమ్ము గావింపుమని" పరిహాసితోక్తులం బలుక నా పశ్చిమ దిశానాయకుం డాతని తేజోవిశేషంబును నాత్మబలంబును దలపోసి " దానవోత్తమా! ఏను యుద్ధంబులఁ బరిత్యజించి నియమంబున నున్నవాఁడ. కావున నీతో సంగరమ్ము సేయ నోప. ముకుందుఁడు తప్ప నిన్ను జయింపఁజాలు ప్రతి వీరు లెవ్వారును లోకంబున లేర"నిపలికి తనచిత్తమునఁగల రోష వహ్ని క్షమాజలంబుచేఁ దాన చల్లార్చుకొని మఱియు నిట్లనియె."అమ్మహాత్ముఁ డిప్పుడు వైకుంఠంబున నున్నవాఁడు. నీవచ్చటికేఁగితివేని యాతఁడు నీతోడఁ గయ్యం బొనరించి నిన్నుఁగడ తేర్చు. దుర్మతీ!నిందలకోర్చి సంగరరంగంబుననిలు వంజాలక భీతచిత్తులై పాఱుపందల వెంటఁబడుట పౌరుషమా? శక్తుండవేని వైళంబ యచ్చటకుఁ జనుము. అతఁడు నిచ్చలు

సమరారులఁ గోర జయించును. మఱియు నాతఁడు యుగ యుగంబును శిష్టసంరక్షణమును దుష్టనిశాటుల నాశనంబును జేయఁగోరి పురుషాకృతి నవతరించును. కావున నాతనితో రణమొనరించితివేని మేదినిఁగూలి యచ్చటి శునకాదుల కాశ్రియంబగుదువు. వేగంబ పొమ్ము."

అన నా కనకాక్షుండును భీతి యొకింతయైనను జెందక దుష్టవిమర్దనుఁడగు నా జనార్దను మర్దింతు ననుచు వికుంఠనగర మార్గంబువట్టి చనుచుండ దేవ మునీంద్రుఁ డగు నారదుఁ డతనికిఁ బ్రత్యక్షమై "దనుజేంద్ర! నీవెందుఁ బోయెద"వని యాదరంబున నడుగ నద్దానవుఁడు "మునీంద్రా! వైకుంఠనగరమునకుఁ జని దనుజసంతానంబు సంతసించు నటుల నిందిరావరు నంతంబు నొందింప నేగుచున్నాఁడన"ని వచింప నమ్మునికులాగ్రణి యా దానవనేతఁగనుఁగొని యిట్లనియె. "విష్ణుఁడిప్పుడు వైకుంఠపురంబున లేఁడు. తొల్లి విధాత జగముల సృజించుచు నాదియందు జలముల నుత్పాదించి పదంపడి సమస్తజంతువుల కాధారంబగు ధరణిని బుట్టించిన నది జలాంతర్మగ్నమైయుండె. అక్కారణమున విరించివిశ్వంభరో ద్ధరణ మెట్లు గావింతునాయని లక్ష్మీపతిఁ దనమనమున నిల్పి యాలోచించుచుండ నాతని నాసికావివరమ్ములనుండి విష్ణువు యజ్ఞవరాహ రూపమున నంగుష్ఠమాత్ర దేహుఁడై జనన మొంది చూచువార లద్భుతమొందునట్లు క్షణములో గజ ప్రమాణదేహుఁ డయ్యె. తత్సమయమునఁ బ్రజల సృజించు వారలైన మరీచ్యాది మహామునులు "ఇట్టియాశ్చర్యమెందైనఁ

గలదా? నాసారంధ్రనిర్గతమైనయీవరాహము మనముచూచు
చుండఁగనె గజప్రమాణదేహమునొంది తత్క్షణమె పర్వతాకా
రమై నిలిచియుండె" నని నివ్వెఱపడి చూచుచుండఁ గమల
గర్భుఁడు హర్షాతిశయమునఁ దన మనమున 'నా హృదయ
తాపంబు నపనయించుటకై శ్రీధరుఁడి యిట్లావిర్భవించెఁ
గాఁబోలు! ఇది యత్యద్భుతమ'ని వితర్కించుచుండ నా
మాయామయవరాహంబు రోదోంతరాళంబు నిండునటుల
ఘుర్ఘురారావంబు గావించి రసాతలగతమైన వసుంధర నుద్ధ
రించుటకై యపారమైన రసాతలంబునఁ బ్రవేశించి యచ్చోట
నున్నవాఁడు. నీవాతనితోడఁ గయ్యంబు సేయఁగోరితి వేనియచ
టి కేఁగుము అయ్యసురాంతకునితోడ రణం బవశ్యంబగు."

అని యిట్లు నారదుఁడు పలుక దానవేంద్రుఁడు
హుతాశనుకైవడి మండి భయంకరగదాదండంబు కేలఁబూని
బాహుబల మేపారుచుండఁ బాతాళంబునకుఁ జని జలమధ్య
మున నున్న దివిజారిఁ గనుఁగొనియెను. తత్సమయంబున సూక
రాకారుఁడైన నాహరియుఁ జూపులనె దనుజుని తేజమునంతయు
నపహరించి దానవేంద్రుని గుండెలుదల్లడిలునట్లుకొంతతడవు
విహరించెను. అత్తఱిఁ గనకాక్షుఁడతనిఁజూచి "యీవనచర
మెట్లు వనచరమయ్యె"నని యద్భుతమొందియయ్యాదివరాహ
ముతో "సూకర! మూఢాత్మ! రసాతలంబుననున్నయీవసుంధర
మదధీనంబు. కావుననీవీధరణిఁగొనిపోకుము. చోరభావంబునఁ
గొనిపోయెదవేని మరణంబు దప్పద" నిపలుకవరాహరూపుఁ
డగు నప్పరమేశ్వరుఁడు నిజదంష్ట్రాగ్రంబున భూదేవి యొప్ప

చుండ సాగరంబు వెలువడినఁ జూచి దురితపరోూధితరి యగు నా హరిం గాంచి దైత్యుండు "నీతో యుద్ధంబు గోరి నే నిటురా లజ్జావిహీనుఁడవై పారుట పౌరుషమా" యని యాక్షేపింపఁ బుండరీకాక్షుఁడు క్రోధారుణిత లోచనుఁడై తనమహిమచేఁ దోయములపై ధారుణి ననాయాసంబుగ నిలువఁబెట్టెను. దేవత లానందంబునొంది కుసుమవృష్టి గురి సిరి. సురదుందుభులు మొరసె. గంధర్వగాన రవంబు వీతెంచెను. అప్సరోనర్తనంబులు సెల్లె. అట్టి సమయమునఁ గమలలోచనుఁడు సమరసన్నద్ధుఁడై దనుజునిఁజూచి, "ఓయీ! నన్నదిరింపఁజాలు శౌర్యధైర్యంబులు నీకుంగలవేని రణరంగం బున నిలువుము. నీ బంధుమిత్త్రులకు దుఃఖంబు గలుగుట యోర్వవేని చయ్యనఁ దొలఁగి చనుము. యమాలయంబున వసియింపఁగాఁబోవలయు. చుట్టములఁ బొడఁగని రమ్మ"ని నిష్ఠురంబులాడ నా హిరణ్యాక్షుఁడు తోఁక దొక్కిన కృష్ణోరగంబుమాడ్కి రోజుచు గదంగొని దనుజాంతకు నెదిర్చి ఘోరంబుగ సంగరము గావించెను. అంత నయ్యిరువురును ద్రిభువనభయంకరులగుచు నసదృశవిక్రమంబులనన్యోన్యజయ కాంక్షులై పోరుచుండఁ బద్మసంభవుఁడు నిఖిలమునీంద్ర సిద్ధ సాధ్య దేవగణంబులతోడఁ జనుదెంచి ధరిత్రీనిమిత్తంబుగ రాక్షసునితోఁ బోరునాదివరాహంబుఁగాంచి,వినయవినమితో త్తమాంగుఁడై "దేవా!కలుషాత్ముఁడై నయీనక్తంచరుఁడస్మదీ యవరగర్వమున భువనంబులన్నియుఁ గారించుచున్నాఁడు. వీని వధింపక యేలయిట్లుపేక్ష సేసెదవు? సంధ్యాకాలంబగుడు

దనుజు వధింప నశక్యంబుకావున నిప్పుడ వధింపుము” నియె. అంతఁ బుండరీకాక్షుండు నసురున కభిముఖుఁడై గదగొని నడువ యాదనుజవీరుఁ డనాయాసముగ నాతనిఁ గదిసి యా సాధనముఁగ్రక్కొని సాగరంబునఁ బడవైచె. హరియును నిరాయుధుఁడై యుండ సురారి యుద్ధధర్మ మెఱిఁగినవాఁ డగుటచే సంగరంబుమాని నిలువఁబడియుండెను. మాధవుఁ డాయసురుని శౌర్యంబునకును, సంగరధర్మంబునకును,నచ్చెరువొందుచు దాన వనాథు వధింపసుదర్శనాయుధంబుఁదలఁపనదియు నిజప్రభాప టలంబుచేబ్రహ్మాండ భాండంబుఁబూరించుచు రయంబునం జను దెంచి దనుజాంతకు సవ్యహస్తంబు నలంకరించెను.దితిజుండును మాయాయుద్ధంబున కుపక్రమించి భీకర పాషాణంబులను,మల మూత్రంబులను గురియించి రక్తలోచనములుగల భూతప్రేత పిశాచ నివహంబుల నుత్పాదించెను. అంత నా లోకనాయకుండు చక్రాయుధంబుఁ బ్రయోగింప నా మాయాచక్రం బంతయు నడంగె. అక్కాలంబున దితియుఁ దన భర్తమాటలు దప్పవని తలఁచుచుండఁ బుత్త్రిమరణసూచకంబుగనాపె స్తనం బులశోణితధారలొలుకుచుండెను.దనుజేంద్రుఁడునుగృతఘ్నున కొనరించిన యుపకారములవలె మాయ లన్నియు విఫలంబు లైనను దెంపుసేసి హరితోడఁగొంతపెనంగి తుదకు మారుతా హతిచేఁ బుడమిపైఁ ద్రెళ్ళుమహీరుహము చందంబునఁ జక్రా హతిచే భూమిపైఁబడి నెత్తురుగ్రక్కుచు నసువులఁదొరంగెను.

తన తమ్ముఁడు నారాయణునిచేనిట్లు హతుఁడయ్యెనని విని హిరణ్యకశిపుఁడు రోషశోకంబులచేఁదప్తుఁడై దంతసందష్ట

దశనచ్ఛదుండగుచు విప్రచిత్తి మొదలగు దైత్యదానవులఁ గాంచి యిట్లనియె. "ఈచిత్రమును వింటిరా? మీ మిత్త్రుఁడును నాయనుఁగుఁదమ్ముఁడునగుహిరణ్యాక్షునినారాయణుఁడు వరాహరూపంబున వధించెనఁట. ఇఁక నావైకుంఠవాసుండు నాతోఁ బోరాడఁజాలక మున్నీట మునిఁగినను, వెన్నిచ్చి పాఱినను, భూమిక్రింద నణఁగియున్నను మరణము నొందించి నాయనుజునకుఁ దచ్ఛోణితంబుతోఁ దిలోదకంబు లొసఁగి మిమ్మానందింపఁజేసెద. ఈతఁడు నాచే నిహతుఁడయ్యేనేని యాయింద్రాదుల కితఁడు ప్రాణమగుటచే వారును నాచేఁ జత్తురు. కావుననిఁకమీరు నాయానతిచే సాధుజనంబుల ననేకవిధంబుల హింసించి, వర్ణాశ్రమాచారంబుల నాశనంబొనర్చి రండు." అనిన వారును నాతని యాజ్ఞ శిరసావహించి గీర్వాణుల బాధింప వారును స్వర్గంబు త్యజించియడవులకేగిరి.

అంత హిరణ్యకశిపుఁడు తన తమ్మునకుఁ బరలోకక్రియలు నిర్వర్తించి యాతనిపుత్త్రుల నోదార్చి భార్య నాశ్వాసించి పుత్త్రశోక వివశురాలైయున్న తనతల్లియగు దితిం గాంచి, "జననీ! నీసూనుండు శూరలోకంబునకుఁ జనియె. ఈలోకంబునఁ బ్రాణికోట్లు పుట్టుటయుఁ గిట్టుటయు సహజము గదా? ఏల యిట్లు వగచెదవు? నీరాగారనివిష్ట పాంథులవలె పుత్త్రాదు లొక్కతఱి తమతోఁ గూడియుండుటయు నొకవ్వాడు విడిచిపోవుచుండుటయుఁ బ్రసిద్ధంబు; కావున నీవాతని వియోగంబునకు దుఃఖింపఁబనిలేదు. ఈవిషయమై పెద్దలు 'ప్రేతబంధుయమసంవాదమ'ను నొక యితిహాసంబు సెప్పెదరు.

అద్దానిఁ జెప్పెద వినుము"ని యిట్లు చెప్పఁదొడఁగెను.

—♦ సుయజ్ఞోపాఖ్యానము ♦—

"సుశీనర దేశంబున సుయజ్ఞుండను రాజు గలఁడు. అతఁడు శత్రువుల చే సంగర రంగమున నిహతుఁడయ్యెను. అంతనాతని భార్యయు బంధుమిత్రాదులును నాశవమును బరివేష్టించి రోదనంబు చేయసాగిరి. వీరల దఃఖంబు సహింపఁజాలక యో యన్నట్లు భానుఁడును దేజోవిహీనుఁడయ్యె. తత్సమయంబున శమనుండు విప్రబాలకుఁడై యచ్చోటి కేతెంచి వాని బంధువులఁ జూచి యిట్లనియె: "వెఱ్ఱులారా! చావనివారివలె మీ రీ చచ్చినవాని కేల యేడ్చెదరు? 'జాతస్యహి ధ్రువో మృత్యుః' అను మాట మీరు వినియుండలేదా? సమస్త ప్రాణుల నెవ్వాఁడు సృజించునో, యెవ్వాఁడు రక్షించునో, యెవ్వఁడు ద్రుంచునో, యెవ్వఁ డనంతుఁడో యాతండె యిట్లు కావించుచుండును. ధనము వీథిఁబడినను దైవవశంబున నుండును. భద్రముగ దాచిపెట్టినను బోవును. అడవిని రక్షకులు లేనివారు బ్రిదికియుందురు. గృహమందు రక్షకు లెందఱు న్నను జత్తురు. ఈభూపాలుఁడు నిద్రఁబోవుచున్నాఁడు. ఏల విలపించెదరు? భాషించువాఁడును నాలకించువాఁడును నెచ్చటికో యఱిగెను. వీరు నా చెలులనియు, నీపె నాతల్లియనియు, నాతండు నా తండ్రియనియును వివేకంబులేమిచే భ్రాంతి నొందుదురు. తత్వజ్ఞులు నిత్యానిత్యంబులఁగూర్చి సుఖదుఃఖంబులఁ జెందరు. అజ్ఞులు కొందరు యోగవియోగంబులకు సుఖదుఃఖముల నొందుదురు.

"తొల్లి యొక మహారణ్యంబున ఖగముల కంతకభూతుం డైన బోయవాం డొకండు గలండు. అతం డొక్కనాం డుదయంబుననె లేచి వల లురులు మొదలగు సాధనములంగొని వేటకుంజని యావిపినంబునం గల పక్షుల నంతము నొందించి యడవి పిచ్చుకల జంటంగాంచి యారెంటిలో నాడుపిచ్చుకను జిక్కంబులో వైచిన మగ పిచ్చుక యిట్లని విలవించె. 'మన మీ యడవుల మేంతమేయుచు నెవ్వారికి నెగ్గుసేయక విహరించుచుండ నాపాపపుదైవ మీ కిరాతుచేతిలోం బడునట్లు విధించె. అయ్యో! ఏమిసేయువాండ? మనల నిద్దఱ నొకచోట వసింపనీక విధి యిట్టిపాపమున కొడిగట్టె. అక్కటా! ఱెక్కలులేని పసికూన లతిదైన్యముతోం దల్లి యెరం దెచ్చునని నిక్కినిక్కి చూచుచుండునుగదా? ఇట్లు దుఃఖించుచుండ నాకిరాతుం డొక్కకోలంగొని యాకుళింగపక్షిని గూలనేసె. కావున నెట్టిగుణవంతులును కాలంబుడాసిన నీలోకంబున నుండంజాలరు. నా మాటలు విని మీరలు దుఃఖమును మాని యుండుండు." అని యిట్లు విప్రబాలకుండు బోధింప సుయజ్ఞుని బంధువులందఱును వెఱగుపడి శోకంబు విడనాడి సుయజ్ఞునికి నుత్తరక్రియలు నిర్వర్తించిరి. అంతం గపటబాలకుండై క్రీడించుచున్న యముండును నంతర్హితుండయ్యెను." అని యీయితిహాసంబు హిరణ్యకశిపుండు తన తల్లికిని మఱదండ్రకును జెప్ప వారలు ప్రపంచ మనిత్యంబని యెంచి విగతశోకులైరి.

— హిరణ్యకశిపునకు బ్రహ్మ వరము లిచ్చుట —

పదంపడి హిరణ్యకశిపుండు త్రిభువన సామ్రాజ్యంబును, నజరామర భావంబును, నఖిలశత్రుజయంబును, సింహబలంబును గోరి మందరాద్రి కేఁగి యచ్చటనూర్ధ్వబాహుఁడై కాలిబొటనవ్రేల నిలువంబడి బ్రహ్మదేవునిగూర్చి పరమ దారుణంబైన తపంబు సేయుచుండె. అట్టియెడ నిర్జరులు తమ నెలవుల కేఁగిరి :

త్రిభువన సంతాపకరంబయిన నాతపోవిజృంభణమున కోర్వఁజాలక యమరవరులు స్వర్గంబువిడిచి సత్యలోకమునకుఁ జని లోకేశ్వరుఁడైన యావిధాతకు సమస్కరించి యిట్లు విన్నవించిరి. " దేవా! దైతేయుని తపంబు వేఁడిమిచే నతితప్తుల మైతిమి. నీ వెటుల తపోబలంబుచే జగముల నిర్మించి యింద్రాదులకంటె నెక్కువగఁ బ్రకాశించుచుంటివో యటులనే హిరణ్యకశిపుఁడు దన తపోమహిమచేఁ దానును సృష్టికర్త గాఁదలఁచియున్నాఁడు. కావున నాదైత్యుని తపస్ఫూర్తి నివారించి లోకములఁగాపాడుము. "అని యిట్లు విన్నవింప నానలుమొగంబుల వేల్పు భృగుదక్షాదులతోడ మందరంబున కేతెంచి యందు నియమయుక్తుండును జీమగమిచే నపహృతంబయిన రక్తమాంస చర్మండును మహాతపఃప్రభావ సంపన్నుఁడు నయిన సురవైరిఁ బొడఁగని యద్భుతమునొంది నవ్వుచు "ఓ యసురాధిపా ! నీ తపంబునకు మెచ్చితి. నీవలె ని ట్లుగ్రంబుగఁదపంబు గావించినవారును, నిఁకఁగావించువారును లేరు. కావుననీయభీష్టంబు లిత్తు వేఁడుము. జలాన్నంబు లొల్లక యిట్లు

శతవత్సరంబు లుగ్రతపంబుసేయు నీప్రాణంబు లెట్లుండె? మమ్ముఁదపంబున గెల్చితివి. వరము లిచ్చెదఁ గోరుమ"ని పలికి కమండలు జలంబుల నాతనిపైఁ బ్రోక్షించెను.

అంత వజ్రసంకాశ దేహుఁడగు నానిశాచరేంద్రుఁడు వివిధప్రాణి లలాట లేఖన మహావిద్యానుసంధాత యగు నావిధాతకు మ్రొక్కి యనేకవిధంబుల స్తుతించి, "దేవా! కోరినవారల కోర్కెల నొసంగ నేర్పుగలనీవు నా కోరికల నొసఁగుదు నంటివి. అట్లయినఁ బంచభూతములవలనను, దిక్కులను, రాత్రిలను, దివంబులను, సమస్తప్రాణులవలనను సమస్తశస్త్రంబులవలనను, మృత్యువులేని జీవనంబును, రణంబుల నా కెదురులేని శౌర్యంబును, లోకపాలుర నతిక్రమించు మహిమయు, భువనత్రియ జయంబును దయచేయుమ"ని వేఁడుకొనియె. ఇట్టి దుర్లభంబులయిన వరముల నిచ్చి కరుణించి యావిరించి, "అన్నా! కశ్యప పుత్రా! ఇట్టి వరముల నెన్నఁడు నెవ్వరును గోరరు. అయినను నీవు కోరితివి కావున నీతపంబునకుమెచ్చి యిచ్చితి.బుద్ధిసంపన్నుఁడవై యుండుమ"ని యానతిచ్చి దేవగణంబు పరివేష్టింపనిజనివాసంబునకుఁజనియె. కనక కశిపుఁడునునారాయణుఁడు సోదరుఁజంపెనన్న యీర్ష్య చే దామోదరుపై వైరంబుఁబూని గంధర్వులఁ బరిమార్చుచు, గ్రహములఁ గట్టివైచుచు మనుజుల మదమడంచుచు విద్యాధరాదుల విధ్వంసంబు గావించుచు, దిక్పాలుర పట్టణంబులఁ

గొనియె. మఱియు నతండు మహేంద్రభవనంబు సొచ్చి యింద్రసింహాసనం బధిరోహించి యున్నయెడ నమరులు నానావిధంబులగు కానుకల నర్పించి యాతని సేవించుచుం దురు. ధారుణిలోఁగల భూసురులు యాగములు సేయ దేవ తలు లేక తానే యాహవిర్భాగముల ననుభవించును. వేయేల? అతని వలని భయముచే భూమి దున్నకయే పండుచుండును. మహీరుహము లఖిలర్తుగుణములచే నతిశయించుచుండును. ఇట్లు మహదైశ్వర్య సంపన్నుండై రాజ్యము సేయుచుండ దేవతలు దైత్యుని బాధలకుఁ దాళఁజాలక యాపన్నగతుల్వఁ గాన నేఁగి యాతనికి మొఱలిడ, నా దేవ దేవుఁడు వారలం జూచి "దితిసుతవ్యాపార భాషావిపర్యయమును, మీయుద్దేశ ములను నే నెఱుఁగుదు. భీతిఁజెందకుఁడు. ఆ రాక్షసాధముఁ డెన్నఁడు శుద్ధసాధుల హింసించునో, శమదమ సంపన్నుఁ డును మద్భక్తుఁడునగు నిజపుత్త్రి నెవ్వఁడు బాధించునో యప్పుడే నాచే నంతంబు నొందును. విరించివరదాన గర్వం బుచే నాతఁడిట్లు గావించుచున్నాఁడని భావించెదను. అయి నను నాతని వధించుటకు సమయమిది కాదు. కావున నా మాట లను విశ్వసించి మీ నెలవులకుఁ జనుఁడ"ని యానతిచ్చిన నిలింపులును బరమేశ్వరునకు నమస్కరించి దనుజునిమరణంబు నిశ్చయించి తమ నెలవులకుఁ జనిరి.

## —♦ ప్రహ్లాద చరిత్ర ♦—

అంత హిరణ్యకశిపునకు నలువురు సుతు లుదయించిరి. అందు సర్వభూతదయాపరుఁడును, బరస్త్రీలఁ దల్లులవలెఁ

జూచువాఁడును, దీనుల జననీ జనకులవలెఁ బ్రోచువాఁడును, బరిహాసమునకైనను బొంకనివాఁడును నగు ప్రహ్లాదుఁడను పుత్త్రుండు గర్వము లేనివాఁడై యింద్రియజయంబు గలిగి యంతశ్శత్రువుల నెదిరించి హరియందుఁ జిత్తమ్ము గీలించి ప్రపంచమ్ము మఱచియుండును.

సుగుణగణంబు లన్నియు నాతనిఁజొచ్చి యెల్లప్పుడు నెడఁబాయక యుండుటచే నాతఁడు విష్ణుసమానుఁడని చెప్ప నొప్పును. పగవారును నాతనిచరితంబు సభలందుఁ బ్రశంసించుచుందురు. మఱియు నాబాలుఁడు సర్వకాల సర్వావస్థల యందును దేవునియందుఁ జిత్తంబుసేర్చి యుండును. బుధజన విధేయుండును సద్గుణగరిష్ఠుండును భాగవతోత్తముఁడు నగు తనయునిఁజూచి నిజజనకుఁడు సంతసింపక తనమనమున నిట్లని వితర్కించె. "నాపుత్త్రుఁడు విద్యాభ్యాసము లేక జడునిపగిది సంచరించుచున్నాఁడు. ఎట్టి రత్నమయినను సానపెట్టక యెట్లు ప్రకాశింపదో యటులనే యెట్టిబాలుఁడును గురుజన శిక్ష లేక ప్రకాశింపఁడు. విద్యాభ్యాసము చేయింపమి తల్లిదండ్రులదోషంబు. ఈతఁడు గురుశిక్షచేతఁగాని చక్కఁబడఁడు. కావున గురువులయొద్ద చదివించెదను." అని నిశ్చయించి శుక్రనందనులగు చండామార్కుల రావించి నమస్కరించి "గురువర్యా! మీరు మాకు గురువులును బంధువులును గావున లోకజ్ఞాన మిసుమంతయు లేక యంధునివలెనున్న యీ నాపుత్త్రుని శిష్యునిగాఁ గైకొని వీనిఁ గుశలునిగ నొనరింపుఁడ"ని యనేకవిధంబుల నాతనిఁ బ్రార్థించి ప్రహ్లా

మని నాతని కొప్పగించెను. అంత నాభార్గవనందనులు సవయ స్కులగు రాక్షసబాలురం గొందఱం గూర్చి, పెక్కు శాస్త్రములు పఠింపించిరి. ఆ పరమ భక్తుండును నిసుమంతయైనం జలింపక పురుషోత్తము మనంబున నిల్పి యాతండు సెప్పు వానిని దప్పక చదువుచుండెను గాని యాచదువునం దతని కావంతయైన విశ్వాసము లేకపోయెను.

అంతం గొంతకాలమునకు దనుజేశుండు తన కుమారుని విద్యాప్రావీణ్యమును జూడంగోరి చారులచేం బుత్త్రుం బిలువ నంపెను. ఆతండును దండ్రియెదుట వినయ వినమితగాత్రుండై నిలువంబడియుండ నాతనితొడపైంగూర్చుండంబెట్టుకొని 'పుత్రా తనయుల సంభాషణము లేతండ్రులకుంగర్ణభూషణములుగదా? నీకేది మేలని తోంచుచున్నదో దాని నాకుం జెప్పు"మని బుజ్జగించియడుగ నాతండు తండ్రింజూచి "శరీరధారు లందఱును మీరు మేమను భేదబుద్ధి విడనాడి యందఱును దేవుని బిడ్డలనియే భావించి విష్ణునందుం జిత్తముంజేర్చి తామరణ్యములోనైననుండుట మేలని తోంచుచున్నద"ని చెప్పెను. తండ్రియు నాతనిమాటలకు సంతోషింపక నగుచు పుత్త్రుని జూచి "కుమారా! మన దానవసమాజమునకు విష్ణువు పరమ శత్రువైయుండ నాతని మాటిమాటికిం దలంచెదవు. ఈబుద్ధి నీకె తోంచెనా ? చండామార్కులు బోధించిరా?" యని యడుగ నాబాలుండు "తండ్రీ! పెక్కుమాట లేల? అయస్కాంత సన్నిధిని యినుమెట్లుచలించునో యటులనే యాపురుషోత్తము సన్నిధిని నామనంబు చలించుచుండును. మందారమకరందంబుం

జవినూచు భృంగంబు దత్తూరంబులకుఁ జననిచందమునను, స్వర్ణదీతరంగములఁ దిరుగు రాజహంస జలాశయముల కేగ నటులను, రసాలపల్లవంబుల మెక్కి చొక్కియుండు కోయిల కుంకుడుచెట్లఁ జేరనిరీతిని నిండుచందురుని వెన్నెలల కానందించు చకోరంబు దట్టమగుమంచుబిందువులకుఁ జననిమాడ్కిని దేవ దేవుపాదారవిందమకరందపానముచే మత్తతనొందియున్న నా మనం బితరులఁ జేర నేరద”ని వచింప నుపాధ్యాయుఁడును గోపించి “వత్సా! నేఁజెప్పిన శాస్త్రములోని విషయము నెంతమాత్రమును జెప్పక రాక్షసకులాంతకుఁ బ్రస్తుతించుచు రాక్షసరాజునొద్దఁ దలవంచుకొనునట్లు చేసితివి. ఇఁక నిన్నుఁ గఠినముగ శిక్షించెద”ననుచు సామదానభేదదండోపాయము లును, ద్వివర్గపాఠములును బోధించి నీతికోవిదుఁడయ్యెనని నిశ్చయించి తల్లికి నెఱిఁగించినఁ దల్లియుఁ దనయునిగాంచి సంత సించి రత్నాభరణంబులచే నాతని నలంకరించెను. అంత గురుండు ప్రహ్లాదునిబుజ్జగించి దానవేశ్వరునొద్దకుఁ దోడి తెచ్చి యాతనికి మ్రొక్కించెను. దైత్యభర్తయును దన నందనుని ముద్దుగొని శిరంబు మూర్కొని మందమధురాలాపంబుల నిట్లనియె. “పుత్రా! నీతోడి దైత్యార్భకులందఱును నీతి శాస్త్రములఁజదివి యర్థంబులఁజెప్ప దక్షులై యున్నారు. నీ కే పగిది గురువులు బోధించిరో, నీ వెట్లు పఠించితివో నీవిద్యాసార మెఱుఁగఁగోరుచున్నాఁడను. ఒక్క పద్యంబుఁ జదివి తాత్పర్యంబు భాషింపుమా!” అని యిట్లడిగిన తండ్రికిఁ బ్రహ్లాదుండు,

'చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థ ముఖ్య శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మమెల్లఁ జదివితి తండ్రీ.'

అని విన్నవించె. వెఱపును మఱపును లేక పలుకు కొడుకు నుడువులు చెవులకు ములుకులవలె నాటిన నదరిపడి సురవైరి గురుసుతుని గనుఁగొని, "కపటవిప్రా! నా తనయు నీతి శాస్త్రములఁ జదివించెదనని గొంపోయి మా కనర్థములగు విరోధిశాస్త్రములఁ గూరుఁడవై బోధించితివి. నీవొక భూసురుఁడవే? కటకటా భార్గవుఁడవని నమ్మితిఁగదా!" యనియెను. అంత నా పురోహితుఁడు వడవడ వడంకుచు "దానవనాథా! మా వలన నేయపరాధంబును లేదు. పరులెవరును నీపుత్త్రునకు నీవిషయమును బోధింపరు. ఇదంతయు నితనికిఁ బ్రకృతిజన్య గుణము" అనిన గురుపుత్త్రునిఁ గోపింపక దైత్యవల్లభుండు కొడుకు నవలోకించి "ఆచార్యుఁడు బోధింపక యీబుద్ధి యెట్లు నీకు జనియించెనో భీతిఁజెందక తెలుపుము" అన నాతఁడు

'అచ్చపుఁ జీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్విత చర్వణులైనవారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు చెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గాననకు నేగిననైన హరిప్రబోధముల్.'

అనిపలికిన కొడుకును ధిక్కరించి ముక్కవనేయక రక్కసుల ఱేడు మంత్రులఁగాంచి యిట్లనెను. ఈబాలుఁడు తన పిన తండ్రిని వరాహరూపంబున విష్ణుఁడు సంపెనన్న విరోధమును మాని యాతని బంటువలెఁ బొగడుచున్నాఁడు. ఇట్టివాని నెందైనఁ

గంటిరా? జనకద్రోహియగు వీనిఁ గొంపోయి నాపుత్త్రుఁడని మన్నింపక యిపుడె వధింపుఁడు.

'అంగవార్త్రిఠములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష సేయు క్రియ నీ యజ్ఞాం గులద్రోహి దు
ష్టాంగుం గేశవపక్షపాతి వధముం జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదం గులము నిర్దోషంబు గావించెదన్.'

అని దానవేంద్రుండు వలుక పెక్కండ్రు రక్కసులుక్కు మిగిలి శూలహస్తులై యనేకంబులగు హింసాకర్మంబు లాచరించిరి. నిశాచరులిట్లు తన్ను హింసించుచుండ మాటిమాటికిఁ నా బాలుఁడు "మహాపన్నశరణ్యా! దనుజభంజన! పరమ పావన!" యని నారాయణు నుతించునుగాని భయముచేఁ గంపము నొందఁడు. కన్నుల నీరు దేఁడు. కావరే యనఁడు.

ఇట్లు రాక్షసేంద్రుఁడు తన యనుచరులచేఁ జేయించు మారణకృత్యంబులు దుష్టులకొనర్చు మేలులవలె విఫలంబు లగుటఁ జూచి తనమనంబున "వీఁడు నేఁజేయు ఘోరకర్మంబుల కణుమాత్రంబయినను జలింపక విష్ణుధ్యానంబుగావించుచున్నాఁడు. ఇట్లపాయరహితుఁడై యుండుట కేమిహేతువో?" యని శంకించుచు దిగ్గజంబులచేఁ ద్రొక్కించియు, విషసర్పంబులచేఁ గఱపించియు, సాగరంబుల ముంచియు, ననలంబునఁ ద్రోయించియు, గరళంబు మ్రింగించియు, నభిచార హోమంబులఁ జేయించియు, నెండవానల నిలువఁ బెట్టియు, వాయువున సున్ముఖుఁ గావించియు, భూమియందుఁ బాతించియు, నవరంధ్రము లుక్కఁబట్టియు ననేక

మారకోపాయంబులఁ బరమపావనుఁడగు నా బాలుని జంపఁ జాలక మనంబునఁ "నే నెన్నివిధంబుల హింసించియు నీతనిఁ జంపఁజాలనైతిని. నిక్కమారయ నితఁడు జీవనౌషధము లయిన నెఱుఁగఁడు. రక్షకు లెవరును లేరు. నైజ తేజము వలననే మెఱయుచున్నాఁడు. వీఁడు మహా ప్రభావ సంపన్నుఁడు. వీనితోడి విరోధమున నాకు మృత్యువుసిద్ధించు" నని నిర్ణయించి విషణ్ణుఁడై చింతించుచున్న రాజును జూచి చండామార్కులు "వక్రుండైనవాఁడు వృద్ధగురుసేవచే మేధా వంతుఁడగు. కావున నీతని యాచార్యుఁడగు శుక్రునొద్దకుఁ బంపుము. ఆమహాత్ముఁ డితనికి నయంబునను భయంబునను బుద్ధిచెప్పి మంచిమార్గమున నడిపించున"ని చెప్పెను.

అంత నారక్కసుల ఱేఁడు గృహస్థులగు రాజుల కుపదేశింపఁదగిన ధర్మార్థకామంబులు ప్రహ్లాదున కుపదేశింపుఁ డని గురునకాజ్ఞాపింప వారును నాతనికట్ల యుపదేశంబుసేసిరి. రాజనందనుఁడు గురూపదిష్ట శాస్త్రంబులు మంచివని తలంపక గురువులు కర్మానుష్ఠానంబునకుఁబోయిన సమయంబున నా బడిపిల్లలఁ జేరఁజీరి "బాలకులారా! మన యొజ్జలు చెప్పు విద్య మంచిదికాదు. నేఁజెప్పునది వింటిరేని మీరు శుభములు పొందఁగలరు. మనతోడిబాలురు మనల విడనాడి పోవుట చూచియుంటిరిగదా? అటులనే మనమును నేక్షణముననోయీ లోకంబు నెడబాయవలసి వచ్చును. సకల జన్మంబులందును ధర్మాచరణసమర్థం బయిన మానుషజన్మంబు దుర్లభంబు. అందు మగవాఁడై జనించుట దుర్గమంబు. అదియును శతవర్ష

పరిమితంబైన జీవితకాలంబున నియమితంబైయుండు. అందు సగంబు రాత్రిరూపంబున నిద్రాదివ్యవహారంబులనియమితమై యుండు. మిగిలిన యేఁబది వత్సరంబులును ప్రయాసవృత్తిచే గతించు. ఆయువు చంచల మగుటచేఁ బ్రాణులకు సుఖంబు లేదు. బాలకుఁడై యొక్క క్షణంబు, యువభావంబునఁ గొంత కాలంబు, దరిద్రుఁడై కొన్నిదినంబులు, ధనవంతుఁడై కతిపయ వాసరంబులు, జరాభరంబుచేఁ గొంతసమయంబు నటుని యట్లు నటించి తుదకు మానవుఁడు యమ సదనంబును దెరయందుఁజొరఁబడు. కావున మీరు శైశవంబుననె యాది దేవుఁడగు విష్ణు నాశ్రయింపుఁడు. విషయాసక్తులగు రక్కసులతోడ మనకుఁ బొత్తు వలదు. విషయంబులఁ జిక్కువడిన రక్కసులకు హరిభజనంబు శక్యంబుగాదు. కాఁబట్టి యసుర భావంబువిడిచిమీరు సర్వభూతంబులందును దయాసుహృద్భావంబులు గలిగి యుండుఁడు. అట్లయిన నధోక్షజుఁడు సంతసించు. ఆతఁడు సంతసించిన మనకునలభ్యం బెయ్యదియు లేదు. నరనారాయణులు మైత్రితో మెలఁగుచు నారద సంయమీంద్రున కీవిషయము బోధించిన నా మహానుభావుఁడు నన్నుఁ గరుణించి యీజ్ఞానంబు నా కుపదేశించె" నని వారలకు బోధించె. వారును వెఱఁగుపడి యాదానవరాజ కుమారునిఁ జూచి "మనము శుక్రనందనుని యొద్ద నన్ని శాస్త్రంబులఁ జదువుచుంటిమి. మఱియొక గురుఁడు లేఁడు గదా! ఈరాజశాల ఫాలాక్షుఁడును జొఱవెఱచు. ఏ మతిమంతుఁ డీజ్ఞానము నీ కుపదేశించెనో? నీ కీబుద్ధిప్రకాశ

మెట్లు కలిగెనో ? దయయుంచి మాకుఁ దెలుపుము. అట్ల యిన రాజవనుచు నిన్నె సేవించి, నిను గౌరవించి, నీయాజ్ఞ శిరసావహింతుమ”ని యడిగిన భాగవతోత్తముఁడైన ప్రహ్లా దుఁడు తనకుఁ దొల్లి వినఁబడిన నారదుమాటలు దలఁచి యిట్లు వారలకుఁ జెప్పఁ దొడఁగె.

“తొల్లి మాతండ్రి హిరణ్యకశిపుఁడు మందర పర్వత మునకుఁ జని యత్యంత నియమంబునఁ దపంబు గావించుచు గత కల్మషుఁడైయుండ భీతిఁజెంది నిర్జరులు సంరంభమున యుద్ధార్థులై మాపురమున సొర, దానవులు భయభ్రాంతులై నిజ నివాసంబులు విడిచి తమ ప్రాణంబులఁ గాపాడుకొను టకై యెందేనిఁజనిరి. అంత గీర్వాణులు రాజనివాసంబు గొల్లపెట్టి ధనధాన్యాదుల నపహరింప, నమరేశ్వరుఁడు శంకిం పక యిల్లుసొచ్చి లజ్జచేఁ దప్తయై విలపించు మాతల్లిఁ జెఱఁ గొనిపోవుచుండె. దైవ యోగంబున నారదుఁడు నాపురు హూతునిఁ బొడఁగని ‘దేవేంద్రా! పుణ్యమూర్తివగు నీ వీ మానిని నేలపట్టెదవు ? ఈకాంతామతల్లి కల్మషమానసు రాలు కాదు. కావున వైశంబ విడువుమ’నియె. అంత నా దేవమునిఁ జూచి సహస్రాక్షుఁడు ‘ తాపసోత్తమా! ఇమ్మానిని గర్భంబున సురారి తేజం బత్యంతసమృద్ధి నొంది యున్నది. అక్కారణంబునఁ బ్రసూతి పర్యంతము చెఱ యందుంచి జనితార్భకుని వజ్రధారచేఁ దునిమివైచెద’నని రోషంబునఁ బలికె. అంత నాపురందరుఁగనుఁగొని నారదుఁడు ‘ఈదైత్యాంగనా గర్భస్థుఁడగు బాలుఁడు పరమ భాగవతో

త్తముఁడు. కావున సంగ్రామాద్యుపాయంబులచే మరణంబు నొందఁడ'ని యానతిచ్చిన నతని వచనంబుల మన్నించి యాతఁడును హరిభక్తుఁడు గావున మా యమ్మను విడిచి దేవలోకమున కేఁగె. నారదుఁడును మజ్జననియందుఁ బుత్రికా భావంబుంచి యూరడించి తనయాశ్రమంబునకుఁ గొనిపోయి 'తల్లీ! నీవు పరమపతివ్రతవు. నీగర్భంబునఁ బరమభాగవతుఁ డయిన ప్రాణి యున్నవాఁడు. తపంబుచేఁ గృతార్థుఁడై నీభర్తయు రాఁగలఁడు. అంతదనుక నీవు నాయాశ్రమంబున నుండుమ'నిన నా కాంతారత్నము సమ్మతించి యిసుమంతయైనను భయముఁజెందక నాథురాక కెదురు సూచుచు నారదునకు శుశ్రూషసేయుచుండె. నారదుఁడును నాశ్రిత రక్షావిశారదుఁడు గావున గర్భస్థుఁడనైన నన్ను నుద్దేశించి నిర్మలజ్ఞానంబు నుపదేశించె. ఆఁడుది యగుటచే మాజనని పరిపాటిలేక సూటిదప్పి యాజ్ఞానంబు మఱచె. నారదు నను గ్రహముచే నొక్కనాఁడైనను నాకు మఱవు పుట్టదు. మీరలు నా వచనముల విశ్వసించి సర్వభూతములందును నీశ్వరుఁడు గలఁడని సమ్మానంబు సేయుచు నరిషడ్వర్గంబుల జయించి యింద్రియముల బంధించి భక్తిసేయుచుండిన విష్ణుదేవునియందలి గతి సిద్ధించు. భక్తిచే భగవంతుఁడు చిక్కి నట్లు వ్రతములఁ గ్రతువుల దాన శౌచ శీల తపంబులఁ జిక్కఁడు. కావున మీపుస్తకంబుల నెల్ల నాచార్యున కొసఁగి యేకాంతంబునకు రండు. ఒల్లని వారు కర్మపుంజంబులపాలై పొండు."

అని యిట్లు ప్రహ్లాదుఁడు రహస్యంబున నయ్యైవేళలఁ దనతోడిబాలురకు మోక్షమార్గంబు నెఱింగించిన వారును గురు శిక్షితములగు చదువులు పాలించి దేవదేవుని సేవించు చుండిరి. వారలభావంబు నెఱిఁగి శుక్రనందనుఁ డద్భుతంబు నొంది శక్రవైరిఁగాంచి "రాక్షసేంద్రా! నీతనూజుఁడు దానవ బాలుర నెల్లఁ జేరఁదీసి నాబోధలన్నియుఁ గల్లలనియాక్షేపించి యందఱ విష్ణుదాసులఁ గావించినాఁడు. మోసంబు వాటి ల్లెన"ని చెప్ప నాతఁడు పాదాహతంబైన భుజగంబు భంగిఁ బవనప్రేరితమగు దావాగ్నివిధమునను దండతాడితంబైన కేసరికైవడి రోషరసావేశ జాజ్జ్వల్యమానచిత్తుఁ డగుచు నరుణీకృతనేత్రుఁడై తనయు రప్పించి యశనిసంకాశ భాష ణంబుల నదల్చుచుఁ దనయునితో "జనకద్రోహీ! నాయాదే శంబులేక రవి మింట మెఱయుటకును, గాలి వీచుటకును, అగ్ని వెలుగుటకును, శమనుఁడు ప్రాణులఁజంపుటకును వెఱచుచుం దురు. త్రిలోకాధిపత్యంబు ననుభవించు నిందుఁడును నా యెదుటఁ దల యెత్తఁజాలఁడు. నీవెట్లు నాయాజ్ఞ నుల్లం ఘించి యిట్లు వర్తించుచుంటివి? దుర్మతీ! ముల్లోకంబులం దును బలవంతుఁడ నగు నేనుండ నెవ్వని బలమున నాకుఁ బ్రతివీరుఁడవై యిట్లు ప్రేలుచుంటివి?" అనిన నాతండు,

'బలయుతులకు దుర్బలులకు బలమెవ్వఁడు? నీకు నాకు బ్రహ్మాదులకుఁ బలమెవ్వఁడు? ప్రాణులకును బలమెవ్వం డట్టివిభుఁడు బల మసురేంద్రా.'

"తండ్రీ! 'సర్వం విష్ణుమయం జగత్'ని వినియుండ లేదా? నారాయణుఁడె లోకములన్నియుఁ గల్పించు, రక్షించు,

ఖండించును. అన్నిరూపములందును నాతఁడు గలఁడు. అసుర భావంబుమాని సమచిత్తుఁడవై యాతని సేవింపుము. లోకము లన్నియు గడియలోపల జయించితివిగాని నీయాంతశ్శత్రువుల నార్వుర జయింపవైతివి. వానిజయించితివేని లోకంబున నీకు విరోధియనువాఁడుండఁడు. కావున నామాటల నాదరించి కేశవుని నమ్మియుండుమ"నియె. అంత నద్దనుజవిభుఁడు ప్రహ్లాదుఁ గాంచి "వత్సా! తొల్లి విష్ణుఁడు నాతమ్ముని జంపఁ బల్మాఱు నేనతని వెదకితి. ఎచ్చటను గానరాఁడయ్యె. అతఁ డెచ్చట నుండునో చెప్పుమ"ని పలుక నాతఁడు హృదయమున హరిం దలఁచి నర్తనంబు సేయుచు నిట్లనియె.

"కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలన్ ?
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి! వెదకంగా నేల నీయాయెడన్.
"ఇందుఁగలఁ డందు లేఁడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన నందందే గలఁడు దానవాగ్రణి! వింటే!"

ఇట్లు భక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదుఁడు వచింప భక్తవత్సలుఁడగు నారాయణుండు అఖిలజంగమస్థావర గర్భంబుల శ్రీనృసింహాకృతి నుండె. అత్తఱి దానవవిభుఁడు పుత్త్రుంగాంచి "వత్సా! విష్ణుం డన్నిదేశముల నుండునంచుఁ బలికితివి. ఈసభాస్తంభమ్మునం జూపెదవా?" యన నాతఁడు "అంతట నిండియుండు నావిభుఁడు స్తంభాంతర్గతుండై యుండుట కే సందియమ్మును లేదు. నిక్కంబు పరీక్షింపుమ"నియె.

—• హిరణ్య కశిపుని మరణము •—

అంత నాతఁడు గ్రక్కున గద్దియ డిగి యా భాగవతో త్తము ధిక్కరించుచు మదాతిరేకంబున నఱచేత స్తంభంబు వేయ మహా ప్రభావుఁడయిన నృసింహ దేవుఁ డావిర్భవించినఁ గనుఁగొని యాదనుజేంద్రుఁడు,

"నరమూర్తిగాదు; కేవల హరిమూర్తియుఁగాదు; మానవాకారముఁగే సరియాకారము నున్నది; హరిమాయారచితమగు యథార్థమునూడకే!
"తెంపున బాలుఁడాడిన సుధీరత సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపఁ దలంచి యిందు నరసింహశరీరముఁదాల్చి చక్రి •
క్షింపఁగ వచ్చినాఁడు హరిచే మృతియంచుఁ దలంతు నైన నా
సొంపును తెంపు నందఱను జూడఁ జరింతు హరింతు శత్రువున్."

అనుచు మహోద్దండంబగు తన గదాదండంబు గిరగిరఁ ద్రిప్పుచు నరకేసరి కెదురు నడచిన దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబును బోలెఁ దదీయ దివ్య తేజంబునం జేసి యాదనుజేంద్రుఁడు నిర్గత ప్రభుఁడయియుండె. అంత నానరహరి నేర్పున దితిపట్టిం బట్టుకొనినఁ గట్టలుక నయ్యసురవరుఁడును దృఢ బలంబునఁ బట్టు తప్పించుకొనియె. నిలింపులునుగుంపులుగూడి భయంబున నిబిడ నీరద నికరంబు మాటున డాగి మూఁగి యాఘోర సంగరంబుల వీక్షించుచుండిరి.

ఇట్లుభయులును గొంతసేపు బహుభంగులఁ గలహ విహారంబు సలుపు నవసరంబున నరసింహుఁడు నతని హీన సత్వునిగా నెఱింగి ఫణీంద్రుఁడుమూషికంబునొడిసిపట్టినట్లుఁ బట్టుకొనిన నా సురవైరియుఁ బ్రాణభీతిచేసుడివడుచు నాతనికి

లోఁబడె. అంత నర మృగేంద్రుఁడు సాగ్రహుఁడై యాతని నూరువులందుఁ జేర్చి నఖ సంఘాతమ్ముల వ్రచ్చి ప్రేవులు గంఠమాలికలుగ ధరించె. ఇట్లంకగతుఁడైన దైత్యుఁ గేవల నరరూపంబును మృగరూపంబునుగాని నరసింహ రూపంబు నను, రేయియుఁబవలునుగాని సంధ్యాసమయంబునను, అంత రంగంబును బహిరంగంబునుగాని సభాద్వారంబునను, గగనంబును భూమియునుగాని యూరులమధ్యంబునను, ప్రాణసహితంబును బ్రాణరహితంబును గాని నఖంబులను ద్రుంచి తన భక్తుఁడగు ప్రహ్లాదున కభయ మొసఁగి యాదరించి రణసంరంభము సాలించె. అత్తఱి దేవాంగనలు హర్షమున గుసుమ వర్షంబులు గురిసిరి. మింట గంధర్వగానంబులును నప్సరోగణనర్తనంబులును బ్రకాశమానంబులయ్యె. ఇట్లు నిజమందిర ద్వారపాలురు జయవిజయు లిరువురు విప్రశాపంబునఁ బ్రథమజన్మంబున దితిపుత్రులైన నా హిరణ్యాక్షహిరణ్యకశిపులను విష్ణుదేవుఁడు వరాహనారసింహ రూపంబుల నవతరించి వధియించెను.

# రెండవ భాగము

## కుబేరుని జననము

కృతయుగంబున మహాజ్ఞానియు శాంతాత్ముఁడును గృపామతియునగు పులస్త్యుఁడు బ్రహ్మదేవునకుఁ బుత్త్రుఁడై జనించి యసమానప్రభావిభాసియై యలరారుచుండెను అమ్మహామహునకుఁ దృణబిందువను రాజర్షి పుత్త్రియందు వాసుదేవరూపధ్యానారక్తప్రభానిరస్తతముఁడును నాగమరహస్యవేదియునగు విశ్రవుఁడను తనయుఁడు జనియించె. ఇట్లుజనించి యావిశ్రవోబ్రహ్మ తల్లిదండ్రు లనుమతియొసఁగఁదపోవనంబు సేరి యాశల జయించి విరాజిల్లుభూమియాశుచందంబున నాశలు జయించి తపముగావించుచుండెను. తత్సమయమున నాతని జామాతగాఁ బడయఁగోరి భరద్వాజుఁడను మునిసత్తముఁడు లేఁబ్రాయంపు తనపుత్త్రిఁదోడ్కొని యాతనిఁజూచి, "మహాత్మా! ఈదేవవర్ణిని యనుకన్య మత్పుత్త్రి. ఆకర్ణాంతవిశాలనయనయుగళయు, సుగుణంబులపేటియునగు దీని భార్యగాఁగైకొని నన్నుఁగృతార్థుఁజేయుమ"ని యనేకవిధములఁబ్రార్థింప నాతఁడును నాకన్య సురూపశోభావిశేషంబులకు సంతసించి యాకన్యఁబరిణయంబై యీశ్వరుఁడుకుమారుఁగన్నట్లు పరమపావనుఁడగు నొక్కకుమారుఁగనియె. తత్సమయమున భారతీపతి యేతెంచి తనమునిమనుమనిఁగాంచి "ఈతఁడు ధనాధిపతి యగున"నిదీవించి,యాతఁడు విశ్రవోమునియపత్యంబుగావున

"వైశ్రవణుఁడ"ను నామంబునఁ బ్రసిద్ధికెక్కునని యాన తిచ్చి తన నెలవగు సత్యలోకమునకుఁ జనియె.

అంత జనకుఁడు నాతని కుపనయనసంస్కారంబుగావించి వేదవేదాంగంబులఁ బ్రవీణుఁగావించి యన్నిట నేర్పరిఁజేయఁ బితృనాజ్ఞశిరసావహించి యాతండు తపంబుసలుప వనంబున కేఁగెను. సుజనులు వంశగతధర్మముల విడువరుగదా? ఇట్లు సని యాతఁడు మునులును మహాప్రయాసమని వర్ణించుచుండఁ దిసహస్రవర్షంబులు ఘోరతపంబుగావింప నాపౌలస్త్యజునకు విరించియు సాక్షాత్కరించి యిష్టములగు వరములఁగోరుమని యెను. ఇట్లు తనకుఁ బ్రత్యక్షమయిన హంసవాహనుంజూచి వైశ్రవణుఁడు దండప్రణామంబుగావించి లోకపాలకత్వంబును బహుధనాధీశ్వరత్వంబును గోరిన, నాతఁడు సంతసంబున నా వరములిచ్చి యిట్లనియె. "వత్సా! పూర్వాపరదిశలఁ బాలింప నిందవరుణుల నియమించి యముని దక్షిణదిశానాయకుఁ జేసి యుత్తరదెస కొక్కని దలఁచుచుండ నీవుజనియించితివి గావున నుత్తరదిశా నాయకుఁడవై బహు ధనాధిపతివై మనుము." అని యిట్లు ఘనుమని దీవించి పూజ్యమానమగు పుష్పకవిమానము నొసఁగి యాదరించి యతఁడు సనియె.

పదంపడి యాధనాధిపుఁడు విశ్రవుఁ జేరఁజని మ్రొక్కి "తండ్రీ! భవదాజ్ఞానుసారినై కమలాసను మెప్పించి యభీష్ట వరముల నందివచ్చితిని; గాని తగునివాసంబాపరమేష్ఠి నడుగ నైతిని. కావున నీతిబాధలు లేనిదియు, శత్రువుల కలవిగాని దియునగు వాసస్థలం బానతిచ్చి నన్ననుగ్రహింపు"మని

వేఁడుకొనిరి. అంత విశ్రవుండు పుత్త్రునిజూచి "తనయా! దక్షిణసముద్రమధ్యంబున రాక్షసుల కొఱకు విశ్వకర్మనిర్మితం బైభర్మభూధరంబుపలురూపులామెనో యన్నట్లుహీర కాంతులచేఁ దారకావళుల గేరు సువర్ణహర్మ్యములచే నొప్పారు లంకానామకంబగు పురవరంబుగలదు విష్ణువువలనిభయముచే దైత్యులందుండక సుతలంబునకుఁజనిరి. కావున నిర్భయుండవై యందు సుఖంబుండు"మనియెను. నావుడుఁ గుబేరుఁడు ముదమంది లంకఁజేరి గంధర్వాదులు సేరికొలువఁ దత్పురంబు పాలించుచుఁ బుష్పకారూఢుఁడై తల్లిదండ్రుల దర్శించుచు సుఖంబుగఁ గాలము గడుపుచుండెను.

—♦ కైకసి విశ్రవునివలన రావణాదులఁ గనుట ♦—

తొల్లివిష్ణువువలని భీతిచే రసాతలమునన్నున్న సుమాలి యొక్కదినమున భూలోకంబుఁ జూడఁగోరి రత్నభూషణముల ధరించి మేరునగసమానమగు నరదం బెక్కి పుత్త్రియగు కైకసిఁ దొడపైఁ గూర్చుండబెట్టుకొని సముద్రతీర వనప్రదేశంబులఁ దిరుగుచుండెను. అత్తఱి పుష్పక విమానారూఢుఁడై కుబేరుఁడు తన తండ్రిని జూచుటకై చనుచుండెను. సుమాలి వాని నెగాదిగఁజూచి వాని సౌందర్యమున కచ్చెరువంది "ఇట్టితనయునిగాంచినవిశ్రవోముని యెంతభాగ్యవంతుఁడో?" యని యనుకొనుచుఁ దన తనయయగు కైకసితో "మానినీ! ఆ విమానమునఁ జనుచున్నవానిఁ జూచితివా? అతఁడె యీశ్వరసమానుఁ డగు విశ్రవో మానికుమారుఁడు. ఈవును నమ్మునిభార్యవై యాతని భజించితివేని యా

కుబేరుని జయించు పుత్త్రులఁగాంచెదవు. దౌహిత్త్రులఁజూచి పితృదేవతలును సంతసించుదురు. జననియు, నాదుబిడ్డ యునల్లుఁడని వేడుకలుసేయఁ గంటినని యుత్సాహ మొందును. జనకుఁడు కన్యాదానఫలము తనకబ్బెననియలరుచుండును. నీవును తగిన వరుఁడు లభింపమిచే నింతకాలము కన్యగా నుంటివి. అదియునుఁగాక లక్ష్మీసమానురాలవగు నిన్నడుగ నే బంధువును వెఱచుచుండు. లోకంబునఁ గూఁతులఁ గనుట మేలేయైనను నొకపక్షంబునఁ గీడును గలదు. ఎట్లనినఁ గన్య దుష్టురాలైన తల్లివంశమును, దండ్రి కులమును, బతిసంతతియును నపకీర్తిపాలగును. ఎల్లబాంధవులును నిందింతురు. వీఁడు దీనివరించునని దేవుఁడును నెఱుఁగునో యెఱుఁగఁడో? అన్యుఁడెట్లెఱుంగును? ఏనును, బంధువులును నీవలన నన్వయము ప్రసిద్ధికెక్కునని తలఁచుచుంటిమి. కావున నీవునాయానతిఁ గైకొని మెలఁగుము" ననాకైకసియు లజ్జాతిశయంబున మొగము వాంచి తండ్రికి నమస్కరించిన నాతఁడును "సమ్మహాముని సేవించి సుపుత్త్రులం గని శుభాన్వితవై యుండుమ"ని దీవించెను.

అంత నయ్యువిదయుఁ బులస్త్యు నాశ్రమంబుఁ జేరి యపర చిత్రభానునివలె హోమంబు గావించుచున్న విశ్రవో బ్రహ్మఁజేరఁ జనియె. విశ్రవుఁడును లజ్జచే శిరము వంచి పదాగ్రమున నేల లిఖించుచున్న యామగువంజూచి హోమంబు నెరవేర్చి యా కమలాక్షి యందంబునకు సవిస్మయాత్ముండగుచు "నీ వెవ్వతవు? నీనామ మేమి? ఒంటరిగ నిచ్చటి కేతెంచుటకుఁగల కారణమేమి? ని న్నెవరైన నిచ్చటికిఁ బంపిరా?

లేక నీవె యిచ్చటి కేతెంచితివా? యథార్థంబు సెప్పుమ"న నాపెయుఁ గరములు ముకుళించి బద్ధాంజలియై యిట్లనివిన్న వించె. "దయాసముద్రి! నేను రాక్షసరాజగు సుమాలి తనూ జాతను. కైకసి యనుదాన. తండ్రియనుమతిని నిను సేవింపఁ గోరి యిచటి కేతెంచితిని. కావున నామనోరథమ్ము దివ్య ప్రభావమ్ముచేఁ బరికింపుఁడు."

అనిన నతండును దన మనోదృష్టి నది వచ్చిన రాక యెఱిఁగి "మగువా! నీయభీప్సితంబు నే నెఱిఁగితిని. సుతాపేక్ష నీవిచ్చటికి వచ్చితివి. సంధ్యాకాలంబునన్ నాతో డనీ ప్రసంగంబు గావించితివి. కావున నీగర్భంబున దురాత్ములగు రక్కసు లుదయింతుర"నెను. అనవుడు నాయింతియు భీతిల్లి "అనఘా విబుధలోకారాధ్యశీలుఁడవగు నీ తేజమున జనించిన సుతులు మాంసాశనులై దుష్టవర్తనులై సాధుహింస గావించుచుండఁ దగునా? నీవంటి సుగుణ సంపన్నుల సత్కుమారుల ననుగ్ర హింపు" మన మఱియు నప్పౌలస్త్యుఁ డిట్లనె: "కాలదోషంబు నీకెకాదు. బ్రహ్మనులకైనను దప్పింప వశము గాదు. ఏల చింతించెదు? నీపుత్రులలోఁ గనిష్ఠుఁడు విద్వాంసుఁడు నగ్ర గణ్యుఁడై, బ్రహ్మనిష్ఠుఁడై ననుఁబోలియుండును. ఆతనివలన నుభయకులములును బవిత్రమగును." అని మోదార్ద్ర యాతఁడా కైకసిమనోరథంబు నెరవేర్చె. అంతఁ గైకసిగర్భంబు దాల్చి నవమాసంబులు నిండినఁ బ్రసూతి సమయంబు డగ్గ ఱియె. అంత మునులును దివిజులును దల్లడిల్ల ధనదు గుండెలు జల్లుమన దుష్టగ్రహము లుచ్చయాం దుండ దశాస్యంబులతో

డను, నిడుదకోఱలతోడను, గాటుక కొండవలెఁ గన్పట్టు దేహంబుతోడను, కఱకువెండ్రుకలతోడను, దామోష్ఠముల తోడను, వింశతిభుజములతోడను మహోగ్రుఁడగు రాక్షసుఁ డొక్కఁ డుదయముయ్యెను. అతని జనన కాలంబున గృధ్రా రవంబు లతిశయమయ్యె. మేఘంబులు రక్తంబులఁ గురిసె. దేవతలు గంపంబునొందిరి. రవిదీప్తులు మాసెను. తత్సమ యంబున విశ్రవుఁ డేతెంచి పుత్త్రుఁ గాంచి యాతనికి దశ వదనుఁడను నామంబు గావించి యథోచితముగ నుండె. మఱియు నయ్యంతి సురలు బెగడొందఁ గుంభకర్ణుఁడను పుత్త్రుని శూర్పణఖయను పుత్త్రికను గ్రమముగఁ గనెను.

పిమ్మట గుణరత్నాకరుఁడును, సర్వభూతకరుణాసం గాత్ముఁడునగు విభీషణుఁడు సంపూర్ణచంద్రువగిది కైకసి గర్భవార్ధి జనియించి మించె.

— ♦ రావణాదుల బాల్యక్రీడలు ♦ —

జనకుఁడు విధ్యుక్తముగ నామువ్వురకును జాతకర్మ నామకరణము లొనర్చి యుపనయనంబులు సేసె. ఇట్లుపనీతు లయి వారు తండ్రివలన నఖిలవిద్యారహస్యంబు లెఱిఁగి యగ్నిత్రయసమానులై దినదినప్రవర్ధమానులై వెలయు చుండిరి. అందు దశవదనుఁడు పర్వతముల నుత్పాటించుచు, గగనంబు నొరసిచను విమానంబు లందుకొని నేలఁగొట్టి యార్చుచు, నాశ్రమోన్నతభూరుహంబులఁ బడఁద్రోచి యందున్న మహామునులఁ బరిహసించుచు సింహమదేభాదులఁ గట్టివైచుచు, గరుడ గంధర్వాదులఁ గనిన మీఁతో సంగరమ్ము

నీయఁగావలె నిలువుఁ డనుచు వారలు భీతినొంది పరుగెత్తు చుండ వెంబడించుచు బాల్యక్రీడలు సలుపుచుండెను.

కుంభకర్ణుఁడును నడయాడు కొండభంగి పాదఘట్టనచే ధారుణి నడఁగఁద్రొక్కుచు,నలినాప్తునరదంబునాకివిడుచుచు, నిందాద్రిదిక్పాలక పురోవన మహీజమ్ములందుండు పరిపక్వ ఫలంబుల గాల్చుచు, వైమానికుల నొక్కపెట్టునమ్రింగుచు నెడనెడ గుఱుకపెట్టి నిదురించుచు, లేచుచు, నలుదెసలఁ దిరుగుచుండెను.

అతని సహోదరుఁడగు విభీషణుఁడు సుజనుల నాద రించుచు, వ్రతముల సల్పుచు, వేదార్థంబులు దండ్రి సెప్పు చుండ శ్రద్ధతో నాలకించుచు, జితేంద్రియుఁడై యుపకార శీలతఁబ్రతిదివసంబును కులధర్మపద్ధతులననుసరించుచు మృదు భావమున నుండు. మఱియుఁ దనయన్నలు సేయు దుష్కార్యం బులకు వెఱదిభయంబునొంది పరుగెత్తుమానులఁ దనకన్ను లఁజూచెనేని 'నానిమిత్తమీయూపన్నులఁబ్రోవుఁడ'ని వారలఁ బ్రార్థించుచుండును. ఇట్లు రావణకుంభకర్ణుల బాఱింబడియు విభీషణుని సూక్తులచే బ్రతుకుచు మునులు 'ఆచంద్రార్క ముగ బ్రదుకుమ'నుచు నాతని దీవించుచుండురు.

ఇట్లు జరుగుచుండ నొకనాఁడు కైకసి తన పెద్ద కుమారుఁడగు దశవదనునిఁజూచి "నీయన్నయగు ధనేశ్వరుని సౌభాగ్యంబుఁజూచితివా? అతఁడు రత్నఘంటికావిరాజమాన మగు విమానము నెక్కి కనులపండువుగఁదిరుగుచున్నాఁడు. నీ వశక్తునివలె నేలయిట్లుండెదవు? నీవట్లుండ నేనెప్పుడుసూతు?"

అని సహజమగు క్రౌర్యంబునఁ బలుక దశాననుఁడు తల్లినిఁ జూచి "అమ్మా! నాప్రతిజ్ఞ వినుము. ఏనుఘోరమగుతపము సల్పి కుబేరుని సంపదకంటె నధికమగు సంపదల సంపాదించెదను. తపమునకుఁ బంపుము"న నాయవ్వయుఁ బుత్రుదీవించి తపమునకు ననుజ్ఞనొసఁగె.

—• దశగ్రీవాదులు బ్రహ్మనుగూర్చి తపము సేయుట •—

ఇట్లు తల్లిచే దీవనలంది కుంభకర్ణుఁడును కనిష్ఠభ్రాతయగు విభీషణుఁడును దనవెంటరా గోకర్ణక్షేత్రమును జేరియందుగ్రతపముఁగావింపఁదలఁచితమ్ములఁజూచి"హిరణ్యగర్భుఁడు నిక్కముగ భక్తవత్సలుఁడును దాపసజనకామితప్రదాతయుఁ గావున నతని భజించి కోర్కుల నందుద"మని పనికి తమ్ములఁ దపము సేయఁ బ్రేరేపించి సమీపారణ్యములఁదపము సలుపుఁడని తానొకవనమున విరించింగూర్చి తపము సేయుచుండెను. కుంభకర్ణుఁడును ఎండవానలకుఁ జలింపక, చలికి వెఱవక పంచాగ్నిమధ్యంబునఁ బదివేలేండ్లుతపముగావించెను. విభీషణుఁడును దనచూపు భగవంతుని రూపమునందైక్యము సేసినైదువేలేండ్లును,ఏకపాదముననిల్చిరవినిజూచుచు తెలచిన కనుమూయక యైదువేలేండ్లును నూర్ధ్వబాహుఁడునై తపము సల్పెను. మఱియు విభీషణునాశ్రయమునమూషికమార్జాలములును, భోగీంద్రనీలకంఠములును, మృగవ్యాఘ్రములును, గజసింహములును, శరభగండభేరుండములును, సహజవైరములు లేక చెలిమిఁజెంది మెలఁగుచుండ నచ్చరలు పూలవానలు కురియుచుండురు.

—♦ రావణాదులకు బ్రహ్మ వరముల నిచ్చుట ♦—

పంక్తిముఖుఁడును లోకాతీతమగు మహామహిమలఁ బడయఁదలఁచి బ్రహ్మ మంత్రమ్ము జపియించుచు నిరశన వ్రతము దాల్చి యొక కాలిపెనువ్రేలు భూమిపై నిలిపి తన హృదయమున బితామహు నునిచి సహస్రవర్షములు తపము సేసి యటుపిమ్మటతన యెదుటమండుచున్న యుగ్రతరాగ్నిలోఁ దనదుమస్తకంబుగోసి వీర హోమంబుఁ జేసెను. ఇట్లు వేయేండ్లకొకొక్క మస్తకముదునిమి వీరహోమమ్ముఁ జేసి, పదివేలేండ్లు గడచినఁ బిదపఁ బదియవతలను గోసి యగ్ని వేల్వఁగడఁగిన గగనము మ్రోసెను. సుడిగాలి వీచెను. సముద్రములింకెను. భూమియుఁ జక్రముగఁ దిరిగెను. రవి త్రోవ దప్పెను. అత్తఱి నింద్రాది దిక్పతులును, యతులును, విరించిఁ గానఁబోయి యాతని ననేకవిధముల స్తుతించి "స్వామీ! పద్మాసనా! ఆర్తులగు మమ్ముఁ గృపాదృష్టి నీక్షింపుము. దశకంఠుఁడను దానవుఁడు తన తొమ్మిది తల లగ్ని వేల్చి యిప్పుడు దశమంబయినశిరంబు వేల్వఁ గడఁగుచున్నాఁడు. ఆహోమధూమములు దశదిశల నావరించియున్నవి. ఇఁక నీవు ప్రత్యక్షమై యతనికి వరముల దయచేయవేని ఆయగ్నిజ్వాలలు మూఁడు లోకముల దహించును. అతఁడు తపోమహిమచే నిను మెప్పించి లోకముల నెటులయిన బాధించును. మీఁది బాధ యెట్లుండునో చూతము. కాని యీవీరహోమమ్ము చయ్యన మాన్పి మమ్ము కాపాడుమ"ని యనేకవిధములఁ బ్రార్థింప

వారలఁ గరుణాదృష్టిఁ జూచి, మంచిదని సమ్మతించి శ్వేత కేతుఁడు సిద్ధపఱచి తెచ్చిన హంసవాహనము నెక్కి తన వెంటఁ జనుదెంచు సావిత్రి ప్రియభాషలకు మాఱు పలుకకయు, వేదాంతార్థముల నుతియించు మునివరుల స్తోత్రములఁ బెడచెవులఁబెట్టియుఁ, గొడుకు వీణానాదంబు వినకయు నతిశీఘ్రగమనమున నేతెంచి యబ్జభవుఁడు దశకంఠునకుఁ బ్రత్యక్షమయ్యెను. ఇట్లుగ నఁ గమలాసనుఁడు దశకంఠునకుఁ గన్పడి యాతఁడు తనకున్న యొక్కతలపై ఖడ్గమ్ము మోపనుంకించునెడ "ఓహో! దశాస్య! యీసాహసమ్ము విడువుము. నీ విచిత్రాధ్వరకర్మకు మెచ్చితిని. వరములు గోరుమ"న నాతఁడు "దేవా! దేవనరాసురముఖ్యుల శుభాశుభస్థితు లొందఁజేయు నీకొక విన్నపము. జీవులు మృత్యువన్నఁ గడుభీతిఁ జెందుదురు. కావున నాయందు దయగలదేని తద్భయంబు లేని జీవనంబును, మానవులను లెక్కసేయఁగాని, గరుడగంధర్వ విద్యాధరాదులచేఁ బోరుల మరణంబు నొందని వరమ్మును గృపసేయుము"నె.నావుఁడు పద్మగర్భుఁడు వాని కోరికల నిచ్చి యేపున నాతఁ డగ్ని వేల్చిన శిరములు గ్రమ్మఱ మొలచున ట్లనుగ్రహించి, యఖిలలోకముల జయము నొందుమని యాతని దీవించి, విభీషణు నొద్దకుఁ జని యాతని భక్తికి మెచ్చి "భూతహితమ్ము గోరి యిట్లుగ్ర తప మొనర్చితివి. కావున నీకిష్టమగు వరములఁ దెలిపిన నిత్తున"నియె. ఆమాట లాలించి విభీషణుఁడు నిర్మల స్వాంతుఁడును, శాంతుఁడునగు నా విధాతకు నమస్కరించి

యిట్లు పలికెను. "కిరణంబులచే సూర్యుఁడును, కళలచేఁ జంద్రుఁడును,కీలలచే నగ్నియు వన్నెకెక్కినటుల సద్గుణములఁ బ్రసిద్ధికెక్కిన నీవెంతయు నన్ను మెచ్చితివంటి వింతకన్న నెక్కుడు వర మెద్దిగలదు? అయినను జగత్పతివగు నీవు నన్ను మెచ్చి యిష్టమగు వరము గోరుమని యానతిచ్చుటచే నూరకుండరాదు. కావున నాహృదయ మెప్పుడును న్యాయము నందె నిలచునట్లు వరమ్ము దయచేయుము. మఱియు నాయందు దయగలదని బ్రహ్మాస్త్రంబు నొసంగుము." అని ప్రార్థించిన నాతనిబుద్ధి కజుఁడు మెచ్చి "రాక్షసుఁడవై పుట్టినను నాసురభావ మొకింతయైనను నీయందు లేదు. నీకు దేవతలును సాటిగారు. నీవచనంబులకు సంతసించి యమరత్వము నొసంగితి. కావున దేవాసురులలో ఘనుఁడవై బ్రదుకు" మని యనుగ్రహించెను. తత్సమయమున నమరులు నజుని గొనియాడిరి. గంధర్వగానమ్ము లానందంబు గావించె.

ఇట్లు విభీషణుని కోరిక లొసఁగి కుంభకర్ణుకడ కేగుచుండ దేవతలు "వాణీశ! వాఁడమితదేహుఁడు. అతని కోరికల నిచ్చితేని వాఁడు జగము లన్నియు మ్రింగును. అతఁడు గట్టిగా భూమి నదిమిన క్రింది యేడులోకములును గ్రుంగును. ఒకపరి నిక్కినిల్చెనేని పైయేడు లోకములును పగులును. ఉత్సాహముతో నొడలుబ్బించెనేనిపచ్చిగోడలవలె దిక్కులు విచ్చును. లేచి నీల్గి బార సాచెనేని యాచక్రవాళాచలము నావలికి జరుగును. దేహమ్ముజూడ మొదలును తుదయును గానరాదు. అతఁడిదివఱకుఁ జేయుహింసలే చెప్పశక్యముగావు.

వీఁడు తనచిన్ననాఁడె మునులను నరులను భ్రమింగెను. నందన వనవాసినులగు నింద్రు చెలికత్తెలఁ బెక్కండ్రి హింసించెను. ఏవరములు లేకయే జగముల నిట్లు వేధించుచున్న ఖలునకు వరము లొసఁగుట యగ్నిలో నేయి వోసిన చందమగును. కావున ఘటకర్ణునియందు దయమాలి నీమాయచే దేహము వివశత్వ మొందఁజేసి యేదోయొక వరము నిచ్చితివేని జగములకు మంగళంబగును.'' అని సురలు ప్రార్థింప నామొదటి వేల్పు సాదరంబుగ భారతీదేవి మొగముఁజూచెను. ఆమెయు నాతని యింగితమెఱిఁగి యల్లన నేమిపని యాచరింతునానతిండనిన నజుఁడు నద్దేవి నాదరించి ''జలజాక్షి! అన్ని ప్రాణుల జిహ్వాగ్రములఁ గ్రీడించునీవు కుంభకర్ణు జిహ్వాగ్రమున నుండి నేనాతనికి వరముల నిచ్చుతఱి వ్యర్థాలాపంబులాడించి మేలగు వరములఁ గోరకుండునట్లు సేయు''మన నావాణియు నందుల కియ్యకొని యుండెను.

అంత నయ్యమరశ్రేష్ఠుఁడును కుంభకర్ణుసమీపమున కేగి ''మహాభాగా! నీతపమునకు మెచ్చియిప్పుడుభవదభీష్టము నెరవేర్పవచ్చితి. వేఁడుమ"న నాతఁడును నమస్కరించి ''యొక దినమ్ము భుజించి యాఱుమాసములు నిద్రించునట్లు వరము దయచేయు''మనెను. అనవుడు నతఁ డట్లె సుఖముగ నిద్రపొమ్మని నిలింపులఁగూడి తన నెలవునకుఁజనెను. సరస్వతియు వాని యాస్యంబు వెడలి చనిన నారక్కసుఁడును దనవరములఁ దలఁచి తనలోఁదాను ''అయ్యో! బ్రహ్మయంతటివాఁడు వరమియ్యవచ్చిన మంచికోరికల కోరక నిద్రను గోరువెట్టి యెందుఁ

గలఁడు? ఇట్టినుడువులు నానోట నేలవచ్చెను? వేల్పులేయిట్లు నామనమ్ము వికలంబు సేసిరికాఁబోలు! దైవోపహతుఁడగు వాఁడు మంచిమార్గము నాశ్రయించినను నదియె చెడు త్రోవ యగును. కావునఁగడచినపనికి వగచిన ప్రయోజనములే"దని యనుకొనుచుండ నన్నయును దమ్ముఁడును కుంభకర్ణునిఁజూచి యాతని విధము దెలిసికొని "ఓయీ! దైవకృతమున కేల వగచెదవు? వగచుటకుఁ బామరుండవా?" యనియాదరింప నాతఁడును మనమునఁ గలఁక దేఱి సుఖముగ నుండెను.

—♦ దశగ్రీవుఁడు లంకను దన కిమ్మని కుబేరు నడుగుట ♦—

అయ్యెడ దశముఖుని మాతామహుఁడగు సుమాలి రాక్షసనికాయమ్ము దన్ను సేవించుచుండఁ దన మనుమలఁ జూచు కౌతుకంబున రాగ దశవదనాదులాతని నెదుర్కొని సేమ మారసి నమస్కరించియున్నతఱి అతఁడు వారలఁజూచి వారల యద్భుతకర్మములకు మెచ్చి కైకసీ జ్యేష్ఠపుత్రుతో "అసుర వర్యా! లోకములఁబరమాన్నాజ్యసమిత్తుల చేబ్రహ్మార్పణముగ నధ్వరము లొనరింతురు, గాని నీవలె శిరములఁగోసి యనల మున వేల్చువార లెవ్వరును లేరు. ఇది మిగుల నద్భుతము. మాయన్వయకర్తలై జనియించిన నీకు నామనమునను న్నవిష యమును డాపక చెప్పెదను. తొల్లి మూడు లోకములకును ద్రోహమునొనర్చుమాభుజగర్వమును సహింపఁజాలక దేవతలు చతుర్భుజునితోడ మొఱపెట్టుకొన నాతఁడు భయంకర శంఖారావమును గావించుచు మాలియను వానిఁ దునిమి మమ్మందఱ జయించెను. అంత మేమును భయమున నచ్చో

నుండఁజాలక పాతాళమునసుంటిమి. అది మొదలుకొని లంకా పురము పాడుబడియుండ మాయన్నయగు కుబేరుఁడు దాని నాక్రమించుకొని యిపుడచ్చట కాపురము చేయుచున్నాఁడు. కావున సామదానముల నైనను మఱియేవిధముననైనను తుదకు దండోపాయము చేతనయినను ఆపట్టణము గైకొనుము. ఇతరుల యధీనములోనున్న తనసొమ్మును సంపాదించుటయు, నార్తిఁజెందిన చుట్టాలనారయుటయు, దన కులధర్మము విడువకుండుటయు బలముగలవాని లక్షణము. కరముచేఁ గంకణమును, గంకణముచేఁ గరమును నెట్లు ప్రకాశించుచుండునో యదేవిధమున నీచే లంకాపురమును, లంకాపుర పాలనముచే నీవును వెలయుచుందువు." అని యిట్లు తాత దెలుప దశకంఠుఁడు "తాతా! నీవచనము యథార్థమే కానిమ్ము. దుర్వృత్తిచే నీతిమాలి యగ్రజుని యిల్లు వెడల నడచినచో నార్యులు నిందింపకుందురా? భవాదృశులే యిట్లనిన నస్మదాదులకు బుద్ధిస్థైర్య మెట్లుండును?" అని వానిపలుకుల నిరాదరణచేయ మాతులుఁడగు ప్రహస్తుఁ డొకానొకదినమునఁ దగిన సమయముఁగని "శూరులు బంధుత్వములఁజూతురా? ఎవ్వాఁడు బలవంతుఁడో వాఁడే మూఁడులోకములయందును మేటియనఁబడు. యక్షేశుపై నీ మొగమాటము నీ కేల? నిజముగ లంక యాతనిపురమా? పెక్కుమాటలేల? అతఁడనుభవింపనర్హుఁడంటివేని కొంతకాలమతఁడేలెను. కావున సోదరుఁడవగు నీవును కొంతకాల మేలవలదా? 'ఎంత చెడుగయినను సోదరుఁద్రోచి

యాతని యిల్లు గైకొనఁదగునా యని యంటివి? అటులయిన కశ్యపుని భార్యయగు దితియును, నదితియుఁగన్న సంతానం బున్న తెలియఁగును, వారి మైత్రియు నెట్లుండెనో యాలోచింపుము. ఇంద్రుఁడు తన భ్రాతలగు దైత్యులఁగన్న నెన్నఁడును సైచఁడే! ఎచ్చటి యన్నలు? ఏటి తగవులు? దయాధర్మాదులుగల వేల్పులే దైత్యులఁ ద్రుంచుచుండ మనవంటి వారలకు భయమెందులకు? అనుమానింపక నీయన్నను గెల్చి లంకాపురమును గైకొనుమ"ని బోధించెను. అంత వానిమాటలను విని పౌలస్త్యుఁడు మాతామహు నాజ్ఞఁ గైకొని దక్షిణదిశకుఁ జని త్రికూట పర్వతమున నిల్చి యచ్చటఁ బ్రహస్తునిఁజూచి "నీవు నాయగ్రజుఁడును బిత్రుసముఁడునగు కుబేరునొద్ద కేగి నాయభీప్సితమును నివేదించి లంకాపురము నిమ్మని వేఁడుమ"న నాతఁడును సతిరయమున లంక కేగి యిందనిభుఁడగు ధనవిభుని గనుఁగొని మ్రొక్కి "నీయనుఁగుఁదమ్ముఁడగు దశాననుఁడు మీసేమ మారసి యొకమాట దెలుపుమనియెను. దానిని విన్నవించెద వినుము. 'లంక తొల్లి మన మాతామహులు నిర్మాణము సేయించిరఁట. అందెవ్వారును లేకయున్న కారణమున మీరిపుడు పాలించుచుంటిరి. ఇపుడాదనుజులు నన్ను సేవించుచుండ నేనును మీవలెనొన్నా ళ్ళేలవలెనని కోరుచున్నాను' అని మీకూరిమితమ్ముఁడు పలికె. అదియట్లుండనిమ్ము. ఇపుడు దశాననుఁడు విరించిచే వరములనొంది తేజశ్శాలియై యున్నాఁడు. కావున నాతనితో సఖ్యముసేయుట తగును. పిమ్మట నీచిత్తము."

యక్షేశుఁడును పంక్తికంధరుని యమాత్యుఁజూచి
"అయ్యో! యీ ప్రోలనెంత? నాధనమ్మును నాయైశ్వర్యమ్మును
నాతఁడె యనుభవింపనర్హుఁడు. ఆతఁడేలుటయె నాకునుబరమ
సమ్మతంబు. నేఁజేయవలసినపనిని నాతఁడె కోరినాఁడని నే
నెంతయు సంతసించుచున్నాను. కావున,

"రమ్మనుమా తమ్మునిఁ దనసొమ్మనుమా లంక రాక్షసులతో మేల్గై
కొమ్మనుమా వల దనుమాన మ్మనుమా" యనుచు దండసాధునిఁ బనిచెన్."

—♦ ధనేశుఁడు కైలాసమును జేరుట ♦—

ఇట్లు కుబేరుఁడు దుష్టుఁడగు దశగ్రీవునకు నుత్తర
మొసఁగి దూతనుబంపి అప్పుడె తానును నవరత్నోజ్జ్వలమగు
పుష్పకవిమానం బెక్కి తండ్రియగువిశ్రవసునొద్దకుఁజని యా
తనికి నమస్కరించి తనతమ్మునియభిప్రాయమాద్యంతమువిన్న
వించి "తండ్రీ! నేనిఁక నెచ్చోట నుండఁదగునో సెలవిమ్మ"ని
యనేక విధములఁ బ్రార్థించెను. తండ్రియు ధనదుని గన్గొని
"పుత్రా! ఏను దశవదనుఁజూచి: 'ఓరి బేలా! అవినీతిచే
నగ్రజుని పురము గోర నేల? ఒండుపురమ్ములు లేవే?' యని
యెన్నియో విధముల బోధించితిని. వాఁడును నాపలుకు
నేకొనక యరుణాననుఁడగుచు బదనికఁజూచిన చిలుకవలె
నిచ్చట నుండక చనియెను. మదాంధుఁడగు నాతఁడు పెద్దల
మాటలను వినఁడు. బ్రహ్మవరగర్వముచేఁ దానే లోకాధి
పుఁడై యున్నాఁడు. నే నిపుడు కోపము వహించి యాతనిని
శపియించినను బ్రయోజన ముండదు. తగని కుమారుఁ
డయ్యె నేని యాతనిపై మమత విడుచుటయే సమంజసము.

సహోదరుఁడు తగనివాఁడయ్యేనేని తాను వానినెడబాయు టయె యుత్తమము. కావున నీకొక హితమును బోధించెదను. వినుము. శంకరుని నిలయంబగు కైలాసమున కేఁగి యచ్చోట నివసింపుము. అచ్చటి కేళికావనంబులును, కల్పిత ధరాధరంబులును, నిర్మలసరోవరంబులును, రత్నమందిరములును, బంగరు కమలములచే నొప్పు జలజాకరంబులును, నీయాత్మకు మెప్పు బుట్టించును. అచట కాపురముంటివేని ముక్కంటియు నీకు సఖుఁడగును. కావున నచ్చటికేగు" మనెను. కుబేరుఁడును దక్షిణమె ధన మణి వస్తు వాహనమ్ములఁ గైకొని సపుత్త్రి మిత్త్రిబాంధవంబుగ లంకఁ బరిత్యజించి కైలాసమునకుఁజని శంభునిశరణంబు నొందెను.

శరణాగత సులభుఁడు కావున శంకరుఁడును అతని నాదరించి యలకానామనగరంబు నాతని కొసఁగి యాతనిఁ బరమాప్తుఁగా నొనర్చి పాలించుచుండెను. నయవినయములనయము దనసొమ్ముగ మెలఁగు కీర్తిధనుఁ డచ్చోటనున్నను సుఖించునుగదా?

—♦ దశముఖుఁడు లంకను గొని పాలించుట. ♦—

ధనదుఁ డీగతిఁ గైలాసమున సుఖముననుండ ముప్పది యోజనముల నిడుపుగలిగి సువర్ణసౌధములచే నొప్పు నాలంక జనరహితయయ్యు నొక్కని విడనాడి మఱొకని రాకకై యలరు వెలయాలికైవడి చెలువొంది యుండెను. అంతఁ బ్రహస్తుఁడు దశాననునొద్దకుఁ జని వృత్తాంతమంతయువినిపింప మందహాస సుందరవదనుఁడై సభవారినిఁ జూచిన, వారును

"దనుజాధిపా! అలకాధిపుఁడు పురమీయఁడేని నీభుజాగర్వ మున గాసినొందకపోఁగలఁడా?" యన నది నిక్కమనుచు మనన మున సంతసించుచు శుక్రునిచేనిశ్చయింపఁబడిన సుముహూర్త మున వింశతిభుజుఁడు తనముందట మత్తగజముల నారోహించి మాతామహులును, వారిపజ్జ ముత్యాల పల్లకి నెక్కి తల్లి యగు కైకసియును జనుచుండఁ దమ్ము లిరువురు నిరుపక్క యల నపరిమిత సైన్యంబుతో సేవింపఁ బ్రహస్తాది మంత్రు లఁగూడి దివ్యరథము నెక్కి శంఖ కాహళాదుల యారావము నింగిముట్ట ఛత్రిచామర కేతన ప్రభ లొప్పుచుండ లంకఁ బ్రవేశించెను.

దశముఖుఁ డిట్లులంకాధిపతియై బంధుమిత్రామాత్యులఁ దగిన పదవుల నిలిపి కులవిద్యా రూపతారుణ్య తపోబలము లచే నెంతయు నతిశయ మొందుచుండెను.

పిమ్మట నిండుజవ్వనియగు శూర్పణఖయను దనచెల్లెలికి వివాహము సేయఁగోరి బంధుమిత్ర నికాయ యుతుఁడై తల్లి యానందరస నిమగ్నయై యుండ విద్యుజ్జిహ్వుఁడను కాల కేయున కిచ్చి యుద్వాహ మొనర్చెను.

ఇట్లు పరిణయ మొనర్చి యొక్క శరత్కాలమున వేఁటాడఁదలఁచి సువర్ణరత్నఖచితమగు నరదమెక్కి ధనురాది సాధనంబుల ధరించి యొక్క నిర్జనారణ్యమ్మునఁ బ్రవేశించి సుర మృగముల నిఁక నిట్లె వధింతునని తెలుపు విధమున మృగ ముల వేఁటాడఁ దొడఁగెను.

### — దశాననుఁడు మండోదరిని బెండ్లియాడుట —

ఇట్లు కొంతకాలమ్ము మృగయావిహారంబు నడిపి తన యెదుట కృపారసమయుఁడగు మయునిఁజూచి యటుపిమ్మట చక్కఁదనముచే రతీదేవిని మించు సలక్షణలక్షితయైయాతని తోడఁ జనుదెంచునొక్క బాలికను గాంచి తలయూచి తనలో నిట్లని వితర్కించె.

"ఇట్టి లేఁబ్రాయపు చెలువ నెందైనను జూచితిమా? ఈ యింతి మధ్యంబుతో సరిగాక కాబోలు సింగములు పర్వత గుహాలలోఁ జిక్కుచున్నవి. ఇక్కన్య నడకకు సిగ్గు నొంది కాబోలు గజము లరణ్యసంచారంబు జేయుచున్నవి. ఈ చెలువ చూపుల కోడి కాబోలు సారంగములు పొదలు దూరుచున్నవి. ఈ కాంత నీలవేణికి నీడుగాక యోయన్నట్లు కాలసర్పంబులు వల్మీకములఁ జొచ్చుచున్నవి. ఈలలనామణిని సృజించియే కదా పంకజాసనుఁడు విధాత యయ్యెను." అని యిట్లాముద్దియ సౌందర్యమున కచ్చెరు వందుచు "ఈకలువకంటి జాతియేదియో? నామమేమని వాడుదురో? సమీపమం దున్నపురుషుఁ డెట్టిచుట్టమో? యీలలనామణి నేఁగోరిన నియ్యఁడా? ఈకున్న నీతని జయించియైనను నీ తన్విఁ బెండ్లాడెదను." అని మనమునఁ దలఁచి వినయము గలవాఁడువలె మయుని మార్గమున కడ్డముసని యాతని వినుతించి చాతుర్యమున నిట్లు పలికెను: "ఓమహాత్మా! ఉగ్ర మృగాకులమగు నీయరణ్యమున మీరొంటరిగ నెచ్చటికేఁగె

దరు? మీనామము లేవియో? వినిపింపుఁడు." అనిన పితామ యుఁడగు మయుఁడును గలరూపేర్పడనిట్లుచెప్పఁదొడఁగెను.

"ఏను దానవశిల్పాచార్యుఁడను. మయుఁడనువాఁడ. ఇయ్యిందువదన మదీయపుత్త్రి. మండోదరియనునామముచేఁ బ్రసిద్ధికెక్కినది. నాసుగుణములకును శిల్పమునకును మెచ్చి దేవతలు హేమయను నప్సరసను నాకిచ్చిరి. మనోజ్ఞమగు హేమపురంబు సృజించి యేనును హేమతోఁడఁ బంచ శతాబ్దంబులు సుఖించితిని. తండ్రీ! ఈశ్వరమాయ నేనెఱుఁగ గాని నేనాసతితోనుండ సంవత్సర మొక క్షణకాలముగ నుండెను. ఆసుదతి నొకక్షణంబు జూడనేని యాకాలంబు కల్పముగా నుండెను. అహోరాత్రంబు లాపెయింటనెడ బాయక యుండువాఁడను. కాని యది యట్లుండనిమ్ము. ఇట్లు కలిపయ వాసరంబులు సన నాకు మాయావియగు మాయావియు దుందుభియునను నిరువురుపుత్త్రులును ఈమండోదరీకన్యయును జనియించిరి. అంత దేవతలు హేమను దమ నివాసంబులకుఁ బిలువనంపిన నేనును దానియెడబాటు సహింపఁజాలక సంసార సుఖముల రోసి తపముసేయ సమకట్టి యిక్కన్యకుఁ బరిణయము సేయఁ దలఁచి తగినవరు నెందుఁగానక దేశదేశమ్ములఁ దిమ్మరుచుంటిని. నీకులమును నామమును వినుటకుఁ దగుదునేని వివరింపుము."

నావుడుఁ బంక్తికంఠుఁడు మనమ్మున సంతోషించి "మహాత్మా! వినుము. అఖిలలోకముల సృష్టిసేయు నజుఁడు నాప్రపితామహుఁడు; తాత పులస్త్యుఁడు; మజ్జనకుఁడు విశ్రవుఁడు.

అహీనపరాక్రమ ధైర్యధుర్యుఁడనయి దశగ్రీవుఁడని ప్రసిద్ధిఁ జెందినవాఁడ. లంకాపురంబు కాపురంబు. అవివాహితుఁడనై యుండి వయోరూపకులానురూపయగు కన్య నన్వేషించుచున్నాఁడను" అని పల్కెను. మయుఁడును సంతోషించి "యిఁక పెక్కుమాటలేల? ఇతఁడె మత్పుత్రిఁ బరిణయమగుట కర్హుఁడు. కావున నీతఁడే నాకు జామాత" యనియగ్నిసాక్షిగ నాతనికి తన కన్య నొసఁగెను. మండోదరీ పాణిగ్రహణమున దశవదనునకును సాత్వికోదయమయ్యెను. ఎంత తామసున కయినను సత్సంగతిచే వారి భావములె చేకూరునుగదా ! రాక్షస రాజ్యలక్ష్మియోయన్నట్లు వెలుఁగునప్పయోజాననఁ బెండ్లియై రాక్షసరాజు తన మామయగుమయుని వివిధార్చనలచే సంతుష్టుఁజేయ నాతఁ డానందరసమగ్నుఁడై యుక్కంటినైన గెలువఁజాలు నొకశక్తి నొసఁగ "ఇది పరమసాధనము. దీని భయార్తులపైఁ బ్రయోగింపక నిన్నెదిర్చిన శూరులపైఁ బ్రయోగింపుము" అని యాతని వీడ్కొనియెను.

పదంపడి పంక్తిముఖుఁడు బలిదౌహిత్రియగు వజ్రజ్వాలయను కన్యకామణిని బాంధవు లానంద మొంద కుంభకర్ణునకుఁ బరిణయ మొనర్చి, సౌందర్యలీలావిలాసరసు యగు సరమయను దాని విభీషణునకుఁ బెండ్లిసేసెను. కొన్నిదినములకు దశాస్యుని పట్టపుదేవియగు మండోదరి బాహుబలపరాక్రమసమగ్రుఁడగు నొక్కపుత్త్రుఁగనెను. ఆతని జననకాలమున గీర్వాణులు భీతిఁజెంద నాకసంబు భేదిల్లునట్లు కుమారుఁడు

మ్రోయుటంబట్టి యాతని జనకుఁడాతనికి మేఘనాదుఁడను నామ మిడియె. ఆతఁడే యింద్రజిత్తని ప్రసిద్ధికెక్కెను.

—♦ కుంభకర్ణుఁడు నిద్రింప దశగ్రీవుఁ డొక యిల్లు గట్టించుట ♦—

విధాతచే ననుగ్రహింపఁబడిన నిదురమబ్బు కుంభకర్ణుని ముగంబుఁ జేరి జాగ్రదవరోధ మొనరించిన నాతఁడన్నతో "నే బవ్వళించుట కొక గృహము కావలయు"నని యన నతఁ డా క్షణమె యప్పని కనేక శిల్పుల రావించెను. శిల్పులును రాక్షసేంద్రు నాజ్ఞ నొదలఁబూని మూఁడామడ నిడివియును ఆమడ వెడల్పును గలయొక శయనాగారము తిరముగఁ గట్టిరి. మృదుల తల్పతతులతో నొప్పారుచు ధవళప్రభాహసితకైలాసంబైన యానిద్రాగృహంబున కిన్నరాదుల యుద్ధప్రసంగములఁ బల్మాఱు కల్వరించుచు, దిగ్గజముల కర్ణపుట భేదనము గావించు గుఱకలు పెట్టుచు, స్వప్నావస్థయందు విరోధులఁ జూచి పండ్లుగొఱికికొనుచు, నోట స్రవించు లాలాజలముఁ జప్పరించుచుఁ, జెమ్మటలఁ దొప్పదోఁగుచు, ఘటకర్ణుఁడు మైమఱచి నిద్రించుచుఁ గాలము గడపుచుండును.

—♦ కుబేరుఁడు దశగ్రీవునకు నీతిఁజెప్ప దూతను బంపుట ♦—

అంత క్రూరుఁడగు దశముఖుఁడు బ్రహ్మదత్తవరమదాతిరేకమున దుశ్శీలుఁడై గంధర్వ గంధర్వ గతు లడఁచియు, యక్షులఁ బక్షులవలెఁ బాఱఁదోలియు, సిద్ధుల బద్ధులఁ గావించియు, భోగుల విభోగుల నొనర్చియు, యోగులఁ బలువెతల నొందఁజేసియు, మాయావియై హవనంబులఁ జెఱచియు, ద్విజుల బాధించియు మదాంధుఁడై సంచరించుచుండెను. అత్తఱి

ధనాధిపుఁ డీయుదంతమ్ము నెఱిఁగినవాఁడై దుర్నీతిపరుఁడగు తమ్మునకు నీతియును ధర్మము నెఱిఁగింప నొక్కదూత సత్వరముగఁ బనుప వాఁడును ముందుగనఁబడు దుశ్శకునములకు భీతిఁజెందక నయశాలియగు విభీషణుని ముందుగఁ గనెను. విభీషణుఁడును అతని ననేకవిధముల బహూకరించి "మా యన్నకు సేమమా? వదినె హర్ష మొందుచుండునా? పుత్త్రులు సుఖోపేతులా? ఆప్తమంత్రి బాంధవ వర్గమునకుఁ గుశలమా? నేఁడు రాజు నిన్నిచ్చటి కేలపంపె?" నని, యడుగ నాతఁ డంతయు వివరించెను. విభీషణుఁడు గొంత చింతించి "అన్న మనహితోక్తులు వినునా? ఏల యిప్పని మాయన్న దలపెట్టె? అయిననేమి రమ్ము" అనుచు నాతఁడు వెంటరా, నసంఖ్యాకులగు నిశాచరుల స్తోత్రపాఠముల నాకర్ణించుచు దేవాంగనావారమ్ములు వింజామరలఁబూని వీచుచుండ వేత్రహస్తులు సభాంగణసమ్మర్దం బుడుపుచుండ నిండు పేరోలగంబుననున్న రావణునిఁ జేరి నమస్కరింప నొకప్రక్క నొదిగి నిలువఁబడియున్న దూతయు వినయమున మ్రొక్కి కరమ్ములు జోడించి పంక్తిముఖుతో "దైత్యకులచంద్ర! మీయన్నయగు కుబేరుఁడు మీ సేమమునుగోరి మీకొక విశేషహితమ్మెఱిఁగింపుమని ననుఁబంచెను. అద్దాని విన్నవించెద. నెయ్యము వహించి యాకర్ణింపుము. నరవిభుఁడై పరోపకారము సేయుటయె సుకృతంబు. పరుల పీడించుటయె ఘోర పాపము. బ్రహ్మవంశమున జనించిన నీకు సురాదులతో విరోధము పాడి గాదు. నిఖిలసంపదలకును న్యాయమె మూలము. అద్భుతమగు

నిష్ఠచే బ్రహ్మనుపాసించి వరములబడసి దయాగుణమొక్కింత యైనను లేక ధర్మాత్ములగు సురవర్యుల నేల ధ్వంసముచేసె దవు? ఇంద్రుని నందనవనముఁ బెకలించి సురాంగనలఁ జెఱఁ బెట్టితివి. ఆర్యులొనర్చు జన్నములనాశనమొనర్చియు, మునీంద్రుల నంతమొందించియుఁ జరియించుచుంటివి. మావంటి వార లేమందురోయను భయమ్మును విడిచియిట్లున్న నీకెవరు హితమొనర్తురు? సోదరుఁడవగుటచే నను వెడలఁగొట్టినను సహించియుంటిని. బంధువులయినను పలుమాఱు బాధలకుఁ దాళుదురా? యోగిపుంగవులఁబట్టి వధించుటయే శూరుని లక్షణము? తమ్ముఁడా! ఈక్రూరకృత్యములను మానుము. రాక్షసాధిపా! మఱియొక్కమాట మీయన్న సెప్పుమని యెను. 'హిమవన్నగ శిఖరాగ్రమున నే నిన్ని దినంబులు శివు నారాధించివచ్చి నీయాద్ధత్యమును విని నీకిదిధర్మముగా దనుచు బోధించితి. నావచనములఁగైకొని మనవంశోచిత క్రమమును గైకొనుమ'నియెను. అదియునుగాక యన్యుల కలిమి గన్గొని ఈర్ష్యామగ్నుఁడైయుండు నాతని కవశ్యము నాపదలు సంభవించును. ఇందుకు తార్కాణమ్ము త్వదగ్రజుఁడే. దైత్యవల్లభా!మీయన్నయొకదినమున మంచుకొండ దండఁజేరి యచ్చోట శంకరు నర్ధాంగంబు నలంకరించి మహా వైభవముతోనున్న నగజాతనుసవ్యనేత్రమున గనుఁగొనియా పరమేశ్వరున కీభాగ్య మెట్లబ్బెనని యసూయామగ్నుఁడై యుండెను. ఇట్లు కుటిలబుద్ధి నీక్షించు నాధనాధిపు కుడికన్ను శర్వాణి తనయోగమహిమచే నప్పుడె దగ్ధమ్ము సేసెను.

అంతఁ గుబేరుఁడు కడుభయమునొంది యాగిరియుత్తరశిఖరం బున వేయి వత్సరము లుత్తమ శైవవ్రతము లొనర్చు చుండెను. అంత నాతని తపోనియమమునకు మెచ్చి శివుఁడు! 'నీ తపోనిష్ఠకును నియమవ్రతమునకును మెచ్చితిని. అస మాన మహిమాన్వితుఁడవై నాకు సఖుఁడవై యుండుము. మఱియు నే కంటితోడ నగజాతను గాంచితివో యానయన మొక్కటియును బిశంగరుచిగాంచును. అక్కారణమున నీవు నేటినుండియుఁ బిశంగనయనుఁడవను ప్రఖ్యాతిఁ జెందియుం దువు' అని వరములనొసఁగి, శూలి తన నెచ్చెలికాని వెంట నిడుకొని కైలాసపర్వతమున కేఁగె. కావునఁ గ్రోధమును సహాయముఁ గీడుగావించును. ధర్మవర్తనము నిఖిల బంధు మిత్రవర్గమునకు సంతోష మాపాదించును. నీ కీచెడుగుదన మేల ? నీ యగ్రజుని మాటలను విని శుభమ్ము నేకొనుము."

—♦ దశాననుఁడు కుబేరునిదూతఁ జంపి యలకాపురిపై దండెత్తుట ♦—

అని యిట్లు దూత దెల్పిన మూర్ఖుఁడగు దశాస్యుఁడు దశవదనముల నెఱ్ఱజేసి పండ్లు పెటపెట కొఱుకుచుఁ గను బొమలు ముడివడ నిరువది నేత్రములును మండుచున్న యగ్ని కుండములవలె నుండఁ గ్రూరాత్ముఁడై దూతతో "మీయొడ యఁడు సిగ్గొకయింత లేక మంచితనమున నీతి బోధించువాని చందమునఁ దన తపోమహిమయు త్ర్యంబకసఖుఁడగుటయుఁ దనయైశ్వర్యంబును దెలుపనెంచి నినుఁబంచినాఁడె?అవినీతియై యాతఁడు పంపిన నీ వీమాటల నెటులాడవచ్చితివి? మూర్ఖ! అవివేక!" యంచు నాతని వధింప నడిదమెత్తినఁ దమ్ముఁ

డడ్డంబు వచ్చి రక్షింపుమని యెంత వేఁడినను వినక యాదూత శిరమ్ము వివేకశూన్యుఁడై తెగనేసెను.

దూత నిట్లు సంపి యాతని తలయును మొండెమును గొలువులో నున్న భృత్యతతి కిచ్చి, తనమంత్రులఁ గనుగొని "ధనదుని మాటల వింటిరా? మాకుఁ దనకున్న వివేక మున్నదే? హితోపదేష్ట తాగాక మఱెవ్వరున్నారు? పట్టణ మాక్రమించి తన్నుఁ బాఱదోలినఁ దాను దోఁబుట్టువుగాన నోర్చిపోయెనఁట. పోక యేమిసేయఁగలఁడో? కనుగొందము. మన మిప్పు డలకాపురిపై దండెత్తిన గట్టువిలుకాని గూడి యిఁక తన భుజశౌర్యమును జూపునుగాక! పూజ్యుఁడని నమ్మిన ధనదుఁడే నన్నిటు లవమాన్యుఁ జేసిన నిందాదుల నిఁకఁ జెప్పనేల? కావున నోప్రహస్త! తొలుదొల్త కుబేరు జయింపఁ దలఁచినాఁడ. నీవును మన పురమునను న్న దైత్య వీరులఁ గూర్చుకొని నా వెంట రమ్ము." అనిన నాతఁడును మారుమాటాడక తత్క్షణమే యట్లు గావించెను.

## —♦ యక్ష రాక్షసుల యుద్ధము ♦—

ఇట్లు దశాననుఁడు విత్తవిభు వీటిపై దండు విడిసిన కుబేరుని సైనికులగు యక్షకిన్నరులు యక్షేశుని కిది విన్న వింపక తాము సంగరము సేయుట తగనివనియని విచారించి యలకాపురికేగి యావరవాహనునింగాంచి వందనములొనర్చి "ఇందుకళామాళిమిత్రా! నేఁడు దశాననుఁడు చమూబృంద ముతో నందాతీరమున విడిసియున్నాఁడు." అని తెలుప నాతఁడును నవ్వి శిరంబు పంకించి యాతఁ డలకాపురంబు

సారకుండ నాఁగి భండన మాచరింపుడని వారల కాజ్ఞాపింప వారును వెనుదీయక ఘోరంబుగఁ బోరఁ దొడఁగిరి. అంత యక్షరాక్షసుల కధికంబగు సంగరమయ్యెను. దశాననుఁడును తన యిర్వది చేతుల గదాయుధంబులఁ బూని శుకసారణా దులు తన్ను నుతింప యక్షసైన్యంబు నంతయు నఱుమాడెను. హతశేషులగు యక్షులు విచ్చియు నొచ్చియు వెఱచి యోడితిమనియు ననేక విధములఁ బ్రార్థించినను గోటలోఁ జొచ్చువరకును వారల వెంబడించి పౌరులు దల్లడిల్లునట్లుగ శూలంబులచే గ్రుచ్చి నొప్పించెను. అంతఁ గుబేరు నానతి సంయోధకంటకుఁడను యక్షుఁడు దనశౌర్యమందఱును మేలన దశాస్యసైన్యంబుపై శరపరంపరంబులఁ గురియించెను. అంత నాతని గడువఁజాలక రాక్షసబలంబు భీతినొంద తాటకేయుఁ డగు మారీచుఁడు తన చాపనైపుణ్యంబుఁజూప నా మహా వీరుఁడు వాని ననాయాసంబుగఁ బుడమిపైఁ బడవేసెను. ఇట్లు నేలగూలి ముహూర్తకాలమునకుఁ దెలివినొంది యక్షు మేన నిశాతశరంబులు నాఁటిన నాతఁడు నిశాచరు లార్వ భయముజెంది యాయోధనంబు విడిచి పాఱె. అత్తఱి దశ ముఖుఁడు పురప్రవేశ మొనర్చుటకు యత్నంబునలుపుచుండ సూర్యభానుఁడను కుబేరుని ద్వారికుండు వానిఁజూచి "యెందు బోయెద" యనుచు నదల్చి యా రాక్షసరాజ సైన్యసాగ రమునకుఁ జెలియలికట్టచందంబున నడ్డుపడి యుండెను. అట్టియెడ దశాననుఁడు విరించి వరమాహాత్మ్యము చే నాతని శిరంబు వ్రయ్యలగునట్లు గదాయుధంబుచేఁబగుల నేసెను. ఇట్ల

వక్రపరాక్రమంబునం దన్నదిర్చిన యక్షుల నంతంబునొందించు చుండ దశకంఠుని మంత్రియగు ప్రహస్తుఁడును విజృంభించి వేవుర యక్షులఁ దునుమాడె. తాటకాతనయుఁడగు మారీచుఁడును ద్విసహస్రయక్షుల క్షణంబులోపలఁ బరిమార్చి యార్చె. మహోదరుఁడనువాఁడును మహోదరుఁడయి సహస్రయక్షుల నంతమ్ము నొందించె. ఇట్లు చతుస్సహస్రయక్ష ప్రవరులఁ బరిమార్చి మించినఁ బ్రహస్తాదులఁ గనుగొని భయమ్మున ధనదుని సైన్యంబు నలుదెసలకుఁ బాఱెను.

ఇత్తెఱఁగున దళవాయి దొలఁగిపోయినఁ గిన్నరేశ్వరుఁడు చతురంగబలమ్ము దన్నుఁ బరివేష్టించి సువర్ణరథంబెక్కి వచ్చి చుఱుకుఁజూపుల దశవదనుఁ గనుఁగొని "తమ్ముఁడవంచుఁ నీకు హితంబు బోధింప దూతఁబంచిన నావచనముల వినక నన్ను జయింపఁగోరి నిశాచరసైన్యంబుతో నేతెంచితివి. దుర్మతీ! భక్ష్యభోజ్యమ్ముల రోగికి రోగంబు హెచ్చినట్లు మాహితోక్తుల నీకుఁ గ్రోధం బగ్గలమయ్యెను. దుష్టులుగ్రంపు బాపంబు లొనరించి విషపాన మొనర్చి యది శరీరమంతయు వ్యాపకమైన చింతిల్లునట్లు నీవంటిమూర్ఖులు యమపాశబద్ధులై పాపఫలానుభవంబు జెందునెడఁ బాపము చేసితిమంచు దుఃఖింతురు. గురునకును, అన్నకును, దండ్రికిని ఎవ్వాఁడు ద్రోహ మొనర్చునో యాతని గనుగొన్న పాపములు వచ్చును. శరీర మస్థిరము. మృత్యువు నిత్యమును సన్నిహితమునై యుండును. పుణ్యవశంబుచే సంపదలు గలుగుచుండునని యెవ్వాఁడు తలఁచునో యాతఁడే కృతార్థుఁడు. శుభాశుభంబుల గుర్తెఱిఁగి

బుద్ధిపూర్వకముగ జనుఁడొనర్చు సత్కార్యంబుల దేవతలు మెత్తురు. ధనకనక వస్తువాహనాదుల బలముచే సంపాదించి తిని. ధర్మంబు సేయకున్న నేమి ? యని దివిజుల బాధించు చుంటివి. ఇట్టినిన్ను తమ్ముఁడనని చెప్పిన నిరయంబు గలుగును. కావున యుద్ధమునకు రమ్ము" అని పలికిన నాయిరువురకును ఘోరసంగరమ్ము ప్రవర్తిల్లె.

అంత దశాస్యుఁడు మాయాయుద్ధ మొనర్చిన ధనదుఁడు రక్కసులుల్లసిల్లునట్లుగఁ దేరిపైఁబడి మూర్ఛిల్లె అంత దశవదనుఁ డలకాపురమ్ము సొచ్చి సువర్ణకుంభ స్తంభములు గల్గి వైడూర్యతోరణములచే నొప్పుచు మౌక్తికవితానంబులచే నలరారుచు చంద్రకాంత వేదికలచే రమ్యంబై, సొగసైన వజ్రంపు సోపానములచే మించినదై, కోరినకోరికల నిచ్చు గొప్ప మహీరుహంబును, ఇంపైన దీర్ఘికలును గలిగి మనోజవంబై కామగమనంబుగల పుష్పకంబను విమానంబు గాంచి దానిపై నెక్కి తారాద్రి కేగె. ధనేశ్వరుఁడును దెప్పిఁతి తన సేనతోడఁగూడి లజ్జాభయంబులతోఁ దన గీము సేరెను.

—♦ దశవదనుఁడు కైలాసమున కేఁగ నంది శాపంబిచ్చుట ♦—

పుష్పకారూఢుఁడై దశవదనుఁడు రజతాద్రి కేఁగి యచ్చటివింతల జూడఁదలఁచి యామహాశిఖరమెక్కి యచ్చో చరించుచు కొంతదవ్వేఁగ నావిమానంబు సాగిపోక నిలిచెను. అట్లు నిలిచినఁజూచి పంక్తికంధరుఁడు నివ్వెరగంది "దీనినాపశక్తుఁడొక్కఁడు గలఁడే? కారణము నారయుఁడ"ని మంత్రులఁబంప వారును బరికించి యేహేతువును లేదని నుడివిరి.

అంత మారీచుఁడు రాక్షసాధిపుఁ గనుఁగొని 'దేవా! ఈ విమానంబు యక్షేశునకుఁగాని యన్యులకుఁబనిచేయదో? లేక యాతఁడే క్రోధాతిశయంబున నిల్పెనో? విచారింపుఁ" డన బలవంతుఁడగు నంది దీప్తాస్యుఁడై యాపౌలస్త్యుతోనిట్లనెను. "రజనీచరనాథా! విమాన మాగెనని యేల నివ్వెఱపడెదవు? శంకరుఁడు దేవీసహితుఁడై యిచ్చోట విహరించుచుండును. సురగరుడోరగాదు లిచ్చటికేతెంచుటకు భయము సెందుదురు. నీవును చెడిపోక నీబలముతో మరలిపొమ్ము." నావుడు నసుర భర్తపటపటపండ్లుగీటుచుఁ బుష్పకంబుడిగ్గి "శంభుఁడననెవ్వాఁడు? ఆహా! నన్ను నిల్పు సామర్థ్య మాతనికిఁ గలిగెనా? నీవును నీశంకరుఁడును ఈశిఖరంబుపై నెట్లునిలిచెదరో చూతము గాక" యంచుఁ జెచ్చెర నాపర్వతముక్రింది కేతెంచి, యపర శివునివలె శూలహస్తుఁడై వెలుగుచున్న వానరముఖుఁడగు నందినిఁ జూచి పకపక నవ్వెను.

ఇట్లు దన్నుఁగనుఁగొని నవ్వుచున్న మూఢుఁడగు దశ వదనుఁజూచి యానంది యాగ్రహమునొంది "కపివదనుఁడనగు నన్నుఁజూచి హాసించినాఁడవు గావున వానరులే నీకులంబు నాశనంబుచేయుదురు. అంత నీగర్వ మడఁగును ఇట్లు శాపం బిడుటయేమి? నన్నెదిరింపరాదా యంటివేని నీవు నీచేయు పాపంబుచేనాపద్వార్ధిమునుఁగఁగలవు. నేనిఁకనిన్నొంచనేల? అని శాపమిచ్చిన దేవత లానందించి విరులవాన లాతనిపై గురియించిరి. దేవదుందుభులు మొరసె.

—దశగ్రీవుఁడు వెండికొండఁ బెకలించి శివునివలన వరములు వడయుట—

అంత దశాననుఁడు మదాంధుఁడు గావున శాపంబు నొందియు నొక్కింత చింతనొందక వెండికొండ దండఁజేరి తనయగ్రమున నిలుచున్న నందితో "నీ పశుబుద్ధి మాటల మానునే ? నా పుష్పకం బిక్కడ నాఁగిన మీయధిపుఁడు సుఖంబుగనుండునుగాని లే? ఈరజతాద్రి నిప్పుడే యే బెకలించి రజంబు సేసెద చూడుము" అని దురాగ్రహంబునఁ బలికి దుర్వారగర్వాకర దర్వీకర భీకరంబులైన వింశతి కరంబులు సారించి హుంకరించి యహంకరించి యవ్వెండికొండఁ బెకలించి కందుకక్రీడ గావింపఁ గడంగెను. శంభుఁడును లేఁతనగవాననమున నొప్పుచుండఁ దన వామపాదాంగుష్ఠమున నగ్గి నదిమిన దశాస్యు హస్తంబులు క్రిందుపడియుండె. రక్షోవిభుఁడును తనకరము లెత్తుకొన సమర్థత లేమి కులశైలంబులు ప్రతిధ్వను లిచ్చుచుండ, శేషాహి మూర్ఛిల్ల భూవలయంబు దిద్దిరందిరుగ, నమరజ్యేష్ఠుఁడు భయమునొందఁ, జుక్కలురాల, సురలు కంపంబునొంద, సాగరంబులు కలఁగఁబడినోళ్ళబిట్టుగ వాపోవుచుండెను ఇట్లు సహస్రవత్సరంబులార్తిఁజెంది కూయుచుండ మారీచుఁడు మొదలగు రక్కసు లాతనింగని "దైత్యస్వామీ! మామనవి యాలకించి శివునినారాధింపుము. అతఁడు శంకరుఁడు. కరుణానిధి. శరణన్నఁ గాపాడు. కావున నీ మొఱాలకించి యీక్షణంబున నిరోధంబు మానువును." అని బోధింప నాతఁడామహేశ్వరు మనంబున నిల్పి యనేక గతుల నిట్లనిస్తుతించె. "శంకర! సాధువశంకర! రిపుభటచయ

నాశంకర! నిన్ను నుతింప బ్రహ్మాదులు నోపరు. చలచిత్తుఁడ ఖలుఁడ. మదాంధుఁడ. జడుఁడ. నికృష్టుఁడ. నినుబొగడ నే నెంతటివాఁడను? నీదాసుఁడను. నీసామర్థ్యము నెఱుఁగక యపచారము చేసితి. నానేరము లెంచక నన్ను మన్నింపుము."

అనియిట్లు తన్నుం బ్రస్తుతించినదశవదనుఁజూచి పురారి నవ్వుచు "నీస్తుతికి మెచ్చితి. ధైర్యశాలి వౌదువు. అనుజ్ఞ నొసఁగితి. నీకు ప్రియంబగు నెలవునకుఁ బొమ్ము. నీభుజాబల మారయఁగోరి యిట్లు గావించితి. నాచేనదుమబడినపర్వతము క్రింద చేతులుపడిన యపుడు జగము లదురివ నారావంబు పలికితివి గావున రావణుఁడను నామంబునఁ బ్రసిద్ధికెక్కుము. అని వానికి సెలవొసంగిన దశకంఠుఁ డీశ్వరునకు నమస్కరించి "శివ! నీకు రక్షింప సంతసమేని పూర్ణాయుష్యమును నీచంద్ర హాసమును నాకొసంగుము." అనిన శంకరుఁ డాకైదువాతని కొసఁగి పిమ్మట సంపూర్ణమగు నాయువు నొసగ యిట్లనియె. "దివిజాధీశ్వర! నీవుకోరినట్లు దీర్ఘాయువొసంగితి. నీతిఁ గై కొనక క్రొవ్వున దుశ్శీలుఁడవై మమ్మనాదరణఁ జేసితి వేని మావర మ్ములు మమ్మే చేరును. పొమ్ము" అన నాతఁడును శూలికి మ్రొక్కి యుబ్బుచు విమానారూఢుఁడై తన పరివారము గొల్చుచుండ వెండికొండ డిగి స్వచ్ఛందగతిఁ జనియె.

—♦ వేదవతిని జూచి రావణుఁడు భాషించుట ♦—

పంక్తిముఖుఁడిట్లు కైలాసవాసునిచే మన్ననగాంచి ప్ర హాస్తాదులు దన్నుగొల్వఁగులగిరికాననంబులఁగ్రీడసలుపుచుఁ

దన యిచ్చకు వచ్చిన ట్టచ్చటచ్చట నిచ్చయి మెలంగుచు నొక్కనాఁడు హిమాలయంబున నుత్తరదిగ్భాగంబున నొక్క సుందరోద్యానంబు సందర్శించి యచ్చట కల్పలత చందమున విభూతిచేఁ దనులత వెలుఁగుచుండ, నొంటి గిరిజాతపశ్చేదపంబు సలుపుచున్న నొకమునికన్యంజూచి, యాచెలువ చెల్వంబున కబ్బురమునొందిపుష్పకంబుడిగి తదగ్రభాగంబుననిల్చి "ఇందువదనా! నీకులం బెయ్యది ? నీనామ మేమందురు ? నీప్రాణనాథుఁడై నిను నేలుభాగ్య మెవ్వరికిఁగలిగె ? నీ వెవ్వారిదానవు? ఏతపంబుగావించి యీచెల్వంబుగంటివి? లేఁబ్రాయంబుకానల పాలుగావించి యేల యిట్లు కృశించెదు ? "అనిన నానెలఁత యప్పలుకులు పెడచెవులఁ బెట్టి వాని విశ్రవసుతుఁగా నెఱిఁగి హీనుఁడని యెంచక యాతని కాతిథ్యంబొసఁగి "దనుజాధీశ ! కుశధ్వజుఁడను మునిపుంగవుఁడు గలఁడు. ఆతఁడు వేదములఁ బఠించు సమయమున నే నుదయంబై వాపోవుచుండఁ బ్రేమతోడ ననుగాంచి వేదవతియను నామంబిడి యతిగారాబంబునఁ బెంచుచుండెను. అంత లేఁబ్రాయంబు వొడమిన నన్ను గాంచి సురలును, మునులును, వలచి, వేఁడిన నీకన్య హరి కిత్తుఁగాని యెవ్వరికినీనని మాతండ్రియొసఁగఁడయ్యెను. ఇట్లందఱును నిరాశులై చనుచుండఁ బాపాత్ముఁడగు దంభుఁడను దైత్యుండొక్కఁడు వచ్చి మాజనకుని దా వేఁడి యాతఁడీనన్న నత్యంతక్రోధంబున నిద్రాసక్తుఁడైయున్న నాతండ్రిని ఖండించి యాబ్రహ్మహత్యాపాపంబున నాతఁడును నశించెను. అంత నాతల్లియును వెతచే నగ్నిసొచ్చి యసువులఁదొఱఁగెను. తలి

దండ్రి లిట్లు గతించిన నాయభాగ్యమునకుఁ గొంతవగచి తండ్రి ప్రతిజ్ఞ చెల్లింతునని తలఁచి వెన్నునిగుఱించి యిట తపంబు సేయుచున్నదానను. రాక్షసోత్తమా! నీవును నిచ్చట వింతలఁ గంటివి. నాపూర్వకథ సవిస్తరముగ వింటివి. నాచే నాతిథ్యముగొంటివి. తడవయ్యె, ఇఁకఁజనుమ"న నతఁడు మన మునఁ దనకాకన్య దక్కదని సంతసించుచు మన్మథాగ్ని కోర్వఁజాలక యాకన్యఁగాంచి "ఇదియేమి వెఱ్ఱి? ఎలప్రాయం బు వ్యర్థంబుగావించి విష్ణుఁడంచుఁ గాలంబు గడపుచున్న దానవు. హరి కిత్తునన్న నీతండ్రి యీల్గుటఁ గన్నులఁ గాంచి యు నీప్రియంబు కాఱడవిఁగాచిన వెన్నెలగావించి హరియె కావలెనంచుఁ దపించుచున్నావు. హరి తాను బలవంతుఁ డయినచో మీ తండ్రి నొక్కరుఁడు వధింప నడ్డపడి బాహు బలంబుఁ జూపెనా? హరియను నామంబు కప్పకును కలదు. ఏల యీవృథాలాపంబులు? ఇంతీ! రూపవయస్తేజఃప్రభా వాఢ్యుఁడనగు నన్నుఁ బొందిన నీకు మేలగున"నెను.

అంత నవ్వనజదళాక్షియుఁ జిగురుటాకులఁ గేరు కేలుదోయిని జెవులు మూసికొని వాని ననాదరదృష్టిఁజూచి "పాపాత్మా! నీదుష్టతలంపు మానుము. వెన్నుని యెంత ఖలుఁడయినను నిందసలుపునే? బ్రహ్మవంశమునఁ బుట్టియు నిట్టి మూర్ఖత్వమును మానవు. అయ్యో! సృష్టికర్తయగు బ్రహ్మదేవుని సృజించినవాఁ డతఁడు కాదే? నీయందును నా యందును నఖిలభూతము లందుమ నంతరాత్మయై కనునాత్మ యతఁడు కాదే? శిష్టసంరక్షణమును దుష్టశిక్షయును గావింపఁ

ప్రతియుగంబు నవతరించువాఁ డతఁడు కాదే? అట్టి మహాత్ము నిర్నిమిత్తంబుగ నిందింప నీకుఁ దగునా? పౌలస్త్య! వేయి మాట లేల? నా మనోవాక్కాయంబులును ఎల్లప్రాయంబును నాతనికే యర్పింపఁబడినవి. చెడ్డతలంపులు మాని యాయ్యలు వర్తించుమార్గమున మెలఁగుము. అటులైన దేవుఁడు నిన్నుఁ గాపాడును" అనిపలికి భయమున్న నచ్చట నిలువక మార్జా రంబునకుఁ దొలఁగు శుకంబు పగిది నావలకుఁ జనియె. అంత రావణుఁడును కామాంధుఁడు గావున యుక్తాయుక్తశూన్యుఁడై యా కన్యవేణికఁబట్టి యీడ్చెను.

వేదవతియును గలఁకదొలఁగి చెచ్చెర బెత్తిలియె త్రివేయ నా వేణి నట్టనడుమం దెగి వాని చేతికి దున్కచిక్కెను. అంత రావణుఁడదిగాంచి "యిది దీనితపఃప్రభావ"మని నివ్వెఱపడి చూచు చుండ నచ్చెలియుఁ గ్రోధమూర్తియై చుఱుకుచూపుల నాతని గాల్చునటుల వీక్షించి "ఓరీ! నీవిపుడు నన్నంటుకొంటివి. కావున నీమేను మండుచున్న యగ్నిలో నీరుగావించి నిను జంపించుటకై భూమియందుఁ గ్రమ్మఱ జన్మించెద" నని మహోగ్రతఁ బలికి కోపాగ్నితోడ యోగాగ్నియు మండు నటుల గావించి రావణు నెదుట నిల్చి విష్ణుదేవుని మనంబున నిల్పి యాతఁడు వినుచుండ, "ఏను నిక్కంబుగ హరిని మనంబుననిల్పిన దాననేనిఁ గరుణించి యావెన్నుఁడు పత్నిగఁ జేకొనుమాట తథ్యంబేని నయోనిజత్వమున భూమిపై జనియించి పుత్రమిత్రకళత్ర సహితంబుగ దశాస్యుఁ జంపఁ

గారణమయ్యెద"నని యగ్నిఁజొచ్చెను. తత్సమయమున వేద వతి వాక్యంబులు వేదమువలె నిజమగునని వినువీధినశరీర వాక్కులు వినఁబడియె. సురలు కుసుమవృష్టిఁ గురిపించిరి. ఇట్లు వేదవతీకన్య యనలశిఖ గ్రమ్ముటఁజూచి చపలుఁడగు పంక్తిముఖుఁ డచ్చోటువాసి పుష్పకంబెక్కి భూమిని దిరుగు చుండెను.

వేదవతీ కన్యయుఁ దన ప్రతిన నెరవేర్పఁదొ ల్త లంక యందొక తోయజాంతరమున జన్మించి నీకు మిత్తినై యేగు దెంచితినన్నట్లు దశకంఠునకే కానఁబడియె. అంత నతఁ డది తనకు దుర్నిమిత్తమునిమెంచి దాని నొకపెట్టెయఁబెట్టి యబ్ధిలో వేయింప నలలవశమున నది విదేహనగరమ్మున్జేరి జనకుఁడు యాగశాల గట్టఁదలఁచి యాభూమిని దున్నించుచుండ నాగేటి చాలులో నాతనికిఁదొరిఁచె. నాగేటిచాలులో దొరికినందున సీతయను నామమిడి యాకన్యను మిథిలేశుఁ డతిగారాబమ్మునఁ బుత్త్రికనుగాఁ బెంచుకొనుచుండెను.

కార్తవీర్యార్జునుఁడు రావణుఁ జెఱఁబెట్టినఁ బులస్త్యుఁడు విడిపించుట.-

సకల సంపదలచే నొప్పు మాహిష్మతియనుపట్టణంబు కృతవీర్యసూనుఁడగు నర్జున చక్రవర్తి యింద్రవిభవంబున నేలుచుండును ఆతఁ డొకదినంబున దశలక్షలకోటి కరణీ నాథుఁడగు గజేంద్రుచందంబున నసంఖ్య లలనామణులంగూడి యాసన్న నదీ విలోకనకౌతుకంబునఁ జనె. ఇట్లు చని యాబు నివారిత దుర్మదయగు నర్మదంజేరి ద త్తీరవన సౌభాగ్యం బున కెద మెచ్చి యావాహినియందు జలక్రీడలాడఁదొడఁగెను.

అక్కాలంబున రావణుఁడు దైత్య గ్రామణులం గూడి పుష్పకంబెక్కి యుద్ధాపేక్షఁ జరించుచు నర్జునుని బలపరాక్రమాకులు విని సహింపక యతికోపంబున మాహిష్మతికిం జని యాతని మంత్రులఁ జూచి "సమరంబుగోరి రావణుఁ డేతెంచెనని మీయధిపుతోఁ జెప్పుఁడ"న వారాతనిఁ గనుఁగొని "అయ్యా! వేసడములమీఁదను శకటములమీఁదను బరువులెత్తించుకొని చతురంగబలంబులు గొల్వఁ జెంతల నెవ్వానిఁ జేరనీక భద్రగజారూఢుఁడై యంతఃపుర స్త్రీలఁగూడి నేఁడు నర్మదాతీర వనభూముల కేఁగినాఁడు. నేఁడేవచ్చునో? రేపు వచ్చునో? వనభూములఁ బ్రియభామినులఁగూడి విహరింపుచు రానేరాఁడో? రాజులచిత్తంబు లెవ రెఱుంగుదురు ? రాక్షసాధీశా ! నీవలె గర్వంబున మాపురంబుసేరి యిట్లు భాషించినవా రెవ్వరును లేరు. నీవుగ్రుఁడవు కావున నాతఁడు వచ్చినతోడనె రమ్ము. అట్లయిన మేలగును." అన రావణుఁడు నవ్వి "ఈమాయ మాటలేల? మీయొడయుఁడు నాప్రసిద్ధి విని నన్ను జయింపఁ జాలక స్త్రీలంగూడి పాఱెఁగాఁబోలు? రణభీరునితో రావణుఁడు పోరాడునా?" యని మదాతిరేకంబున నచటినుండి చనియెను.

ఇట్లతఁడు మాహిష్మతీ పురాధీశుఁ గానక ప్రహస్తాది మంత్రిపుంగవులు గొలుచుచుండఁ గొంత దవ్వరిగి వింధ్యాచలంబు గని యక్కొండచక్కటికిఁ జక్కనరిగి, యచ్చోటి వింతల నారయుచు నాపర్వత సమీపంబునున్న నర్మదానదిని జేరఁబోయి యిది స్వర్నదీ సాటియగురా యనుచు నుత్తుంగంబగు నాతటిని తటంబున మదగజంబువలెం దిరుగుచు

బ్రహ్మాస్త్రాది మంత్రములఁ గనుఁగొని లేనగవుతో "దినకరుఁడు నాదీప్తికి భీతిఁజెంది యాకాశమధ్యంబు సేరిచల్లనై శీతకరు చందమున నున్నవాఁడు. కాన మీర లీనది గ్రుఁకి శివపూజకుఁ గుసుమంబులు తెండ"ని యాజ్ఞాపింప, వారలును జిత్తమంచు నావాహినియందు స్నానము చేసి దుకూలధారులై యాప్రాంతవనంబులఁ గుసుమాపచయ మొనర్చి మల్లెలు, మొల్లలు, సంపెంగవిరులు, నందివర్ధనంబులు, బిల్వదళంబులు మొదలగు పూజార్హవస్తువులు గొండలవలెఁ బాడవుగా వైచిరి.

దశవదనుఁడును సంతసించి యా నర్మదానదియందు సంకల్ప పూర్వకంబుగ శంకరు స్మరించుచు, మునిఁగి శైవ మంత్రంబు జపించుచు నేమంబున మడుంగులుగట్టి యొంటరిగ నొక సైకత ప్రదేశంబునఁ గూర్చుండి యొక సువర్ణ లింగంబుఁ బ్రతిష్ఠించి సునిష్ఠతోడఁ బ్రాణప్రతిష్ఠగావించి యావాహనాది షోడశోపచారము లొనర్చి పంచాక్షరీ మంత్రమునను, నమకమునను, రుద్రీయమునను, పూలతోడఁ బూజలఁగావించెను. అమ్మహాపూజ నిర్విఘ్నముగఁ గొనసాగెనేని యెట్టి శత్రువునైనను గెలువఁగలఁడు. విఘ్నమొందెనేని యోడిపోవును. మత్తుఁడగుటచే నీవిషయమును గ్రహింపక యాతఁడు పూజచేయుచుండెను. మఱియు నాతఁ డంబరం బదురవదశ వదనంబుల హరహరయంచుఁ బలుకుచుఁ గదలక మెదలక పద్మాసనాసీనుఁడై నిశ్చలచిత్తంబున ఫాలాక్షు నతిప్రీతిఁ బూజించుచుండెను.

అత్తఱి నచ్చోట కార్తవీర్యార్జునుఁడు కామినీమణుల తోడఁ గలసివనవిహారంబు సలుపుచు నలసి శ్రమయడంగ నమరీయుక్తపురందరుచందమున స్వస్త్రీలతోడంగూడి పశ్చిమ వాహినియగు నా నర్మదా నదికిఁ దన సహస్రకరంబులుతోడ నడ్డంబుకట్టి జలవిహారంబు సలుపుచుండెను. రేవానదియుఁ గృతవీర్యసూను బాహు రోధమునఁ బైకిపొంగి తుంగభంగ ముల నార్భటిని తూర్పు నముద్రపువంకకు మరలె. పర్వతంబు నైనను దెగఁగోసి నుత్తకేసరిమాడ్కిఁ బాఱునాతరంగిణి యాభూవరుని బాహువిజృంభణమును గడచిపోవ బలమ్ములేక సత్వరమ్ముగఁ దిరిగివచ్చి దశవదనునిసువర్ణలింగమును, బూజా ద్రవ్యములను, బ్రవాహమ్మున ముంచివైచెను. తన పూజా విధికి విఘ్నంబురా, దానవేంద్రుఁ డద్భుత రసాంభోనిధి మునింగి "ఈ వాహిని పశ్చిమాంభోనిధి సాంగత్యంబు వదలి ప్రాగ్వారాశిఁగూడఁ బోవుచున్నది. ఇదేమి వింత?" యంచు శివపూజా నియమమ్ము వదలక కరసంజ్ఞలచేఁ జెంతనున్న మంత్రులఁ బిలిచి ప్రవాహ కారణము నారసిరండని పంపెను. వారలలో నేర్పరులయిన శుకసారణులను వారు గగనమార్గం బునఁ బడమటిదెసకు యోజనదూరము సన నచ్చట కామినీ మణుల కలకలధ్వనులు వినఁబడియె.. ఇట్లాకలకలంబులు విని వారిచెంత సమ్మోహనగాత్రుఁడును జలఖేలాయత్తచిత్తుండు నగు కృతవీర్య పుత్త్రుఁ గనుఁగొని నివ్వెఱపడి సత్వరంబుగ మగిడి దశాస్యుఁజేరఁ జని యంజలిఘటించి వానితో

"దేవా! యొకవింత విను(డు. సింగారంబున మారుంబోలిన వా(డును మహా బలిష్ఠు(డునగు నొక్కరు(డు నిజభుజా సహస్రంబుచే నిమ్నగానదిని బంధించి యువిదలతోడ జల విహారంబు సలుపుచున్నా(డు. అక్కారణమున నీతటిని పడమరసనక తూర్పుకు మరలె. ఆత(డు తమకంటె నధికు(డో తమకుం దుల్యు(డో మేమెఱుంగము గాని యట్టివాని నిదివర కెన్న(డును జూచియెఱు(గము" అని విన్నవించిరి.

రావణు(డును శివపూజానియమము సాలించి"యాత(డు మాహిష్మతీపురనాయకుం డగు. ఆహా! నేటి కాత(డు కనం బడియె. మాయిరువుర తారతమ్యంబుగానుపింతు; రండ"నిన దానవయోధులును జతురంగ బలములతోడం దనవెంటం జనుదేరం బ్రతికూల మారుతంబుల లెక్కసేయక పశ్చిమో న్ముఖు(డై తత్తటినీతటంబునం బోయిపోయి యాప్రవాహంబున నంగనలం గూడి విహరించు రాజేంద్రునరుణ కమలంబులం దెగడు వింశతినేత్రముల దవ్వులనె జూచి యాతనిం జేరంబోవ వానిప్రధాను లడ్డంబువచ్చి యాక్షేపించి "కొమ్మలం గూడి రాజున్నరహస్యంబు నెఱుంగక యిట్లేగుట వివేకమా?" యన "నే రావణు(డ. మీరాజుతో సంగరంబు గావింప నేతెంచి నా(డను, బిలువం బొండ"ని వారల యదలించెను. వారును దశాస్యుం జూచి "సమయము గుర్తెఱుంగక భూవరుని యుద్ధమ్మునకు రమ్మనుట పాడియా? సంగరాపేక్ష యంత గలదేని మాంతోడం బోరుము" అనిన వింశతిభుజు(డు ఆరాజ పుత్త్రిల, మంత్రుల నెదిర్చి, శస్త్రచయంబుచే గాత్రంబులు

నొప్పింప హైహాయుని సేనానాయకులును వివిధబాణ పరం
పరలఁ బ్రహస్తాదుల కాయంబుల శిథిలంబుగావించిరి. అంతట
రావణుఁడు కట్టలుకతోడ సేనల నగ్నిసఖుఁడు గహనంబుఁ
గాల్చు విధమున నొక్కుమ్మడి ధ్వంసముగావించెను.

ఇవ్విధమున దనుజేంద్రుఁడు బహు సేనాధిపతుల
నుక్కడఁగించిన హతశేషులు కొందఱు కార్తవీర్యుకడ కేఁగి
"స్వామీ! పరాకు. రావణుఁడను పేరుగలవాఁ డొకఁడు
మిమ్ము జయించుటకయి యేతెంచి పేరుగల మన సేనాధి
పతుల ననేకుల హుడియించె. ఆతఁడు జగదేకవీరులఁ గొందఱి
జయించినాడఁట!" అని చెప్ప మాహిష్మతీనాథుఁ డరుణాక్షుఁ
డగుచు దంతఘర్షంబు భ్రూకుటిస్ఫురణమించ శత్రువాహినీ
రోధంబుమాని వృథావాహినీ నిరోధ మేలయనుచు తటినీ
నిరోధంబు మాన్పి తటంబుఁజేరి ధౌతాంబరమ్ముల ధరించి
భూషణంబులుదాల్చి గదాయుధహస్తుఁడై క్రోధము మూర్తీ
భవించెనో యన్నట్లు రావణుపై కుఱికెను.

అత్తఱిఁ బ్రహస్తుఁడను రావణు మంత్రి హైహాయు
నెదిరించి యాతఁడు గదాయుధంబుచే నొంపఁ గులిశాహతిచేఁ
గూలు నచల శృంగమువిధమున నేలపైఁబడియె. ఆతనిపాటు
చూచి శేషించిన మంత్రులొకరిమార్గమున నొకరు సనక
భీతిచేఁ బరువులిడఁ దొడఁగిరి.

అంత దశవదనుఁడు సింగంబుకరణి విజృంభించి యట్ట
హాసంబు గావించి భయంకర గదాదండంబు చేఁబూని కృత
వీర్య సూనుం దలపడిన నాతఁడును గీర్వాణు లగ్గించునట్లుగ

దైత్యభర్త మార్గ్యానిమె. అంత నాయుభయులకుఁ బోరు ఘోరం బయ్యెను. ఇట్లయ్యిరువురును బరస్పర జయ కాంక్ష ఘోరంబుగఁ బోరునెడ భూవరుఁడు రావణు డాసి మున్ను వామనుఁడు బలిఁ గట్టివైచిన విధమ్మున వానిఁ బాశ బద్ధుంజేసి సురలు కుసుమవర్షంబు గురిపించుచుండఁ దన పురి కేగెను.

పిమ్మటఁ బ్రహస్తాదులు తనయరదంబు చుట్టుముట్టుకొని "రాజా! ఎందుబోయెదు? నిలునిలు"మనుచు నదలించి శర పరంపరలు గురియింప నతఁడాయమ్ములన వారలవైచి సమర విముఖులఁ గావించె. అప్పుడు 'దశవదన గర్వవేదండ కంఠీరవ' యని వందిమాగధులు నుతింప సేనాముఖంబునఁ దూర్యఘోషంబులు సెలంగ నిండుప్రెదుట నచ్చరలవలె వారాంగనలు నృత్యంబు సలుపుచుండ భూసురు లెదుర్కొని ఫలాదుల నొసఁగి దీవనల నిచ్చుచుండ వివిధశృంగారంబులచే నలరారు నాత్మసౌధంబు సేరి గొలువు కూటమ్మున కేఁగి యందఱు నచ్చెరువందిచూడ దైత్యేంద్రుఁ జెఱసాల వేయఁ బంచి యర్జునుఁడంతఃపురమ్ము ప్రవేశించెను. పెద్దలఁ జెఱపెట్టినట్టి పాపంబున నేఁడు నీవిట్టులైతివంచుఁ బౌరులు తన్నుఁదిట్టుచుండ నాతఁడు దీనాననమ్మునఁ జెఱయం దుండెను.

దయాసముద్రుఁడగు పులస్త్యమహర్షియుఁ దనపౌత్రు వృత్తాంతంబునంతయు వియచ్చరులు దెలుప నిండుప్రసదనంబుఁ జేరెను విరించివిధమున నా సహస్రబాహుని వీటికేఁగి రాజ ద్వారమున నిలిచిన ద్వారపాలురు "పులస్త్యబ్రహ్మ విచ్చేసి

నా''డని రాజుతో విన్నవించిరి. అంత నా భూవరుఁడు అర్ఘ్యపాద్యాదులంగొని యధికభక్తితో నమ్మహామునికిఁబూజ లొనరించి యాసనపలికిం గొనిపోయి యున్నతమగు సింహాసనమున నిలిపి "మహాత్మా! మీరు నేఁడు మాగృహమునకు విచ్చేయుటచే నేనెంతయు ధన్యుఁడనైతిని. మా వంశము పావనమయ్యె. వీరలు నా పుత్త్రులు. వీరే నా మంత్రులు. వీరే నా బంధుమిత్త్రాదులు. మేమెల్లరము మీయానతి శిరసా వహించి మీ రేది పంచిన నయ్యది చేయువారము. మీ యభీష్టంబు విన్నవింపుఁడు', అనిన నమ్ముని ముదితాత్ముఁడై "నృపాలా! నీ భక్తికిని, నీ ప్రియోక్తులకును సంతసించితిని. నీవఖలసంపదలచే నిండిననుఁ సాటియనఁదగువాఁడవు దశవదనుఁ జెఱయందుంచితివన నీబలంబు కొనియాడ నేల? ప్రతిపక్షుఁడు నిన్నెదిర్చి పోవఁగలఁడా? నీవు నాయభీష్టము దీర్చెదనని యిపుడు పల్కితివి గాన నే సంతసించుటకై దశాస్యు బంధ విముక్తునిఁ జేయుము". అనిన నాజనపతి సంతసించి "మీ యానతి నెరవేర్చుటకంటె నాకు శుభ మెద్ది గలదు?" అని యద్దనుజేంద్రు విడిచి భూషణాంబరాదుల నాతని సత్కరించి యగ్నిసాక్షిగ నాతనితో సఖ్యంబొనర్చెను. పౌలస్త్యుఁడును బౌత్త్రు నూరడించి తన యాశ్రమమున కేఁగెను.

—♦ వాలి రావణుని గర్వం బడంచి పరిభవించుట ♦—

పంక్తిముఖుఁడు పుష్పకం బెక్కి సేనలతోఁ గూడి యటునిటుఁ దిరుగుచుఁ గరుణయొక్కింతయును లేక భూజనుల బాధించుచు వాలితోఁ బోరనెంచి కిష్కింధాపురమున కేఁగి

పురద్వారమున నిలిచి గర్జించుచుండెను. ఆ సింహనాదమ్మును విని తారుఁడనువాఁడు వచ్చి దశముఖుఁజూచి నీరాకకు గతమేమని యడుగ నాతఁడు గరువముతోడ "వానరేంద్రా! వాలి మహాశూరుఁడనివిని యాతనితోడఁ గయ్యమ్ము సేయ నేతెంచినాఁడ. ఆలస్యంబేల? యాతని బంపుము" అనినవిని తారుఁడు నవ్వుచు "రావణా నీవెంతటి వెఱ్ఱివాఁడవు? వాలితో సంగరము సేయ నెవ్వఁడోపు? పరమేశ్వరుఁడయినను నాతని నెదిర్చి నిల్వనేరఁడు. నీవనగ నెంత? అతనిచే నిదివఱకెందరు నొచ్చిరో నీవును నెఱుంగుదువు. ఆతఁడు చతుస్సాగరముల స్నానములఁజేయఁ బోయె. నీకుఁ బ్రాణములపై నాశలేదేని దక్షిణ సముద్రమున కేఁగుము." అనిన రావణుఁడు వారిని ధిక్కరించుచు, నీ వానరపురమునఁ గ్రొత్తమాటలు వింటిననుచు మదాతిరేకమున నాక్షణముననే దక్షిణ సముద్రతీరమునకుఁ జనెను.

ఇట్లు చని యచ్చోట మార్గాయాసమ్ముచే బడలి పుడమి కేతెంచిన ప్రభాకరుని చందమునను, ఉత్తరదిక్కును వదలి వేడుకతోడ దక్షిణదిశ కేతెంచిన మేరు నగంబు విధమునను ఎల్లప్పుడు నంబుపానమ్మొనర్చి యాయాసమునఁ దీరంబుఁజేరిన బడబానలంబు మాడ్కిని కరచరణాద్యవయవములం దాల్చి కపిరూపమును ధరించిన జముని తేజంబు పగిదిని జూడనలవికాని ప్రభావంబుతోడను, నుదగ్రమగు తనువుతోడను గీలికాభీలంబగు వాలమ్ముతోడను, అరుణాననంబుతోడను, సంధ్యవార్చునట్టి వాలిని గనియెను. కని సామాన్య వానరునిగా నెంచి రాక్షసేంద్రుఁడు అవ్వాలి వంచింపనెంచి

తన ప్రధానుల దూరముననిల్పి తా నొక్కఁడే పుష్పకంబు డిగి సద్దుగాకుండఁ బాదంబులఁ బెట్టుచు వెనుకగ నేతెంచుచుండ నవ్వాలియు పదముల చప్పుడు కొంత విని కన్నులు విచ్చి తన్నుఁ గపటంబున వంచింప వచ్చుచున్నాఁడని గ్రహించి యాతని భూజాంతరంబులఁ బొదివి చతుస్సముద్రముల ముంచెద నంచు జపించుచుండెను.

తత్సమయంబున రావణుఁడు పాదాగ్రములఁ దిన్నగా నడుచుచు పశ్చాద్భాగంబు సేరి హస్తముల వానిపైఁ జాచిన ప్రబలుఁడగు నవ్వాలి హర్యక్షంబు గజమునుబట్టు విధమునఁ జండసత్వంబున నందిట నాతనిశిరములును బ్రక్కలును బాహు పంక్తులును నిఱికించి యాతని శరీరమంతయు నొవ్వఁజేయుచుఁ దన పరాక్రమంబు గన్గొని దేవతలు స్తుతిఁ జేయుచుండ నాక సంబున కెగసి పశ్చిమాంబుధిఁ జేరె. అంతఁ బ్రహాస్తాదమంత్రు లాకసంబున కడ్డంబువచ్చి తన్నుదిరింప నాతఁడు వాలజ నిత ఝంఝానిలంబుచే వారల మేఘంబులరీతి విచ్చి పాఱు నట్టుల సర్వాంగములు కంపింపఁజేయ వారు నొచ్చి చనిరి.

పవనుఁడు మేఘములఁ గొనిపోవురీతి నిట్లు దశకంఠ నుండు పంక్తివదనుఁ గొనిపోయి పశ్చిమసముద్ర జలముల మునిఁగి యచ్చట కాలకృత్యంబులు నిర్వర్తించి యుత్తరసము ద్రమునకుఁ జని యథావిధిని స్నానంబు గావించి, తూరుపు వారిధిఁ జేరి యందు జపతపాదు లొనరించెను. ఇవ్విధమునఁ గృతకృత్యుండై కిష్కింధా పురోద్యానమ్ము ప్రవేశించి భుజాంతరమున నతి దీనత్వముం వ్రేలాడు రాక్షసరాజు నందుం

బడవైచి యాతని నెప్పుడును జూడనివానివలె "హా! ఎచ్చో టినుండి వచ్చితి" వని యడిగె.

అతఁడును వీతాహంకారుఁడయి శరీర మాద్యంతంబు చెమర్పఁ గన్గొనల బాష్పంబులు గ్రమ్ముకొన నిట్టూర్పులునిగిడించుచుఁ బునర్జన్మంబు నొందితిననని యెంచి "ఇంద్రనందనా! నీవె బలియుండవనియు దయార్ద్రహృదయుఁడవనియు నిశ్చల మతివనియుఁ దెలిసికొంటిని. మదీయ గర్వాంధకార మంతయుఁ దీఱె. కైలాసగిరి నెత్తి శివుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడనై యాతనివలన ఖడ్గంబుఁగొని దిక్పాలురఁ గలంచి మించిన నన్ను నీ భుజాంతరమున దూలంబువలె వ్రేలాడఁ జేసితివి. నీ యెదుట నా శౌర్యమంతయును వృథాయయ్యె. నీ జవంబునకు వాయువేగ మనో వేగంబులును, గరుడున వేగమును, లవంబునకైనను సాటియనరాదు. ఏను సురగరుడోరగాదులఁ గాంచితిని గాని యిట్టి బాహుబలసంపద నెచ్చటను జూచియెఱుఁగను. నీకృష్ణుగ నియ్యది స్తవముకాదు. ఇంతటినుండియు నీవు నాకన్నవు. నేనును నీకు సుగ్రీవుని వంటి తమ్ముఁడను. నా ధనము నంతయు నీ యధీనంబు సేసెద. నాతోడ సఖ్యం బొనరింపు" మని యనేకవిధములఁ బ్రార్థించిన నాయిందుజుఁడును సంతసమున వానికిష్కంధకుఁ గొనిపోయి యనుజుని మాడ్కి నాతనిఁ జూచుచు మిగుల సన్మానము జేయుచుండెను. అయ్యాసురపతియు నచ్చోట నొక మాసము వసించి యా సురపతిసుతుఁ డనుప నచ్చోట నుండి చనియెను.

—♦ నారదుననుమతిని రావణుఁడు యమునిపై దండెత్తుట ♦—

ఇట్లు దనుజేంద్రుఁడు కిష్కింధ వెడలి తొల్లింటివలె నృపుల హింసించుచుఁ దిరుగుచుండ, సమయంబున సర్వాంగముల విభూతికాంతులు శరత్కాలచంద్రిక నపహసించుచుండ దేవర్షి యగు నారదమునీంద్రుఁ డేతెంచిన దైత్యేంద్రుఁ డుప్పొంగి నమస్కరించి సేమమారసి యాకలకలశబ్దముతోడ "మునీంద్రా! మీ రెచ్చటినుండి యెచ్చటికేగుచుంటిరి? ఈ బ్రహ్మాండమున మీ రెఱుఁగని కార్యము లేదుకదా? జగతీనాథులగెల్చు నా శౌర్యము మెచ్చవచ్చునే? లోకమునఁగల విశేషములెవ్వి? యానతిండ"నిన చతురవచనరచనావిశారదుఁడగు నారదుఁడు ఆకసమునఁజను పుష్పకము నిలుపుమని నియమించి "రాక్షసేంద్రా! నీకుఁగుశలమా? ఏనెప్పుడును నీసేమంబెయారయు చుందును. కాని శూరాగ్రేసరుఁడవగు నీవెల్లప్పుడు మానవులతోఁ బోరాడుటంగని యిసుమంతయు సంతసము నెందక యున్నాఁడను. అదెట్లంటివేని చెప్పెదవినుము. నీవు మనుజుల గెల్చుట యనఁ బిచ్చుకపై బ్రహ్మాస్త్రము వేయుటయేకదా? ఇంద్రాది దిక్పాలుర మార్కొనక, విష్ణు నెదురింపక, నీవు మానవుల నంతంబునొందించుట సామజరాజము దోమల మార్కొను విధముదే? ఈవు కమలాసను వరములఁ గోరు నప్పుడు వానరులను నరులను లెక్కసేయక దేవశ్రేణిని జయింతునని పలుకలేదే? భయశీలుర నంతమునొందించుట యేటిన్యాయము? బలముగలదేని పాతాళవాసుల ఫణాధరు లగు దైత్యుల మార్కొనుము." అని మానవహితంబు

గోరి విరించిపట్టి రావణునకు రసాతలజయోద్యోగమ్మునందు బుద్ధిపుట్టించి మఱియు "దైత్యవల్లభా! ఇఁక మనుజుల హింసింపక పొమ్ము. ఇంతదనుక నీగెల్పు గెల్పుకాదు." అనిన నతఁడు నారదునిజూచి నగుచు "మునీంద్రా! మీరు మనుజ హితమ్ముగోరి యిట్లు పలికినది నాకును సంతసమే శూరులకు భీరుల మార్కొనిన నేమిలాభము కలుగును ? ఏను దొల్త రసాతలమునకేగి బలిగర్వ మణచి భోగులఁ బారదోలివచ్చెద. నాపయనమున కానతియొసఁగెదవే?" యనిన నా దేవముని మగుడనాతనిజూచియానందముతో నిట్లనియె. "గాక్షసేశ్వరా నీవు రసాతల యాత్రారంభంబు మాన్పఁ గోరెదవేని మును సంయమినీ నగరమ్మునకుఁ బొమ్ము. యముఁడును నీరాక కుమ్మలికఁజెంది నిను మార్కొనిన నాతనితోఁ గయ్యంబుసేసి యాతనిజయించి యశంబుసంపాదింపుము." ఇట్లు మునీంద్రుఁడు బోధింప నాతఁ డుప్పొంగి "ఏనుమున్ను దిక్పతుల సమరంబున జయింపఁ బ్రతిన యొనర్చినాఁడ. నన్ను దీవించి మీరిప్పుడు పంపుటచే నవశ్య మాతని కదనమున నోర్తు పనివినియెదన"ని నారదునకుఁ బ్రమొక్కి యాతనివీడ్కొని తనబలంబుతోడ జముని గెల్వనేఁగె. అంత నారదుఁడు తనమనమున నిట్లనితలంచె. "రావణుఁడు త్రిలోకకంటకుఁడు. యముఁడును లోకాంతకుఁడు. వీరిద్దరు బోరుచుండఁ గనులపండువుగాఁ గనుగొనియెద. రావణుఁడును అంతకునకుఁ దానె యంతకుఁడై, భయ రహితుఁడై, సంయమినీ నగరమునకుఁ బోయెను. ఇయ్యది మనుజసంతానమునకు హితమయ్యె. ఏను వేల్పులహితంబును

గోరవలయు. ఆలస్యంబుసేయక యిప్పుడయమపురికిఁజనియీ వృత్తాంతమంతయు శమనున కెఱిఁగించివచ్చెద." అంచు సంయమినీ నగరంబు సొచ్చి విచిత్రరత్న శోభితంబగు సభాభవనంబునఁ గొలువున్న జమునిఁ జేరఁబోవగ నచ్చోట నొకవంక కణ్వమార్కండేయాదులు స్మృతి వివాదంబు సలుపుచుండఁ దాము తెచ్చిన ప్రాణికోట్ల ముందటనుంచి కింకరులు హెచ్చరించుచుండఁ బ్రజల పుణ్యపాపములు గవిలెలోనున్నట్లు చిత్రగుప్తుఁడు దెలుపుచుండఁ గాలదండ మృత్యుసహితుఁడై ధర్మాసనమునన్న శమనుఁడు సకలలోకవంద్యుఁడగు నారద మునీంద్రునకు నమస్కరించి యర్ఘ్యపాద్యాదు లొసఁగి యున్నతాసన మొసఁగి పూజలుసేసి కుశలమడిగి "మునినాథా! మీరాకకుఁ గతమేమ"న నతఁడు "శూరాగ్రేసరుఁడవగునీపై ఖలుఁడగు దశవదనుఁడు దండెత్తివచ్చుచున్నవాఁడు. మేషంబు నగంబు దాకి కుందునట్లు నీచే వాఁడు భంగపడును. నీవును రణసన్నాహంబున నుండు" మనిన సూర్యతనూజుఁడు నగి "మంచిది. రావణుఁడు మా పురమునకు వచ్చినంజాలు. కాలుని కాలదండ మెఱుంగను కాబోలు! ఆతఁడు మృత్యుఁడగుటకుఁ గాలమాసన్నమయ్యె. కాదేని యిట్లేలతలంచును? ఇప్పుడు గర్వోక్తులతోడఁ బనియేమి? అంతయు నీ మునులు గాంచెదరు." అనుచు ధీరుఁడై యుండెను.

రావణుఁడు రాక్షసవీరులు దన్నుఁ గొలువ శమను పుర గోపురములఁజూచి వేడుకతోడఁ బుష్పకవిమానంబు డిగి యచ్చోట నిరయమునఁబడి యమభటకోటిచే బాధింపం

బడుచు వేదనలఁబొందు ప్రేతలఁ గాంచెను. అం దుక్కు కోఱలుగల కుక్కలు మర్మములఁ గలఁచుచుండ మొఱ పెట్టుచుఁ బోనీక పొడవి నిప్పుల యేటఁగూల్చిన నందుఁబొర లుచు రక్తకూపములందుండి యందలిపురుగులగంబులందోల్వఁ బొగులుచుఁ గాయములఁగోసి యుప్పునీట నలంప నేడ్చుచు, బాగుగఁగాలిన పెనములఁబడఁద్రోయ మిట్టిపడి మూర్ఛిల్లుచుఁ, దప్తతైల భాండములఁ బడఁద్రోయ శోకతప్తులగుచు నున్న పాపాత్ముల నాతఁడు గనుఁగొనియె. మఱియుఁ బక్షపాతు లును, కూటసాక్షులును, నస్తృతంబులాడువారును రౌరవము నందు బాధింపఁబడుటయు, కులఘ్నులును, భ్రూణహంతకు లును, గోహంతకులును శ్వాసనిరోధకమను నరకమునఁగుంది యాయాసపడుటయు, పంచమహాపాతకులు సూకరనరకమునఁ బడి నుగ్గుటయు, నృపహంతకులు తప్తకుంభీకఁబడి తలఁ కుటయును, గూఁతును, గోడలినిబట్టిన దుష్టులు మహాగ్ని జ్వాలల నోఱఁగి తాపమునొందుటయును, బరస్త్రీలఁ గవయు దురాత్ములు యాతనలఁబొందుటయు నతఁడుచూచెను. మఱియుఁ గూలికి వేదంబు సెప్పువారును, వేదనిందకులును, విమోహా మనెడు పాతకమునఁబడుటయు వృద్ధుల నతిథుల నారయకయె యన్నంబు భక్షించువారు క్రిమిభక్షులగుటయుఁ గ్రతువుసేయ నెంచి యాసతోడ దుష్టులయాచించి ధనమార్జించినవా రధో ముఖులగుటయు, పరస్త్రీగామియు, గృహదాహియు వైతరణిఁ గూలుటయు, వనవిధ్వంసకులగు దురాత్ము లసిపత్రవనమున నుండుటయు నాతఁడుగాంచెను.

వేఱొకచోటఁ గొందఱు రత్నభూషణములఁదాల్చి దివ్యయానంబు లెక్కి తిరుగుటయుఁ గొందఱు మందారమాలి కలఁజుట్టి తెలిగొడుగుల నీడ వెలయుటయు, మఱికొందఱు మృగమదమిశ్రగంధమిళితాంగులై వీణాదినాదముల వినుచు నచ్చరలు గొలువ మహావైభవమున నుండుటయును జూచి దశవదనుఁడు తలయూచి "ఓహో! యముఁడు కొందఱి కధిక కష్టములును గొందఱి కధిక సుఖమ్ములును గలిగించి పక్షపాతియయ్యెను. సుకృతదుష్కృతములొనర్పఁ బురుషుఁడు కర్తయగునా? ఒకరు సేయుమన్న నేగదా సేయును? స్వాతంత్ర్య విరహితుల ఖలులగు నీయమకింకరులు వృథాపరిభవించు చున్నారు." అనుచు నయ్యమభటుల నదల్చి గాఢమగు కృపతోడనాప్రేతల విడిపించెను. దయయన నెట్టిదో యెఱుఁగ గని రావణుఁడే యా నిరయమున నున్నవారిఁ జాలిగొని విడిపించె! వారి దురవస్థ యెట్టిదో గదా?

ఇట్లు రావణుఁడు నరకవాసులనెల్ల విడిపించిన వారును హాయిఁజెంది యాతని ననేకవిధముల స్తుతించిరి. శమన కింకరులును నీరసమున నానావిధాయుధములఁబూని రావణు నొక్కపెట్టునఁ జుట్టుముట్టికొని మార్గ నిరోధంబు గావించిన రాక్షసేంద్రుని మంత్రు లాయమభటుల శస్త్రప్రహతుల నొప్పించిరి. వారును సక్రోధాత్ములై శూలములంగొని ప్రతిపక్షులవక్షంబు భేదించి యార్చిన నీలాచలనిర్ఝరంబులో యనునట్లు రక్తప్రవాహమ్ములు ప్రవహింపఁ దొడఁగెను. రక్తసిక్తాంగు లయ్యును రక్కసులు వెనుదీయక యామ్యభటులనెదిర్చి యుత్సాహమున

రణ మొనర్చుచుండిరి. ఇట్లుభయ బలములును సమముగఁ బోరు నెడ జముభృత్యులు మేఘంబులు సలిల ధారలచేఁ గాటుక కొండఁ గప్పు విధమున రావణు గాత్రంబు శర ధారలఁ గప్పిన నాతఁడును వికసిత కింశుకంబుఁ బోలి నెత్తుటఁ దడిసిన దేహముతో ధైర్యమును విడువక యుద్ధము సేయుచు నంతకభటుల భంగపెట్టఁదలఁచి కులపర్వతములు చలింప, సప్తసాగరంబులు కలఁగఁ బాశుపతాస్త్రంబు వింట సంధించి ప్రయోగించెను. అదియు మహా గహనంబు దహించు దావా గ్నిఁబోలి యొక్క నిమిషమున నా సూర్యపుత్రకింకరుల లోకము లాశ్చర్య మొందగ జయించి మించె. ఇట్లు శమన కింకరుల నాశంబుగావించి భయంకరమగు నాశరం బుపసంహ రించి త్రిపురముల దహించిన శివుని చందమున నాతఁడట్టహాస మొనరించుచుండెను.

ఇదంతయును గనుఁగొనుచున్న హతశేషులగు కింక రులు కృతాంతుఁ గనుఁగొని "దేవా! పరాక్రమశాలియగు వింశతి భుజుఁడు నేడు మన నగరంబు సొచ్చి పాతకుల నెల్ల విముక్తులఁ జేసి తన్నెదిర్చిన కింకరులఁ బాశుపతంబున ద్రుంచి నాఁ డనఁ గ్రోధంబునఁ గిటకిట రదనంబులఁగీటుకొనుచునతనిఁ దెగటార్పఁదలఁచి సారథిఁ గనుఁగొని "అరదంబు సిద్ధంబు జేసి వేగమె తెమ్ము. మనభటులఁ దెగటార్చిన యాదుష్టుని వధింప వలయును" అని యముఁడు పలికెను.

—♦ యమ రావణుల యుద్ధము ♦—

అంత నాసారథియును లత్తుకచాయలవారువములఁగట్టి, మహిషకేతనంబెత్తి తేరుగొనిరా నంతసమున నెక్కి కాల దండమును బాశంబును గాలమృత్యువును నగ్నిమయంబగు ముద్గరంబును మూర్తులధరించి యరదంబున వెలుఁగ నంతకుఁడు దశముఖునిమీఁది కేతెంచెను. అత్తఱి ప్రళయార్కబింబము వలె వెలుగు నరదంబుఁ జూచియు లయకాలాగ్ని జ్వాలలఁ బూనుకాలదండంబును గాలపాశ ముద్గర కాలమృత్యువులను నంతకుని యాకారంబును జూచియు నసురులు బెదరి చెదరి పదములు తడబడ నలుగడలకుఁ బఱవఁదొడఁగిరి.

ఇవ్విధమున శమనుఁడు నిమిషములో రావణుఁజేరవచ్చి గదాప్రముఖాయుధంబుల నొక్కమొగి నిగిడ్చి యార్చిన రావణుఁడును నిశితాస్త్రకోటుల నాతని ముంచె. రావణు నస్త్రాంధ తమిస్రంబు నర్కజుఁడు మధ్యందిన మార్తాండు చందమునఁ బాయఁ ద్రోచి సహస్ర బాణముల నాపౌలస్త్యు నొప్పించిన దైతేయస్వామియు వెనుదీయక గర్వంబున శమనుఁ జూచుచు బాహాస్ఫాలనంబుచేసి సప్తాహోరాత్రంబు లొక్క తీరున భయంకరముగ నాహవ మొనరించెను. తనతోడ సమానంబుగ నిట్లు పోరు నారావణు శౌర్యము సహింపఁ జాలక యంతకుఁ డొక్క వింటనె సంధించి దశసహస్రశిత శరంబులు రావణుపై నిగిడింప నవి యాతని మేనంతయుఁ గంతలు గావించిన నాతఁడు మూర్ఛిల్లి తేరిపైఁ బడియె.

అట్లుమూర్ఛిల్లి కొంతవడికి సేదదేరి ప్రళయకాల రుద్రు నివలె వెలుఁగుచు నయ్యమరవిరోధి యంతకుఁజూచి "శమ నుఁడవు కావున నానిశితశరీరముల శమియింపుము" నుచునాతని సూతుని, హయంబులను వరుసగ నాలుగుబాణంబులను, నేతు బాణములను నేఁపుమాసి యాతనిమేన ననేక శరంబుల నాటి యార్చె. జముఁడును దామ్రమాత్సుఁడై వేడిచూపులఁ జూచుచుఁ జూచుచు దనుజబలంబుపై నడరి నాశంబుగావించుచుండ నంత కుము న్నె సంగర క్రమమును జూచు వేడుకతో నచ్చోటికివచ్చి యున్న రుదేంద్రాదులు సూర్యతనూజు రోషసామర్థ్యము నుతియించి రాక్షసేంద్రుని పరాక్రమమును బ్రశంసించిరి.

అయ్యెడ మృత్యు వర్కజుని జూచి యీ సురవైరి యేడునాళ్ళనుండియు నీతో సమరంబును గావించుటను జూడ నాకును సిగ్గుచున్నయది. పెక్కుమాటలేల ? ఆలస్యము సేయక ననుబంపితివేని యిప్పుడ వానిఁబట్టి నుగ్గుగావించి సురాసురులకింపును దుఃఖమును గావించెద. ననుఁదప్పించు కొన విధాతకైన నలవియగునా? వృత్రాదిదానవ వీరులు నా చేతనేగదా మ్రగ్గిరి?" అనిపలుక యముఁడును సైరింపుమనుచు నాత్మలో నేనిపుడు మిత్తిఁ బంపితినేని యొంతయు లాభంబు గలుగదు, నాముద్గరంబును, పాశంబును, శత్రువధంబు గావింపఁజాలవు. కావున నిప్పుడు కాలదండమును బ్రయో గించుటయే యుచితంబ"నియెంచిదైత్యునిమీఁద వేయఁబూనె. అంతఁ గమలాసనుఁ డడ్డమువచ్చి "నిలునిలుము. కాలదండ మును బ్రయోగింపకుము. తపంబుచే నను మెప్పించి యీ

దనుజుఁడు సురాసురుల కజేయుఁడై ప్రవర్తిల్ల వరమువడసి యున్నవాఁడు. నీచేనిపుడు మడసెనేని నావచనంబు దప్పును. నీదుకాలదండమును అమోఘముగునట్లు నేన యొనరించితిని. అట్లగుటచే దశాస్యుఁడు సచ్చినను బ్రతికినను నా వచనము బొంకగును గాన నట్లు గాకుండఁ జేయుము" నియె. కాలుఁడును బితామహు వాక్యంబుల నాదరించి "దేవా! జగదాధారుఁడవగు నీ యానతి శిరసావహించి యీ దను జేంద్రు ప్రాణములఁ గాపాడితి. బలపరాక్రమములుగలవాఁడ వైయుండియు నిపుడశక్తునిమాడ్కి సమరవిముఖత్వము నొంది వీటికిఁ బోవుచున్నాఁడ"ననుచు రథంబుతో నదృశ్యుఁ డయ్యెను. పద్మభవుఁడును సురసంఘంబుతోడఁ దన నెలవునకుఁ జనియె. సంగరమును బ్రశంసించుచు దేవముని యును జనె.

లంకాధిపుఁడును విరోధి యోడెననుచు సంతసించి రసాతలజయేచ్ఛాయత్తచిత్తుతోడఁ జనిచని లవణసముద్రము గని దానిలోతు పరీక్షించుటకో యనునట్లు తద్గర్భముంజొచ్చి భోగవతీపురంబుఁ జేరి తత్ప్రభుండగువాసుకిపై కేఁగె. అతఁడునుఁ బంధుమిత్రాదులతోడ రావణు నెదుర్కొని గజతురగాదులఁ గానుకలిచ్చి మాపైవైరము వలదని ప్రార్థించిన నద్దేవారియు వారి వీడుకొని సేనాసమేతుఁడై పశ్చిమదిశా నాయకుఁడగు వరుణుని జయింప నాతనిపురి కేఁగి వరుణసుతులతోడఁ గయ్యంబుసేసి వారల జయించె.

**—( రావణుఁడు బలిచక్రవర్తిని జయింప సుతలంబున కేగుట )—**

ఈరీతి రావణుఁడు జయముఁగైకొని వరుణాలయంబు వెలువడి దైత్యులు దన్ను సేవించుచుండ విభవోన్నతిచే నమరావతిని మించిన సుతలంబు సొచ్చి దానియందమునకు మెచ్చి యచ్చోట మౌక్తికమయవితానంబులచేతను, ఆకసము నంటిన సౌధయూథములచేతను, శశికాంత సోపానపంక్తుల చేతను, నొప్పు నొక్క దివ్యపురమ్ముఁ గాంచి యచ్చటి బహు కల్పనల కచ్చెరువంది పురబాహ్యమున విడిసి "ఈ నివాస మెవ్వరిదో యారసిరమ్మ"ని తన సేనాని నంపెను. అతఁడును మహాప్రసాదమనుచు మొదటివాకిలిసొచ్చి యందెవ్వరిఁగానక మఱొక వాకిటి కేఁగి యదియు జనరహితముగ నుండుట గనుఁగొని సత్వరముగ మఱికొన్ని ద్వారములు దాటిన నేడవ వాకిట నీల మేఘచ్ఛాయ బోలు దేహముతోడను అరవింద ముల మించు నేత్రములతోడను, ఆజానులంబోన్నత బాహు ద్వయముతోడను, మొలనున్న పీతాంబరముతోడను, దుర్ని రీక్ష్యప్రభావుఁడగు నొక్క దివ్యపురుషుఁడు వానికిఁగాన్పించెను. రాక్షసరాజ మంత్రియును నాతనిఁ జేరఁజని, యతఁ డట్ట హాసంబు గావింపఁ గాసిఁజెంది వెఱచి పఱువెత్తి దశాస్యు డా సిన నాతఁడు "ప్రహస్తా! నీ భయకారణమ్ము వేగమ నాకుఁ దెలుపు" మన నాతఁ డక్కడిచోద్యంబు నంతయుఁ జెప్పెను. అంత రావణుఁడు "ఆహా! యేమిచిత్రంబు! ఆ మహాపురు షుని నేను కన్నులారఁ గాంచెద" నంచు విమానంబు డిగ్గి ద్వారషట్కంబు నతివేగమున నతిక్రమించి సప్తమ

ద్వారంబు సేర మంత్రి సెప్పిన మహాపురుషుఁ డచ్చోట
దంష్ట్రాకరాళ వక్త్రంబుతోడను, నిప్పుకలు గురియు కన్నుల
తోడను నుక్కుగదఁ బూని నిలిచియుండఁగనుఁగొని, యాతని
చెంత నిలువ వెఱచి దూరమున వెఱగుపడి చూచుచుండఁ
నద్దనుజేంద్రుతోడ మేఘగంభీర భాషణముల నమ్మహాపురుషుఁ
డిట్లనియె.

“రాక్షసాధిపా! ఇదేమి ? సంగరము సేయఁగోరి యిట్లే
తెంచి భయకంపిత గాత్రుఁడవై యుండెదవేల? ధీరులు
ధైర్యంబు విడుతురే? బలీంద్రునితోడఁ గయ్యము సేయఁగోరి
వచ్చితివా? లేక నాతోడ మార్కొనియెదవా? సమరకాంక్షిత
శూరుఁదెల్పుము.” నాపుడు దశవదనుఁడుమనంబుఁబదిలపఱచు
కొని భయరహితుఁడై “బలితోఁ గయ్యంబుసేయ నే తెంచితి”
నన నప్పరమ పురుషుఁడు పకపక నగి “శూరుఁడు నుదారుఁడు,
దుష్టజనసమవర్తియు నగు బలిచక్రవర్తితోడ గయ్యంబుసేయ
నీకలవియగునా ? అయినను గోరిక కలదేని యాతనిపైఁ
బొమ్మ”నియె.

ఇటు నుడివిన, దశవదనుండు వినయాదికగుణసాంద్రుఁ
డగు బలిదైత్యేంద్రుఁ బొడఁగని యట్టహాసంబొనర్చి భుజా
స్ఫాలనంబు గావించి నిలిచిన, బలియు దశకంఠుఁ బొడఁగని
“పౌలస్త్యా! ఇటురమ్మ”నుచుఁ జేరఁదీసి తొడపై నిడికొని
సాదరమ్ముగ “నీకును నీ బంధుమిత్రులకును సేమంబె? నీవేమి
కోరి యిట్లేతెంచితివి ? నీయభీష్టంబు నెరవేర్తు వినిపింపు”మన
నతఁడును నుత్సంగంబున నుండి యక్కడిమాటల మఱుఁగు

వెట్టుచు "విష్ణువు నిన్నుఁ గట్టెనని యందఱు చెల్ప విని యాతని నెదిర్చి భువనైకవదాన్యుఁడవును, హతాన్యసైన్యుఁడవు నగు నిన్ను బంధముక్తునిఁ జేయవచ్చినాఁడ. ఆహరి యిప్పు డేడనుండు?" నన నతఁడు మందహాసంబు గావించి యల్లన నిట్లనె. "ఏడవవాకిట నీవిప్పుడుగని మాటాడిన పురుషుఁడే విష్ణుఁడు. ఆతఁడొకచోటనుండి యంతటఁ దోఁచుచుండును. తొల్లి నారాయణుఁ డెచ్చోటనుండునని మా ముత్తాతయగు హిరణ్యకశిపుఁడు తనపుత్త్రుఁడగు ప్రహ్లాదుని హింసింపనాతఁడు విష్ణువంతటఁ బూర్ణుఁడై యుండునన, నాతీరునని నృసింహాకృతి నుద్భవించి విమతుని మర్దించెనని నీవు వినియుండ లేదా? ఆ హరిచేతనే కదా శుకుఁడు, వృతుఁడు, సంహ్లాదుఁడు, దనువు మొదలగు రక్కసులు గూలిరి. మనవంటి దైత్యులెంద ఱతని నెదిరించినను మరణమునకే యని తలంపుము. నన్ను నారాయణుఁడు బంధించినాఁడంచు నీ వెంచెదవు గాని యాతఁడు జనుల నందఱి సంసార మోహపాశమునఁ గట్టివైచుటఁ దెలియవైతివి. అమ్మహాత్ముఁ డొకప్పుడు జగముల సృజియించును. ఒకప్పు డూరకయుండును. ఒక్కవేళ నామరూపముల తోడ నటియించును. ఒకతఱి దుష్టరాక్షస నాశనము గావించును. మఱొకప్పుడు సమబుద్ధినూరకుండును. ఎటులదోఁచిన, నటులనే యొనరించును. కాఁబట్టి యమ్మహాత్ముఁడు గట్టిన కట్టుల వదలింప నీకును నాకును నలవియగునా?"

అనియివ్విధమున బలిచక్రవర్తి పలుక దశాననుఁడు "ఆహా! ఇదేమివింత? కాలదండమును గైకొని భయంకర మృత్యువుక్తుఁ

డై చనుదెంచు యమునంతవానిసంగరమునవోర్చి కైలాసముగల్చి
యతిశయించునన్ను మార్కొని విష్ణుఁడెట్లు జయింపఁగలఁడు?
అతనిగుణంబులింకను దెలుపు" మన నా బలియు నాతనితో
"విష్ణుఁ డనాదిమధ్యలయుఁడు. వేదాంత వేత్తలకయినను గానఁ
బడఁడు. తన్నునమ్మినవారి యఘంబులఁ గడతేర్చి వాంఛిత
ములనొడఁగూర్చును. బంధమోక్షముల కాతఁడె కర్త" యని
పలికిన వైరోచనుని మాటల ననాదరణముసేసి మున్ను సూచిన
దౌవారికుఁగానక హరి యోడిపోయెననుచు గర్వమున నట్టహా
సముచేయుచు నచ్చోటనిల్వక పర్వతగుహాంతరము వెలువడి
వచ్చు కేసరివిధాన వాకిళ్ళన్నియుఁ గడచి దైత్యేంద్రుఁడు
పుష్పకంబెక్కి "నాశౌర్యమునకు విష్ణుఁడు వెఱచె. బలిజయిం
చితి" నని సంతసమొందుచు మంత్రులతోడఁగూడి యుత్తర
దిశాభిముఖుఁడై హిమవద్గంధమాదన కైలాసాది పర్వతము
లాక్రమించి మేరుగిరిఁ జేరెను.

దైత్యవల్లభుఁడును నచ్చోటఁ గొంతతడవు సంచరించి
యాకనక శైలాగ్రి శిఖరముల సిద్ధసాధ్యగంధర్వ నగరములఁ
జూచి, తన్నగరవాసుల సమరక్రీడకుఁ బిల్వవారును వెఱచితి
మన్నమన్నించి, భీతియొక్కింతయు లేక లక్షయోజనముల దూర
మునను న్న సూర్యలోకమునకుఁ బోయి యా ప్రభాకరు
యుద్ధమునకుఁ బిల్వ నాదిననాథుఁడు తనలో తా నిట్లని వితర్కించె. "ఏను ప్రతివాసరంబును మందేహాసురులతోడఁ
బోరుచున్నాఁడఁగదా! నాకాకయ్యంబె చాలును. ఈ దశా
స్యుతోఁ బోరనేల? ఇప్పుడు నేను నోడితినన్నను దప్పుకాదు."

అని మోఁచి యాదశాస్యుతో 'నీవు నన్ను జయించితి' వనియె. అంత నా రాక్షసేంద్రుఁడు మదాతిరేకంబునఁ జంద్రలోకమున కేఁగి యాతుహీనకిరణు జయించెదనంచుఁ బోవఁబోవఁ జలిచే వడంకుచు మంత్రులు "అయ్యా! మేమిచట నిలువఁజాలము. మే మిచటినుండి చనుటకు సెలవిండ"నిన నాతఁడు కట్టలుక తోడ వారలఁ జూచి "ఆహా! ఏమియింత ? ఈ మూర్ఖుఁడు మాగాత్రంబులువడఁకఁ జేయంజాలెనా?" యనుచు నాగ్నేయాస్త్రరౌద్రాస్త్రంబులఁ జంద్రుమీఁద నేయ ప్రయత్నింప నచ్చటికిఁ గమలాసనుఁ డేతెంచి "వత్స! ఇదేమి? ఈతఁడు చల్లనిదొర. ఈ యగ్ని బాణముల విడువవలదని" నివారించెను. ఇట్లు వారించి యావిరించి చనిన నాదితిజుండు శశి జయించితినంచు నచ్చోటఁ జాటింపఁబంచి యిఁక లంకానగరంబు సేరెదనంచు బయనమై మణిమయ పుష్పక విమాన దీప్తులు దిశలు నిండ శుకసారణు లిరువురును ననేకవిధములఁ దన్ను బ్రస్తుతించుచుండ భటసహితుఁడై పోవుచు మార్గమధ్యమున పాపశంక యాత్మఁ జొరనీక యక్షగరుడగంధర్వాది కన్యల బలిమిని జెఱఁబట్టిన వారలు రావణు నుద్దేశించి యిట్లని శపించిరి. "మేము పాతివ్రత్యము వహించిన వారలమైతిమేని, యింతదనుక నే కొరంతయు లేక చరియించితిమేని కామాంధుఁడై మా మనములఁ జెఱుపఁగా బనిఁబూనిన యీదశాననుండు సుతానుజబంధుకోటితోడఁ గామిని కారణమున నే యడఁగుగాక." అని యిట్లు తన్ను శపింప నెగ్గుసిగ్గు లెంచక తేజోవిహీనుఁడై యతఁడు తన నగరంబు సేరెను.

—♦ ఇంద్రాదిదేవతలు విష్ణుని భూమిపై నవతరింపఁ బ్రార్థించుట ♦—

రావణుఁడిట్లు లోకములకు నొనర్చు బాధలకుఁ దాళఁ జాలక యింద్రాది దేవతలు సత్యలోకమున కేఁగి యజుని గాంచి "విధాతా! రావణుఁడనువాఁడు నీయనుగ్రహమ్మున గర్వించి యఖిల జనములకుఁ గీడు గావించుచున్నాఁడు. అతఁ డొనర్చు హింసా కర్మలకు మేము వేసఱితిమి. వానిఁ జేర్కొన్న సాగరంబులు తరంగములతో మ్రోయవెరచును. దినకరు డెండం గాయ శంకించును. వానిఁ బొడఁగన్న వాయువులు వడిగ వీవ భయముఁ జెందును. గిరులును వడవడ వడంకును. నీ వరకారణమున నాతనిచేముల్లోకంబులు ప్రళయ మొందును. కావున వాని మారణోపాయంబు నీవు వేవేగఁ జింతింపుము" యనేకవిధముల వేడుకొనిరి. అనవుడు నావిరించి యనిమిషులఁజూచి "వాఁడు మదీయవరసామర్థ్యంబున సుర యక్ష రాక్షస కిన్నర సిద్ధసాధ్య చారణ విద్యాధర గంధ ర్వాదులచే మరణము నొందఁడు. అయినను వాఁ డవమతియై మానవులచే మరణము నొందకుండ వరము వేఁడ మఱచెను. కాన నాతఁడు సంగరమున మానవునిచే మరణము నొందును. తొల్లి నారాయణుఁడు నృసింహాకృతిఁ బూని, లోకకంటకుఁ డగు హిరణ్యకశిపుఁ ద్రుంచి సురలఁ గాపాడె. ఆ దైత్యేం ద్రుఁడే ఇప్పుడు పులస్త్యునకుఁ బుత్రుండై రావణుఁడను నామమున నీ ధారుణి జన్మించెను. ఆవిష్ణుఁడె నరుఁడై భూలోకమున జనియించి సంగర రంగమున దశకంఠుఁ బరి మార్చి యఖిలగీర్వాణులఁ బాలించును. మన మిప్పుడె యా

జనార్దను శరణ్ముసొత్తు''మని పలికిన సంతలోఁ గమలాక్షుఁడు గరుడ వాహనారూఢుఁడై విపక్షకుల శిక్షా దక్షమగు సుదర్శనాయుధంబు చేఁబూని బ్రహ్మాదులకుఁ బ్రత్యక్షమయ్యెను. అంత గీర్వాణులు హరికి మ్రొక్కి యనేకవిధముల నాతని సన్నుతించి "రావణుచేఁ దనుకయ్యెడు బాధనెల్ల నిల్లు జెప్పఁ దొడఁగిరి. లోకేశా! రావణుఁడను రాక్షసేంద్రుఁడు కమలాసనుచే వరములనొంది ప్రబలుఁడై నందనోద్యానవనమ్మున విహరించు నచ్చరలఁ దుఃఖించియు, మునుల విదారించియు, నమరుల నిర్జించియు, యక్షులఁ బారఁదోలియు, నెంతయు బాధించుచున్నాఁడు. వాని దాడి కోడి మేమిచ్చటి కేతెంచితిమి. మాకు నీవె దిక్కు. నిన్ను శరణు సొచ్చితిమి. మాకభయదాన మొసఁగి వేగ నాదనుజ వధింపుము. అతఁడు నరులచే దక్క నొరులచేఁ జావఁడు. భూలోకమున నీవయోధ్యాపతియగు దశరథ భూవరునకుఁ బుత్త్రుఁడవై దేవ హితార్థంబుగ జనియింపవలయును.'' అన విని పుండరీకాక్షుఁడు "మీర లింక భయమును జెందక నెమ్మదిగ నుండుఁడు. ఏను మనుజుఁడనై సురవైరియగు రావణుఁ బుత్త్రమిత్త్ర బాంధవ సహితముగ వధించి యశమ్మొగకొని యేకాదశ సహస్ర వర్షము లుర్విఁ బాలించెదనని పలికిలక్ష్మితోడంగూడి నిజలోకంబున కేఁగెను.

—♦ దశరథుని యశ్వమేధయాగ ప్రయత్నము ♦—

సరయూనదీతీరమున భూమికిఁదొడవై యఖిలసంపదలు గలిగి కోసలదేశం బలరారుచుండును. ఆదేశమున మూఁడు

యోజనముల విస్తీర్ణమును బన్నెండు యోజనముల నిడుపును గల యయోధ్యానగరము మనువుచేఁ నిర్మింపఁబడెను.అయ్యది రాజవర్ధనులగు మంత్రులతోడను, ధీమంతులు శక్తిమంతులు నగు సామంతులతోడను, స్వకర్మనిరతులును దురితహరులు నగు భూసురులతోడను, భూతలమంతయుఁ బంకిలముగ దాన ధారలఁ బెల్లుగాఁగురియు జలధరోపమానంబులగు నేనుఁగుల తోడను రూపబలముల రూఢికెక్కి యూహావజయశీలములగు హయములతోడను నొప్పుచుండును. ప్రభాకర తేజులగు నప్పురి రాజసుతులు బాహుబలంబులచే శత్రువులజయించి ధనము సంపాదించి యైశ్వర్యవంతులై యుందురు. దిగ్గజములకుంభ ములు వ్రక్కలుసేయు సామర్థ్యంబుగలిగి జమునైన జయింప గల వీరభటులెందఱో యా నగరమునఁ గలరు.ఆనగరమ్మున సూర్యకులదీపకుండును, ద్విజరక్షాదక్షుఁడును, రూపవిజిత మారుండునగు దశరథావనీశుఁ డేలుచుండును.

ఆభూవరుఁడు బంధుమిత్ర కళత్రాదులతోడ సకలసంప న్నుఁడయియుండియు వంశవర్ధనులగు తనయులు లేకుండుటఁదల పోసి సుతులు లేనివారికి గతులు లేవుగాన, "నేను సంతాన ప్రాప్తికై హయమేధంబుఁ జేసెద"నని నిశ్చయించి ప్రధానమం త్రియగు సుమంత్రునిఁ గనుఁ గొని "నీవు వేగమచనిమనపురోహి తులగు వసిష్ఠాది మహామునుల సత్వరమునఁ గొనిరమ్ము" నిన నాసుమంత్రుఁడును నామునులఁ దోడ్కొనివచ్చెను.

దశరథుఁడునువారల సముచితాసనములనునిచి పూజించి వినయమున మ్రొక్కి "నాకు సుతులు లేకుండుటచే నెంతయు

వసరి యశ్వమేధంబు సేయఁగోరి నాకులహితముగోరుమిమ్ములను
నిందు రావించితి. నాదు జన్మంబు సమ్మోదముతోడఁ జేయిం
పుఁడ'న్న నామునీంద్రులెంతయు నలరి" ఆలస్యముసేయనేల ?
ఇఁక నధ్వరోద్యమమును వేగఁ గావింపుము.'' అనిన దశరథుఁ
డును బరమానందమునొంది మంత్రిలఁగాంచి " సరయూనది
యుత్తరతీరమున యజ్ఞవాటమునొనర్పుఁడు. సంభారములసిద్ధ
పఱుపుడు. శాంతులు గావింపుఁడు. బ్రహ్మరాక్షసులచే
యజ్ఞమునకు విఘ్నముగలిగిన యజ్ఞకర్త చెడిపోవును. కాన
విధ్యుక్తముగాఁ గ్రతువుచేయవలయు. యజ్ఞాశ్వమును విడిచి
యేమరకయుండుఁడు. అశ్వమేధముగావించి పుత్త్రులఁగాంచఁ
గోరినాఁడ" నని వచించి యమ్మంత్రుల వీడుకొల్పి యంతః
పురమున కేఁగి యటప్రియపత్నులఁజూచి 'సుదతులారా! ఏను
పుత్త్రులఁ బడయఁగోరి యధ్వరము సేయఁదలఁచితి. మీరును
దీక్షఁగైకొనుఁడు. అటులయిన శుభంబుసేకుఱు'' నన వారును
ముఖాంబుజములు వికసింప సంతసమందిరి.

## —♦ ఋశ్య శృంగుని చరిత్రి ♦—

ఇట్లుండ నొకనాఁడు సూతుఁడు దశరథ భూవిభునిఁ
గాంచి «రాజా! రహస్య మొక్కటి చెప్పెదవినుము. ఋశ్య
శృంగుఁడను ముని యొకఁడు గలఁడు. నీ వాతని ప్రార్థించి
తెచ్చిపుత్త్రికామేష్టి యొనర్చితివేని కులపావనులగు పుత్త్రులు
పలువురు గలగెదరని సనత్కుమారుఁడగు మునీంద్రుఁడు
మునుల సభను జెప్పెనని వింటి"నన సూతునిగాంచి దశ

రథుఁడు "ఆమహాత్ముని వృత్తాంతము సాంతముగఁ దెలుపు'' మనె. నావుడు సూతుఁడిట్లు సెప్పదొడఁగె.

"రాజా! రోమపాదుని దేశమున నొకతఱి నఖిలప్రాణి భయావహమగు ననావృష్టిదోషంబు సంభవించెను. అందుకై యాభూనాథుఁడు వనటఁజెంది మంత్రిపురోహిత వర్గముఁజూచి 'యవగ్రహనిగ్రహంబునకు దగినశాంతి సేయుఁడ'నియె. వారును నాతనిఁజూచి 'అనఘాత్ముఁడగు కశ్యపుఁడనుమునికి విభాండకుండను తనయుఁడు గలఁడు. ఆతనికిఁ బావనమూర్తి యగు ఋష్యశృంగుఁడను పుత్త్రుఁడు బ్రహ్మచారి యొకఁడు గలఁడు. అతఁ డిది తరుణియనియు నితఁడు పురుషుఁడనియు నిది పురంబనియు నిది గ్రామంబనియు నెఱుఁగక నిర్జనంబగు వనమునఁ దపోనియతిని జరియించుచుండును. భూవల్లభా! ఆ మహాత్ముని నిచ్చటికి రావించి నీతనయ శాంతను నాతని కిచ్చి వివాహంబొనర్చితి వేని వానలు గురిసి భూమి సమృద్ధి గాంచు' ననినవిని యామునివరుఁ దోడ్కొని రండనియె.

అనవుడు వారలు 'స్థిరమతియగు ఋశ్యశృంగు నవ్విటికిఁ దెచ్చుటకు మేము సమర్థులముకాము. అత్తపోధనుల కడకు వారవిలాసినులఁ బంపితివేని వా రాతని నాటలఁ బాటల మెప్పించి యిచ్చటికిఁ గొనివచ్చెదరు.' అనిన రోమపాదుఁడు ఆటలఁ బాటల నాఱితేఱిన వారాంగనలఁ గొందఱి రావించి ఋశ్యశృంగుఁ గొనిరండనిన వార లాముని యాశ్రమమున కేఁగి మధురమంజులారావంబుల మనంబు లలర రాగ

ములు వాడుచు నాతని చెంత నిలిచిరి. ఋశ్యశృంగుఁడును వారల చిత్రరూపముల నచ్చెరువంది చూచుచుఁ గర్ణంబులు నేరిచి గానముల వినుచుండ నతరుణులు "ఓమునిపుత్రా! ఒంటిగ నీవనములనేలఁ జరించెదు" అన నాతఁడు "మజ్జనకుని విభండకుఁడందురు. ఏను, ఋశ్యశృంగుండను వాఁడ. వింతము నలగు మీరు మాతపోవనమునకు వచ్చితిరి. మిమ్ముఁ బూజించి ధన్యుఁడనయ్యెద" నని యర్ఘ్యపాద్యము లిచ్చి కంద మూలముల భక్తితోనిడ వారునవ్వుచు నవియందుకొని వీనుల విందుగఁ బాటఁబాడిన నతఁ డగ్గానము విని "ఇట్టి యింపగు స్వరముతో నెప్పుడును వేదముల వినము. మీకీ వేదంబు నేముని సెప్పె? ఆతనిఁ దెలిపితిరేని యేనును వారలయొద్ద మీతోఁ గలసి వేదములఁ జదివెదను, ధవళములయిన తులసి పూసల ధరించి మీరు మేన విభూతి యలదినారు. మీరు ధరించిన వల్కలము లెంతయు మృదువుగనున్నయవి. ఇవి యే చెట్లనారలు? దయగలదేనిమాకునునివి యొసఁగు" డని యనేక ప్రకారములఁ బలుకుచుఁ దమతోఁగలిసి మెలఁగుటఁ బరి కించి యొడలు పుడుకుచు నా మునిపుంగవుని సెలుగులఁబెట్టి వారలు తనపురములకేఁగిరి.ఋశ్యశృంగుఁడును వారలుచనిన మార్గముననె వారి రాక కెదురుచూచుచుండ మఱునాఁడా యంగనలేగుదెంచి యధీత వేదవేదాంగుఁడును సద్గుణసంగుఁడు నగు ఋశ్యశృంగునిఁగాంచి "మునీంద్రా! మావనమునకువిచ్చే యుఁడ"ని ప్రార్థింప నాతఁడంగులకు సమ్మతించె. అంత వారా తని కౌఁగిలించి ముద్దులిచ్చుచు సరసాలాపములు గావించుచు

బాహుపాశములఁ గంఠలగ్నముసేయుచు, మోహితుఁజేసి దీమములు మృగముఁ దెచ్చిన ట్లాముగ్ధుని నేర్పుతో రోమపాదునిపురికిఁ గొనివచ్చిరి.

"ఆమునికులాగ్రణియుఁ బురమున కేతెంచుడు వానలు గురిసెను. అంత నుర్వీశుఁడును సంతసించి తనసుతను శాంత నాతని కిచ్చి పరిణయమొనర్చి బహుప్రకారముల మన్నించి కూఁతుని నల్లుని తనయింటనె యుంచుకొని మునుముందుచు నాతని యనుగ్రహమునఁ దనయులఁగాంచెను. దశరథక్ష్మా పాల! నీవును రోమపాద మహీకాంతునికడ కేఁగి యాతని తోడ మైత్రియొనర్చి, యభ్యాపతి వేఁడుకొని యాతనిపిటకుం గొనివచ్చి పుత్త్రికామేష్టి సేయింపుము. అటులైన నీకును సత్పుత్త్రులు గలుగుదురు. నీవును నమ్మునిని యధ్వర్యుఁడుగా హయమేధ మొనరించి సుగుణమణుల నలువురఁ బుత్త్రులఁ గనుము."

నావుడు దశరథుఁడు సంతోషభరితమానసుఁడగుచు తన గురువగు వసిష్ఠు ననుమతిని చతురంగ బలముతోడను మంత్రులతోడను, గలసి పెక్కుపర్వతములను నదులను గడచి యంగదేశము సొచ్చి దీప్తాగ్నియుఁ బోలెఁ దేజరిల్లుచున్న ఋశ్యశృంగుని దర్శించి పదంపడి రోమపాదునిఁ బూజించి యాతనిచేఁ దానును బూజితుఁడయి యాపురమునఁ గొన్ని నాళ్ళుండి రోమపాదునిఁ గనుఁగొని "రాజా! నీయల్లుఁడగు ఋశ్యశృంగుని నీసుతయగు శాంతను నొకపనికై పిలువనేతెంచి నాఁడ. కరుణించి వారల నాపురమునకుఁ బంపుఁడ"ని యతి

వినయమునఁ బ్రార్థింప నాతఁ డంగులకు సమ్మతించి యల్లుని
కూఁతుని వానివెంటఁ బంపెను.

—♦ దశరథుఁ డశ్వమేధయాగము సేయుట ♦—

పంక్తిరథుఁడిట్లు శాంతాసహితుఁడగు ఋశ్యశృంగుని దనపురమునకుఁ గొనివచ్చి యాతనికి నుచితసత్కారములొనరించుచుండ వసంతకాల మాసన్నమయ్యె. అంత కాకుత్స్థవిభుఁడు ఘనుఁడగు ఋశ్యశృంగునిఁజూచి "మునీంద్రా! నాకుఁ బుత్త్రిలు జనియించునట్లుగ నీఁక హయమేధ మొనరింపు" మని వచించి వేదవేదాంగ పారగులైన ఋత్త్విల నర్పించిన వారును నానందభరితులై క్రతువుఁగాంచి పుత్త్రిల గనుమనిరి. అంత నయోధ్యావిభు నానతిని మంత్రులు విహితక్రమమున నశ్వము విడిచి యెదురుచూచుచుండ నదియు సంవత్సరము నిండి క్రిమ్మఱ దశరథుఁడొంతయు సంతసించి కులగురువుఁ గాంచి నమస్కరించి "నీవు మద్గురుఁడవు కావున నీయజ్ఞభారము నీయది సుమా?" యనిన నావసిష్ఠుఁడు "మఖము నిర్విఘ్నముగ పూర్తిసేసెద"నని క్రతుకర్మనిపుణులగు విప్రవరులఁ దగినవారలఁజూచి "మీరు రాజునాజ్ఞఁ గుండమండపాదుల నిర్మింపుఁడ"ని యానతిచ్చిన వారును దగిన సన్నాహంబులు గావించిరి. అంత నమ్మఖంబునకు సుకృతాత్ముఁడగు జనక భూవిభుని, కేకయాధిపుని, సింధుపతిని, గాశినాథుని' రోమపాదక్షితీంద్రుని, దాక్షిణాత్య పాశ్చాత్య నృపులను, బంధువులను గొనిరమ్మని సుమంత్రున కానతిచ్చిన నాతఁడు సర్వమహీశుల నాదరించి తోడ్కొని కొన్నిదినం

బులకుఁ జనుదెంచిన వసిష్ఠుఁ డెంతయు నలరి ఱేని కిట్లనియె; "భూపతు లాదఱును జనుదెంచిరి. వారి నందఱ మర్యాదల మన్నించితివి. సకలమును సిద్ధమయ్యె. కావున మఖంబుసేయ నరుదెమ్ము." అని వసిష్ఠుఁడు పలుక దశరథుఁ డొక శుభదినమున శాంతాసమేతుఁడగు ఋశ్యశృంగుని దోడ్కొని యజ్ఞవాటంబు సొచ్చి కులకాంతలును దానును బావనస్నాన మొనర్చి దీక్షవహించి యలరుచుండ నానాటికా యజ్ఞభూమిని

"బాలుర వృద్ధు లంధులు విపన్నులు రోగులు యోగు లోలి భూ
పాలుర ఋత్విజు ల్మునులు బ్రాహ్మణు లార్యులు బంధు లుత్తమ
స్త్రీలు సమస్తజాతులును జేరి తగం దమ యిండ్లకైవడిన్
మేలగు నన్నపానములు మెచ్చొదవం గయికొంచునుండఁగన్."

యిరువదియొక్క యూపస్తంభములు సంస్థాపించి, చతుష్పాదంబులును, బక్షులును, జలచరములునుగా, మున్నూఱు పశువులు పరివేష్టింప నశ్వరత్నంబు నడుమ నిడి యుక్తక్రమంబున నమ్మున్నూఱు పశువుల విశసించి యేయే దేవతల కేయే మంత్రముల నేయే పశువుల పలలంబు లర్హంబులో యాయా దేవతల కాయా మంత్రముల నాయా పశువుల పలలంబు లాహుతులుచేసి యశ్వంబు విశసించి, యాజకు లాయశ్వంబు వప వెలికి వేదోక్తక్రమమున నాహుతులుసేయ నావపాధూమగంధంబు లాఘ్రాణంబు సేసి యఖిల భూపాలుర పాపములఁ బాయ నాయశ్వంబు సర్వాంగములు నగ్నికాహుతులు సేసి యయ్యశ్వమేధం బలోపక్రియాకలాపంబుగాఁ బరిసమాప్తి నొందించిరి.

దశరథుఁ డధికానందముతోడ నయోధ్యాపురము దక్క తక్కిన పురము నంతయు దక్షిణగ ఋత్విజుల కొసంగిన వారును దశరథునిగాంచి "మేమెక్కడ? భూమి యేలు టెక్కడ? ఎపు డనుష్ఠానములఁ దీర్తుము? ఎపుడు వేదాధ్యయన మొనరింతుము? నీవ నీపుడమిఁ బాలించుచు ధరణికిఁ దగు మూల్యముగ హేమంబు లొండె, రత్నము లొండె, ధేనువుల నొండె యొసంగుమ"నిరి. దశరథుఁ డామాటలకు సంతసించి వసిష్ఠ ఋశ్యశృంగాది ఋత్విజులకుఁ బదికోట్ల సువర్ణంబును నలుబదికోట్ల రజతంబులు నొసంగి తక్కిన భూసురులకు కోటి సువర్ణంబులును, దివ్యాంబరాభరణాదులు నొసంగి ఋశ్యశృంగునిఁ జూచి మీరు పుత్రికామేష్టిఁ జేయుఁడని ప్రార్థించిన నామునీంద్రుఁడును నల్లెయని పుత్రకామేష్టి సేయఁదొడఁగె.

-( శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నుల జననము )-

అప్పు డప్పావన హోమాగ్నివలన దివాకర సమాకారుఁడగు నొక దివ్యపురుషుఁడు పవిత్ర హేమ పాయస పాత్రంబు హస్తమున నమర వెడలి దశరథు వీక్షించి "యేను ప్రాజాపత్య పురుషుఁడను. దేవనిర్మితమును నారోగ్య వర్ధనమును బుత్రోత్పత్తికరమును నగు నిప్పాయసము నీప్రియ పత్నుల కొసఁగు" మని పలికి యా కాంచనపాత్ర దశరథున కిచ్చి యా దివ్యపురుషుఁ డంతర్ధానము నొందెను.

దశరథుఁడును పెన్నిధిగన్న పేదయుంబోలె నధికానందమునొంది యాపాయసము రెండుభాగములుగ నొనర్చి యందర్ధభాగము కౌసల్యకొసఁగె. మిగిలిన సగములో సగము

సుమిత్ర కిచ్చి కడమ సగములో నర్ధభాగము కైక కొసఁగి తక్కిన యర్ధభాగము మఁగుడ సుమిత్రకొసఁగె. ఆ పాయసాన్నమును భుజించి కౌసల్యాది కాంతాత్రయము గర్భముల ధరించియుండ నయోధ్యావిభుఁడు పరమానంద భరితుఁడై యుండెను.

తత్సమయమున నసురజ్యేష్ఠు నానతి నింద్రాదిదేవతలు కిన్నర విద్యాధరాదుల భామినులం దత్యున్నతబలులగు కపుల సృజియించిరి. అందు సురపతి వాలిని, భానుఁడు సుగ్రీవుని, ననిలుఁడు హనుమంతుని, ననలుండు నలుని,వరుణుఁడు నీలునిఁ గుబేరుఁడు సుషేణుని, విశ్వకర్మ గంధమాదనుని, సురమంత్రి శరభుని, నశ్వినులు మైందద్వివిదులను బుట్టించిరి. మఱియుఁ దక్కిన గరుడ గంధర్వకిన్నరాదులు పర్వతాకారుల సువర్ణానిలబలసంపన్నులఁ గామరూపుల వలీముఖోత్తములఁ బుట్టించిరి. అందఱకును విభుఁడై వాలి యతిశయించుచుండెను.

పదంపడి దశరథుఁడు వసిష్ఠాదిమహామునులఁ బూజించి వీడ్కొలిపి సుఖంబున రాజ్యము సేయుచుఁ బుత్రోత్పత్తికెదురుచూచుచున్నంతఁ బండ్రెండవ నెలను చైత్రశుద్ధ నవమి బుధవారమునఁబునర్వసునక్షత్రయుతకటకలగ్నమునఁ గౌసల్య హాగ కర్ధమగు రాముని, దశమిగురువారమున మీనలగ్నమునఁ గైక భరతుని, నేకాదశి శుక్రవారమున నాశ్లేషానక్షత్రయుత కర్కటక లగ్నమున సుమిత్ర లక్ష్మణ శత్రుఘ్నులను గనిరి, తత్సమయమున సురలు విరులవానలు గురియించిరి. అప్సరసలాడిరి. గంధర్వులు పాడిరి. దేవదుందుభులు మొరసెను.

దశరథుఁడును బరిపూర్ణమనోరథుఁడై సూతవంది మాగధులకుఁ బారితోషికము లొసఁగి భూసురులకు గోదాన సువర్ణ దానము లిచ్చి సకల జనుల మిష్టాన్నపానాదులఁ దృప్తులఁ జేసిన వసిష్ఠుఁడును బాలురకు జాతకర్మాదుల నిర్వ ర్తించి క్రమముగ నగ్రతనయునకు రాముఁడను నామంబును రెండవ కొడుకునకు భరతుఁడను నామమును, సుమిత్రానందను లకు లక్ష్మణ శత్రుఘ్నులను నాఖ్యలను నొనరించెను.

అంత రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు వేదవేదాంగ ములను, ధనుర్వేదంబును, సకలకళలను నభ్యసించి గజాశ్వా రోహణనిపుణులై యన్యోన్యానురాగములచే నెంతయు నొప్పుచు గురుశుశ్రూష సేయుచు శూరులై నీతికుశలులయి యుండిరి.

-( రామలక్ష్మణులు విశ్వామిత్రువెంటఁ జనుట )-

ఒకానొక దినమున దశరథుఁడు తనతనయులఁ గనుఁగొని వారలకుఁ బరిణయముసేయఁదనమదిఁ దలపోయుచుండ నధ్వర సంపూజితపీతిహోత్రుఁడును సర్వసంయమిజనస్తోత్రపాత్రుఁడు నగు విశ్వామిత్రుఁ డేతెంచెను. అత్తఱి నయోధ్యావిభుఁడు దౌవారికునివలన నాతనిరాక నెఱింగి యెదురేగి మ్రొక్కి వివిధసపర్యల నాతని సంతృప్తుఁగావించి యుచితాసనాసీనుఁ జేసి యాతని కోరికల నిత్తుననియె. మునీశ్వరుఁడును సంతసించి దశరథు నేమమూరసి యిట్లనియె. “రాజా! దశరథ! మారీచ సుబాహు లనునిరువురు రక్కసులు నాయజ్ఞవేదికలపై మాంస రుధిరంబులఁ జల్లుచుఁ గ్రతువిఘ్న మొనర్చుచుందురు. ఏనును

దపోవ్యయంబున కోర్వఁజాలక వారల శపింపనైతి. కావున నీయగ్రసుతుఁడగు రాముని బాలుఁడనియెంచక నాతోడఁ బంపిన దుష్టరాక్షస సంహారమొనర్చి యాతఁడు నాయాగపరి పాలనమొనర్చును. నామాట నమ్మకున్న నాతని మహిమంబు వసిష్ఠునివలనఁ దెలిసికొమ్ము. నేను నీపుత్త్రుని వజ్రకవచము వలెఁ గాచి తెచ్చెదను" అని పలుక దశరథుఁడు తన యగ్ర పుత్త్రవియోగమున కోర్వఁజాలనని శంకించుచుండ గాధేయుఁ డాజ్యాహుతులచే మండు నీతిహోత్రుకరణి కోపాగ్నిచేమండి పడుచు దశరథునిజూచి "తొల్త నాకోర్కి నొసంగెదనని మృషావచనుఁడ వైతివి. నీవును నీహితులును సుఖంబుగ నుండుఁడు. నేనిప్పుడ పోయెద"ననియె. అంత విశ్వామిత్రు కోపమున నేమగునోయని దేవతలు భయమునొందిరి. పుడ మియు వడఁకె. తత్సమయంబున వసిష్ఠమునీంద్రుఁ డానృపుని గాంచి "యశోధనుఁడవగు నీవు నీచుని మాడ్కి బొంకుట యర్హమా? కౌశికుండు సామాన్యుఁడుగాఁడు. ఆతఁడెఱుఁగని యస్త్రంబులు లేవు. నిశాచరుల వధింప నమ్మునీంద్రుఁడు సమర్థుఁడయ్యును ఈనెపమున నీయగ్రసుతునికి మేలొనగూర్పఁ దలఁచి యిట్లేతెంచినాఁడు. కావున వైళంబ నీతనూజుని గాధే యునకిచ్చి పంపుము"నియెను. దశరథుఁడును ముదితహృదయుఁ డగుచుఁ దానును దన కాంతలును రామలక్ష్మణుల దీవించి యాసంయమీంద్రునివెంటఁ బంపిరి.

రామలక్ష్మణులును విశ్వామిత్రునివెంట నర్ధయోజన మరిగిరి. సరయూనది దక్షిణతీరము సేరవచ్చుటవిశ్వామిత్రుఁడు

రామచంద్రు నవలోకించి, "రామా! ఆఁకలియు, దప్పియు మొదలగునవి నిన్నుఁజేరకుండునట్లు నీకుఁగొన్ని విద్యల నుపదేశించెద. నీవును నదీప్రవాహమున శుద్ధుఁడవైరమ్ము"న నాతఁడును బవిత్రజలముల వార్చి వచ్చె.

అంత మునీంద్రుఁడు బలాతిబలలను విద్యలను రామున కుపదేశమిచ్చి యాతనితోడ "రాఘవా వీని జపించితివేని నీవు నిద్రించియున్నను బ్రమత్తుఁడవై యున్నను రాక్షసుల వలన భయము గలుగదు. మఱియు నీవిద్యలఁబఠించిన నెఱుకను సౌభాగ్యముననను శుచియందును గౌరవముననను బలమునను భుజ శౌర్యముననను ముల్లోకముల నీకుఁ బ్రతి లేకుండు" ననిన కౌసల్యానందనుఁడును సంతసించి యామునీంద్రులకుఁ దానును దమ్ముఁడును శుశ్రూష లాచరించుచుఁ జనుచుండి మార్గమధ్యమున మునీంద్రు నానతిని తాటకను సంహారము గావించిరి. పిమ్మట వారు విశ్వామిత్రుఁ నాశ్రమముఁ జేరిరి. తత్సమయమున నచ్చటి మునులు విశ్వామిత్రుఁ బొడఁగని యుబ్బి యెదు రేగుదెంచి యర్ఘ్యాక్రియమున నా ముప్పురఁ బూజించిరి. ఆచ్చోట ముని సహితులగు రామలక్ష్మణులు ముహూర్తమాత్రము విశ్రమించిరి. అప్పుడు రామలక్ష్మణులు కౌశికుఁగనుఁగొని "మునివర్యా! మీరిఁక దీక్షవహింపుఁడు. దుష్టరాక్షసుల శిక్షించి మీ మఖంబు రక్షించెద"మని యా రాత్రి సమాహితచిత్తులై యుండిరి.

మఱునాఁడుదయమున కాలకృత్యములు సలిపి యగ్నిహోత్రము లాచరించుచున్న విశ్వామిత్రునకు నమస్కరించి

మునీంద్రా ! మే మెంతకాలము నీయజ్ఞము కాపాడవలె" నన్న నచ్చోటనున్న మునులు " కౌశికుఁడు దీక్షవహించి మౌనమున మఖము గావించుచున్నవాఁడు. మీరమ్మునీంద్రు నిదిమొదలుగ నాఱుదినములు సావధానమనస్కులై కాచి యుండుఁడ"నిన వారును శరమ్ములుధరించి యేమఱక యుద్ధోన్ముఖులై యుండిరి.

ఇట్లుండ నాఱవదినమున మారీచ సుబాహులను రాత్రించరులు నభంబున మాయాజీమూతములఁబన్ని రక్తధారలు యజ్ఞవేదిపైఁ గురియింప రాముఁడొక నిశితశరము మారీచుని విశాలవక్షముపై నేసిన నతఁడు శరవేగమునఁ దోయధిమధ్యమునఁ గూలెను. వెంటనే యాగ్నేయాస్త్రము ప్రయోగించి సుబాహువక్షంబు భేదించి యాతని నంతము నొందించి, విశ్వామిత్రు యాగసంరక్షణము గావించెను.

—♦ సీతా వివాహము ♦—

పిమ్మట గౌతము నాశ్రమమున రాముఁడహల్యాశాప మోక్షణము గావించిన నన్నాతియు నాతని కతిధిసత్కారము లాచరించి యనేకవిధములఁ బ్రస్తుతించి తన ప్రాణనాథు నాశ్రయించెను. విశ్వామిత్రుఁడును రామలక్ష్మణ సమేతుఁడై మిథిలాపురము సేరి యందు జనకుని యజ్ఞవాటంబు సొత్తేర జనకుఁడు వారలఁబూజించి యతికౌతుకమున రామలక్ష్మణులఁ గనుఁగొని "లోకత్రాణపారీణులగు నీ రాజకుమార శేఖరు లెవ్వ"రని యడుగ నాగాధినందనుఁడు "వీరు దశరథనందనులు. వీరు సిద్ధాశ్రమమునఁ దాటకఁ దుంచి, సుబాహుఁ గీటడఁచి

యహల్య శాపము వాపి నీగృహమ్ముననున్న మహేశ్వరుని
చాపముఁ జూడ నేతెంచి"రనియె. అంత, 'నాకులజుఁడైన
రాముఁడెల్లి ముక్కంటిధనువు విఱిచి సీతఁ బరిణయమగు'నని
చెప్పుటకు నాకంబున కరిగెనోయను విధమున సూర్యుఁడు
గ్రుంకెను. ఆరాత్రి వేగిన విశ్వామిత్రు నానతి మిథిలేశుఁడు
తనయింట తరతరములనుండియున్న శివకార్ముకము బాహు
బలాఢ్యులగుపదివేవురు భటులచేఁ దెప్పించి సభముందటఁబెట్టి
"ఈచాప మెక్కిడిన రాజన్యునకు మదీయపుత్రిఁ బ్రమో
దమ్మున నొసఁగెద"ననె. అంత విశ్వామిత్రుఁడు రాముఁజూచి
"యీచాపము నెక్కుపెట్టు"మన రామచంద్రుఁడును దాని నవ
లీలనెత్తియల్లన లస్తకంబు వదలిన నదియును బెళపెళా
రావమ్ముతోడ రెండు ఖండములయ్యెను. అత్తఱి జనకుఁ
డమితానందమునొంది "నాకూఁతు రామున కిచ్చెద" నంచు
గాధేయుతోఁ బలికి తన మంత్రుల దశరథుకడకుఁ బంపి యీ
వృత్తాంతము నాతని కెఱిఁగించి రండనియె. వారట్లుగావింప
దశస్యందనుఁ డత్యానందము నొంది వారల కనేకదివ్యాంబరా
భరణాదులొసఁగి యమ్మఱునాఁడు వసిష్ఠవామదేవాదిమునుల
తోడఁగూడి మిథిలానగరమున కేతెంచె. జనకుఁడును దగిన
చోట విడియించి వారల సత్కరించె. అంత శతానందుఁడు
సకలగుణాభిరాముఁడగు రామునకుఁ జారుగుణశీలసమేతయగు
సీతను బెండ్లిసేసి జగన్నుతకీర్తిఁబొందుమని పలికిన దశస్యం
దనుఁ డమితానందము నొందెను.

మఱియు జనకుఁడు లక్ష్మణునకు నిజతనూజయగు నూర్మిళను, దమ్ముఁడగు కుశధ్వజుని నందనలగు మాండవీ శ్రుతకీర్తులను భరతశత్రుఘ్నులకు నిచ్చి యగ్నిసన్నిధిని వేదోక్త ప్రకారమునఁ బాణిగ్రహణము సేసెను. అంత నా నలువురు కుమారులు నగ్నిదేవునకు,మునులకును దశరథ జనకులకును నమస్కరించి బహువిధ భూసురాశీర్వాదముల నుల్లసిల్లిరి.

జనకుఁడును గూఁతులఁ బిలిచి బుద్ధులు సెప్పి భూషణాంబరాది సంపదలఁ దనియఁగ నిచ్చి యాపురాంతయు సంతసింప నయ్యినకుల నాథుతో ననిచె.

దశరథుఁడు బంధుమిత్ర సచివులతోడను సేనలతోడను గూడి తనతనయులును గోడండ్రును జనుదేర నయోధ్యాపురమునకుఁ బోవుచుండ మార్గమధ్యమునఁ బరశురాముఁడు మహాదర్పముతో నేతెంచి రాము నడ్డగించిన నాతఁ డాజి నతని భంగపరచె. భార్గవుఁడును శ్రీరాము ననేక విధముల సన్నుతించి ప్రదక్షిణ మాచరించి మహేంద్రాద్రికి నరిగె. దశరథుఁడును సంతసమున నయోధ్యాపురము ప్రవేశించెను.

-( రావణుఁడు సీత నపహరించుట )-

అయోధ్యా విభుఁడును రామునకుఁ బట్టాభిషేక మొనర్పఁదలఁచి మున్ను కైకకు నసుఁడై తానిచ్చినట్టివరమ్ము కతన నన్మత మాడఁజాలక రాముని నడవి కనిచె. జనకు నాజ్ఞ శిరసావహించి రాముఁడును సీతాలక్ష్మణులు తన్ను

సేవించుచుండ నయోధ్యాపురము విడిచి నిజపద, సేవా నిర తుఁడగు భరతుని రాజ్యమున నిలిపి చిత్రకూటాచలముఁ జేరి తాపసోత్తమశరణ్యమగు దండకారణ్యముఁ జొచ్చెను. అందు ననుజసమేతుఁడై తన నాతితోడ రాముఁ డొక్క పర్ణ శాలయం దుండ రావణు చెల్లెలు శూర్పణఖయనునది రామునిఁ గామించిన లక్ష్మణుఁడు దాని ముక్కుఁగోసె. దాని విని ఖరదూషణాదులు పదునాల్గు వేల రక్కసులు రామునిపైకి రా నాతఁడు కదనరంగమున వారల బాణాసల మున భస్మము గావించెను.

జానకిసౌందర్యము విని దశగ్రీవుఁడును మదనబాణనిర్భి న్న హృదయుఁడగుచు నమ్మగువ నపహరింపఁదలఁచి నీచుఁ డగుమారీచుని బంప నాతఁడుపసిడిఱ్ఱియై నటించుచుండ రాముఁ డాతని కపట మెఱిఁగి యాతని వధింపఁబోవ నంత రావణుఁడు సన్యాసివేషమునఁ బర్ణశాలఁజొచ్చి సీతఁగొనిపోయె. ఇట్లసు రేశ్వరుఁ డన్యాయముగ నంబరవీధిని సీతఁగొనిపోవుచుఁ బక్ష వేగపరిహసితవాయువగు జటాయువను పక్షీంద్రుఁ డడ్డమైన నాతని ఘోరాయతిహేతిఁ ద్రుంచెను.

అంత రామనరపాలుఁడు సీత వెదకుచు నిజకార్యనిహ తుఁడై జటాయువునకుఁ బరలోకక్రియలు నిర్వర్తించి ఋశ్య మూకంబునకుఁజని చరణఘాత చూర్ణగ్రావుఁడగు సుగ్రీవున కభయమొసఁగి దశాస్యమానోన్మూలియగువాలి నొక్కకోల నవలీలఁ గూలనేసెను. పిమ్మట రామవిభుఁడు సీతాన్వేషణ మునకై బలవంతుఁడును మతిమంతుఁడునగు హనుమంతునిఁ

బంపిన నమ్మారుతి యతిలాఘవమున సముద్రము లంఘించి లంకఁజొచ్చి సీతఁగని తిరిగివచ్చుచు నక్షకుమారాదుల వధించి యమరాహిత దత్తవాలాగ్నుల లంకాదహనమ్ముసేసి, తన రాకకై యెదురు సూచుచున్న రాఘవునకుఁ దా నొనర్చిన యద్భుతకర్మంబులు సెప్పిన విని జానకీవల్లభుఁడు వానరసైన్యంబులతోడ వెడలి లవణసముద్రతీరంబుఁ జేరెను.

—♦ లంకాపురమున విభీషణుఁడు రావణునకు నీతిచెప్పుట ♦—

రావణుఁడు వేగులవారివలన దాశరథుల వృత్తాంతము నంతయు నెఱిఁగి హనుమంతునిచే నయిన పరిభవము దలఁచి యాస్థానమ్ము కలయఁజూచి, "ఒకానొక వానరుఁడు పారావారమ్ము దాటివచ్చి వనమ్ము నెఱికి యక్షకుఁ బరిమార్చి నా పురము గాల్చె, ఇఁక నన్ను లెక్క సేయక వానర సేనతోఁ గూడి రామలక్ష్మణు లేగతినైన సముద్రము దాటివచ్చెదరు. వారలతోఁ గయ్యము తప్పదు. కావున మంత్రులగు మీర లందఱు నాలోచించి వారలు సాగరము దాటి రాకమున్నె వారి జయించు నుపాయంబు సెప్పుఁ"డనియె. అంతఁగొలువున నున్న రక్కసు లుక్కుమిగిలి ఖడ్గరోచులు నిగిడించుచు "దేవా! కుబేరు గెల్చి పుష్పకంబు గొని కైలాసమెత్తిన నీ కసాధ్యంబెద్ది? అదియునుంగాక మహేశ్వరమను యాగమొనర్చి లబ్ధవరుఁడైయున్న జగదాభీలుఁడగు మేఘనాథుఁడుండ నీ కీచింత యేల?" యని పలుకుచు మహాపార్శ్వుఁడు మహోదరుఁడు మొదలగు మేటిరక్కసులు క్రోధమ్మెఱుఁగు లెగయ నాయుధమ్ము లంకించుచు వణుఁజూచి "మేమానరుల వాన

రులఁ దునుముదము. పొడుతుము. చెక్కెదము. వ్రక్కలు సేయుదుము"ని రోషపరుషభీషణభాషణములఁ బలుకుచున్న వారి వారించి విభీషణుఁ డిట్లనియె.

"పిశాచరులార! వినుఁడు. మన రాజు రాము భార్య నన్యాయముగ మాయోపాయమునఁ దెచ్చి యింత నేసె. దుశ్చారిణియైన శూర్పణఖ భయంకరాకారముదాల్చి జానకి మ్రింగఁబోయె. అందుకై పూనికతో నేఁగి ఖరాదులు రామునిచే మడిసిరి. కావున వారలం దేతప్పుగలదు? మనము పంతము లాడినంతనె వా రెఱుఁగుదురా? హనుమంతుఁ డట్లు సేయునపుడు మీరందఱు నిచ్చట లేరా? అది యట్లుండనిండు. సామదానభేదంబులఁ బ్రయోగించినఁ గదా విక్రమోద్యోగంబు? అదియును విరోధిమత్తుఁడైయున్నను హీతబలుఁడైనను నీతివిదులు సనుసంద్రు. రఘురాముఁ డప్రమత్తుఁడు సధికబల సమేతుఁడు నగుట నెవ్వరికి నజేయుఁడు. అంతియ కాదు. ధర్మ మెచ్చట నుండు నచ్చట జయముండును. కావున రాఘవులతో వృథావైరము దగద"ని పెక్కు హేతువులు సూపి చెప్పుచు దశవదనుఁ గనుఁగొని "రాక్షసేంద్రా! నిన్నును మమ్మును మంత్రులను సైన్యమును, రక్షింపఁ దలఁచితివేని వైదేహిని రామున కిమ్ము. ఖరుఁడు తృణకల్పుఁడై యుద్ధమున రాముని చేఁ గూలుట కంటివి గదా?" అని చెప్పుచుండ రక్కసుల తోఁ డతని నిష్ఠురవాక్యములు విననొల్లక నిజనివాసమునకుఁ జనిన సందఱును దము తమ నివాసములకుఁ జనిరి.

విభీషణుఁడు మఱునాఁడు ప్రభాత సమయమున సమరారి గృహమున కేగి మంత్రివరులు గొల్వ సింహాసనమున నున్న యన్నఁగని మ్రొక్కి తన్ని యోగమున నొక్క సువర్ణ పీఠమున నుండి ప్రసంగవశమున నాతనితో నిట్లనియె. "అన్నా! సీత నీ విచటకుఁ దెచ్చినది మొదలు దుర్నిమిత్తములు పెక్కు గానఁబడుచున్నవి. ఈ యుత్పాతములకు సీత రాముని కొప్పగించుటయె శాంతి. ఈవిధంబు మంత్రులెఱిఁగియు నీకుఁ జెప్ప వెఱతురు. అపదలందు హితమ్ము పలుకవలదా?" అనవుడు రావణుఁడు "వార లమరగణముతో వచ్చినను వైదేహిని విడువనోప. నీ హితోక్తు ల విననొల్ల. నీవెందైనను జనుమ"ని పల్కి మందిరద్వారము వెలువడి కనకరథాధిరూఢుఁడై యాస్థానమంటపమున కేతెంచి మణిఖచితసింహాసనారూఢుఁడై నిజనియోగమున నందఱు నర్హాసనములనుండఁ గొండొక సేపునకుఁ గొలువు కలయఁ జూచి "నాతమ్ముఁడగు కుంభకర్ణుఁడు సీతమ నేను దెచ్చుట మొదలగునవి యెఱుఁగఁడు. కావున నాతని కీసంగతి వినిపింపవలె" ననుచు శూర్పణఖ ముక్కుపోవుటయు, ఖరుఁడు చచ్చుటయు సీతను నేర్పునఁ దానుఁ దెచ్చుటయు, హనుమంతుఁడు పురము గాల్చుటయు వరుసగ నంతయుఁ దెల్పెను.

అంతఁ గుంభకర్ణుఁడును రావణుఁజూచి "కార్యవేదివయి సీతఁదెచ్చితివే. రాఘవ ధనుర్విముక్త క్రూరశిలీముఖాగ్నిఁబడి మ్రగ్గుము. సీతిమార్గమున కార్యము నిశ్చయించి మర్యాద

తప్పక కార్య మాచరించునతఁడు మీఁద కష్టముల నందఁడు. ధర్మమును విడిచి వర్తించువాఁడు సంతాపమొందును.

"ఎఱుక లేక చపలుఁ డేవంకఁ దిరిగిన నల్పమతులు వాని ననుసరింతు
రొక్కకొంగ పాఱ నున్న కొంగలుగూడ నెగసిపాఱుచునికి తగవు కాదె?

అదియునుఁగాక,

ఆదిమధ్యాంతరహితుఁడైన శ్రీవిష్ణుఁ డసురకులవధార్థం బిట్టు లవతరించె
రవికులాంబుధిసోముఁడౌ రామచంద్రుఁ డురుబలుఁడుగాని సామాన్య
నరుఁడు గాఁడు."

'ఈవిధమునంతయు నారదుచే మును నే వింటిని. కావున సీతను రామున కర్పింపుము. అటులయిన మనకు శుభంబుగలుగు న"నిన నప్పలుకులకుఁ గటకటంబడియున్న దశగ్రీవు కోపరస భావ మెక్కఁగి కొంతసేపునకుఁ గుంభకర్ణుఁడు "దాశరథులు చంద్రార్కులైనను ననలవరుణులైనను ధనదపవనులైనను నాదు పరిఘంబు పాలుగాక నను గెలువఁగలరా? రణరంగమున రామలక్ష్మణుల సుగ్రీవాది వానరుల మ్రింగెద"ననె. ఇటులనే మహాపార్శ్వుండును ప్రహస్తుఁడును వారల నవలీలఁ దునిమెద మనిరి.

అంత విభీషణుఁడు కుపితమానసుఁడగుచు వారలం జూచి "వాయునందనుఁడు లంకాదహనముసేయునాఁడు మన మెందుబోయితిమి? నేఁ డెవ్వఁడును సీతఁ బుచ్చుమనఁడు. రామచంద్రుని సామర్థ్యము యుద్ధమున నెఱిఁగెదరుగాక!" యనెను. మేఘనాథుఁ డప్పలుకులకుఁ గనలి "మూఁడులోకముల జయించి దేవాంగనలఁ జెఱఁగొన్న దశకంఠు తమ్ముఁడవైన నీ కీపేద

మాటలు నోటి కెటులవచ్చె ? ” ననిన విభీషణుఁ డతని "నీతికోవిదు లల్పుని, మూర్ఖుని, బహుభాషిని, బాలుని రహస్య కార్యాలోచనమున నరసింతురు. నీబుద్ధి యవగుణ ముల కాలయంబు. నీవు తండ్రికి పుత్త్రరూపమునను న్న పగతుఁ డవు. రాముఁ డష్టదిక్పాలురలో నెవఁడును గాఁడు. ఆదినారా యణుఁడు. అతని నావహారంగమున గెల్వ నీకలవియగునా?” యని పలికి యాతనిమాటలు లెక్కసేయక యన్నంజూచి "జగతీనాథుఁడు సముద్రము దాటి నీపై రాకమున్నె ధరణీ నందన వానికి నిచ్చుట శుభమ్మ”నినదశకంఠుఁ డాతనిఁగాంచి "పాముతోఁ జెలిమిసేయుటకంటె నీతోడ స్నేహముసేయుట కడుఁగీడు. నీవెప్పుడును పగవానిపక్షము పలికెదు. నీకన్న నిక్కంపు పగవాఁడే మేలు. ధనమును, విద్యయు, కీర్తియు నొకనికిఁగలుగుట కసూయపడువారు దాయాదులే. కావున నిన్ను నమ్మరాదు. నీరు నళినీపత్త్రమందున్నను దాని నెట్లం టదో యట్లె నీమాహృదయములు కలయవు. ఇట్టిమాటలిఁక పలికితివేని సహింపను.” అనిపలికిన ధర్మవిరుద్ధములగు దశకం ధరువాక్యములును నీతియుక్తములగు తమ్ముని వచనములును మనమునఁ దలపోసి కుంభకర్ణుఁ డేమియు ననఁజాలక నిద్రాస క్తుఁడై నిజమందిరమున కరిగెను. తదనంతరము విభీషణుఁడు రావణునితో నిట్లనియె.

" నీవెత్తఁజాలని నీలకంఠుని విల్లు పుడకకైవడిఁ దున్మి ప్రోఁగువెట్టె
నిలఁగార్తవీర్య బాహులు వేయుఁ ద్రుంచిన పరశురాముని సాజి భంగపఱిచె

కైలాసమెత్తిన ఘను నిన్నుఁ గట్టిన వాలి నొక్కమ్మునఁ గూలనేసె,
నీపుత్త్రు వధియించి నీలంక గాల్చిన హనుమంతు నేలినయతని నేలె
నట్టి రాముతోడ ననమాన వైరంబు పట్టి గెల్తుమనుట పడుచుబుద్ధి
చనదు; సీత నిచ్చి శరణని రఘురాముఁ గనుటమేలు చెడకమనుటమేలు"

నావుడు రాక్షసేశ్వరుఁ డదరిపడి యొఱనున్న వాలు కేల జళి పించుచు, హుంకారమ్ము సేయుచు నుత్తికి యురమ్ము దాటించిన నతఁడు మూర్ఛనొంది తనగద్దియనుండి భూస్థలి వ్రాలె. అంత మన్నించుమనుచుఁ బ్రహస్తాదులతని గద్దియకుఁ దెచ్చిరి. పిమ్మట విభీషణుఁడు తెలివినొంది "రావణా! కామక్రోధాదులు నీమనసమున నిండియుండ నీయందు నిర్మలధర్మ మెట్లుండును? నామాట లెట్లు నీచెవులఁ జొచ్చు" ననిన సైరింపక రాక్షసేంద్రుఁడు ప్రహస్తునిఁజూచి వీనిఁ గొలువు వెడలఁ ద్రోయుమని పనిచిన నతఁడును గదిసి "నీవెడసీతు లిచ్చుట సాగవు. కాన రాక్షసాధిపు ననుమతిని శీఘ్రమె యెచ్చటికైనను జను" మనియె. విభీషణుఁడును దనమంత్రులఁ గూడి సభామధ్యమున నున్న రావణునిఁజూచి "మహద్విరోధము వలదని చెప్పిన నిట్లు పరిభవించితివి. నామాట లిప్పుడు గైకొనకున్న రాము చేఁబడిన యప్పు డెఱుఁగుదువుగాక. పో యెద"నని పలికి వినతుఁడై తనతల్లికడకుఁ జని యామెకు నమస్కరించి జరిగిన విధమంతయు నెఱిఁగించి "రఘురాముఁగొల్వఁ జనియెద. నీవును దీనికి వగవకుము" నెను. కైకసియు పుత్త్రుఁ జూచి "మీతండ్రి విశ్రవసుఁడు మున్నె మీ జనన కాలమున నె నాకి ట్లెఱిఁగించె. రావణ కుంభకర్ణు లొనర్చు

బాధలకు సహింపఁజాలక నిలింపులు విష్ణునాశ్రయింపనాతఁడే యిప్పుడు వీరల వధమ్మునకై రాముఁడై జనియించె. చావగ మిగిలినవారల రక్షింప నీవె రామకరుణచే నిలఁతువు. కావున నీవింక శరణాగత వత్సలుఁడగు రామునాశ్రయింపుము. తండ్రీ నిన్నుఁ దిగ్విమూర్తులును లోకపాలురను, గ్రహతారకలును, సముద్రములును, వేదవేదాంగములును, అహోరాత్రములును రక్షించుగాక! నెమ్మదిఁబోయిరమ్మ"ని దీవించెను. అతఁడును గగనమార్గమునఁజని రామునాశ్రయించిన నాతఁడును విభీష ణునకభయమొసఁగి సముద్రోదకముల దెచ్చి లంకారాజ్యమున కభిషేకమ్ము సేయుమని లక్ష్మణు నియోగించిన నాతఁ డట్లు గావించెను.

అంత రామచంద్రుఁ డలలచే నాకసంబునొరయుచున్న పారావారంబుఁబొడగని తనకు మార్గమిమ్మని వేడిన నదియు దారి సూపక తన యౌన్నత్యంబుఁజూపినఁ గౌసల్యాసుతుఁడు రెట్టించిన కోపమున బాణ బాణాసనంబు లందినమాత్రాన జలనిధి గుల్లలు నాచులు చిప్పలు బయల్పడఁ బెద్దబీడైయుం డెను. ఇటుల విపన్నుఁడయిన సముద్రుఁడు నదులతో మూర్తి మంతుఁడై చనుదెంచి రామచంద్రుని చరణముల వ్రాలి యిట్లనిస్తుతియించె. "ఓసూర్యకులదీపకా! దీనమందార! నిక్క ముగ లోకములన్నియు నీగర్భమునఁ బ్రభవించి యంద యడఁగు. నీవు సత్త్వరజస్తమోగుణములచే సృష్టిస్థితిలయ ములఁ జేయుదువు. నిను వర్ణింప నే నెంతటివాఁడను? సేతువుఁగట్టి లంకఁజుట్టుముట్టి నీబాణాగ్నిచే రావణు శిర

ములఁదున్ంచి నీయబలఁ జేపట్టుము." అని యిట్లుసముద్రుఁడు విన్నవించిన దాశరథియు దానిఁ బూర్వప్రకార ముండుమని వీడ్కొల్పెను. వానరులును దివిజులు నుతింప మహాశైలమ్ములును, వృక్షములును దెచ్చి సాగరమున వారావధిగట్టిన రాఘవుఁడును వారలతోడ సముద్రము దాటి లంకాపురము ముట్టడించెను.

వానరుల సింహానాదములు విని రావణుఁడు తనమంత్రుల నవలోకింపఁ దన మంత్రియు మాతామహుఁడునైన మాల్యవంతుఁడు రావణుఁజూచి యిట్లు చెప్పఁదొడఁగె.

—♦ రావణునకు మాల్యవంతుఁడు నీతి చెప్పుట ♦—

"రాక్షసాధిపా! అన్నివిద్యల నభ్యసించి యఖిలనీతుల నెఱిఁగి వలనుదప్పక వర్తించునతఁడు శత్రులఁ బరిమార్చి యైశ్వర్యంబుగలిగి మెలఁగుచుండును. దశాననా! సంధియును విగ్రహంబును తఱియెఱిఁగి చేయుటచే కార్యము పొసఁగుచుండును. ఆలోచింప సములును బలయుతులును సంధికి నర్హులు. దేవముని గంధర్వాదులుధర్మపక్షమునవలంబింతురు కావున వారు రాముని జయమ సూతురు. నీవిఁక మాఱుమాటాడక ధరణీసుత నిచ్చి రాము నాశ్రయించిన శుభమగును. మఱియు నొక్క విశేషంబు సెప్పెద. ఆదిని విరించి సురలకొఱకు ధర్మమును నసురులకొఱ కధర్మమును నిర్మించె, కాఁబట్టి తత్తత్కర్మము లిరుగడలవారిని రక్షించును. మనుజులు దివిజులవైపునను మనము రక్కసుల దెస నుండుటచే మనకు నధర్మమును వారికి ధర్మమును జయమును నొసఁగుచుండును. కృతయుగమున ధర్మముచే

నధర్మము నశించును. త్రేతాయుగమున నధర్మముచే ధర్మము నశించును. కావున నయవిదులు యుగధర్మ మెఱుఁగవలయు. రాక్షసేంద్రా! నీవు వ్యసనాసక్తుఁడవై యుగధర్మము మఱచి యున్నకతమున నమరులు తనివి నొందునటుల మహామునులు యాగములు సేయుచున్నారు. అక్కారణమున ధర్మ మధికమై యున్నయది. దాశరథియును ధర్మవర్తియైన కతమున నాతనికె జయ మవశ్యము గలుగును. నీవును తపముచేఁ గమలాసను మెప్పించి సురాసురాదులచే భయములేకుండ వరములఁ బొందితివి. కాని నరవానరులచేఁ జావకుండఁ గాదుకదా? ఇపుడు విష్ణుఁడు లోకరక్షణార్థమై రఘురాముఁడై జన్మించె. అటుకాదేని మనుజులు సాగరము గట్టఁగలరా! అదియునుగాక మననగరమున మహోత్పాతము లనేకములు పుట్టుచున్నయవి. వృథావిరోధంబుమాని నావచనములవినుము. లోకములు దల్లడిల్ల లంకారాజ్యముసేయుచుఁ బరదారంగొని తెచ్చితిదియనీచేటునకు మూలమగును. కావున జానకిని రాముని కిమ్ము. ఈకుండితేని రాముని గాస్త్రములు నిన్నును నీబాంధవులను దుఃఖవారిధిని ముంచును."

అని పలికె మాల్యవంతుఁ డాతని క్రోధభావము నెఱిఁగి "రావణా! వృద్ధుఁడను గానఁ దెలిసియో తెలియకయో నీకు నిట్లు చెప్పితి" ననుచుండ ఖలుండగు రావణుఁ డామాటల విని యాతనితో "నాదుబలము నిందుఁ డెఱిఁగినఁ జాలును. సముద్రమునకు సేతువు గట్టుటయు నొక పరాక్రమమా? నీవిఁక నిట్టిమాట లాడితివేని మావలన మాన్యుఁడవైనను

సహింపఁజాలను" అనిపలికిన నిరుత్తరుఁడై మాల్యవంతుఁడు తన మందిరమున కేగె.

పదంపడి రావణు వృత్తాంతమ్ము విభీషణుని మంత్రుల వలన రాముఁడెఱిఁగి సువేలాధిరోహణము సేసి లంకఁ గలయఁ గనుఁగొని దానియందమున కచ్చెరువునొందుచు విభీషణునివలన నప్పురమునఁగల విశేషములు సవిశేషముగఁ దెలిసికొనియె. అంతవానరులకును రక్కసులకును సంకులయుద్ధము ప్రవర్తిల్లె. ఇంద్రజిత్తు యుద్ధమున రామలక్ష్మణుల నాగపాశమున బంధించె. రాముఁడాదిపురుషుఁడయ్యును దాను మును బలి బంధించిన ఫలమనుభవింప కేలపాయు నన్నటుల నిల నొఱఁగె. మేఘనాథుఁడు రామలక్ష్మణులు తనచే మృతినొందిరని సంతసమందెను. సీత దుఃఖించుచుండఁ ద్రిజట యామె నూరడించె. అంత రాముఁడు తెలివినొంది తమ్మునిఁగూర్చి దుఃఖించుచుండ నారదమహాముసీంద్రుఁడు రామునకుఁ బ్రత్యక్షమై యాతనిమహిమలఁగొనియాడి నీవాహనమగువైనతేయుఁదలఁచిన నాగపాశంబు లూడునని బోధించె. అంత రాముఁడు సుపర్ణుఁదలఁచిన నాతఁడు దుగ్ధవారాశినుండి యేతెంచె. ఆతని ఱెక్కలచప్పుడు దూరమున నెఱిఁగి భుజగములు భీతిని రాఘవులవిడిచి దూరముగఁజనియెను. వైనతేయుఁడును రామునకు నమస్కరించి యాతని సెలవునకుఁ జనియెను.

## —♦ కుంభకర్ణాదుల మరణము ♦—

పిమ్మటధూమ్రాక్షుఁడును, అకంపనుఁడును విజృంభించి ఘోరముగ సమరముగావించిన వాయునందనుఁడు వారలనంత

మునోందించెను. మహాకాయుఁ డందుచేఁ నీల్గె. రావణుఁడును ప్రథమ యుద్ధంబున రామునిచే నోడింపఁబడి యాతనిఁ దేఱికనుఁ గొనఁజాలక పౌరులు బెదరునట్లు లంకఁజొచ్చి కొంతచింతించి నిర్జరదానవాదులఁ దృణంబుగ నెంచుకుంభకర్ణు నిద్రఁదెలుపు డని. అంత యూపాక్షమహోదరాదులు తదీయశయన గృహ ద్వారమ్ముఁబ్రవేశించివారుదెచ్చినపచ్చిమాంసమునుమేరుపర్వ తోన్నతముగఁ బ్రోవిడి మద్యభాండములను దించి యాతని విజయగీతములఁబఠించిరి. అంతఁదెలియకున్న బొబ్బలు పెట్టి,శంఖ కాహళాది సంకులరావము లొనరించి, వీనులక్రిందఁ బది వేవురు రాక్షసులార్చిరి. అప్పటికిని దెలియకున్న పర్వతశృంగములు పైఁ బడవైచియు రోకళ్ళ మోదియుఁ బిడికిళ్ళఁబొడిచియుదంతావళ ములఁ దొ్రక్కించియు మీసంబుల లాగియు నాసికా రంధ్ర ముల మూసియు నుడికెడు తైలము చెవులలోఁ బోసియు మేలుకొలుప నెట్ట కేలకు నద్దశగ్రీవానుజుఁడు నిదుర సాలించి యావులించి కనులు విచ్చె. అంత రక్కసు లాతనిఁజూచి "అయ్యా! రాఘవులు సముద్రముఁగట్టి మనపుర మాక్రమించి మహాహవ మొనరించుచున్నారు. నేఁడు రావణుఁడు రాము నిచే నోడింపఁబడి యాపరాజయదైన్యము సహింపఁజాలక నిన్ను మేల్కొలుపంబంచె. తక్కిన విశేషము లాతనిచే వినఁ దగును. విచ్చేయుదురుగాక" యనిన నాతఁడు ముఖప్రక్షాళన మాచరించి తనకై తెచ్చిన జంతువుల భుజించి రావణుకడ కేగుచుండ నాతని యాకారము సూచి వానరులు పరుగెత్తు చుండిరి. వానిఁ గనుగొనిఁ రాముఁడు విభీషణునిజూచి 'యిది

యేభూతము? నాకుఁ దెల్పు' మన నాతఁడు "ఇతఁడు కుంభ కర్ణుఁడు. దశగ్రీవు ననుజుఁడు. బ్రహ్మచే నెల్లప్పుడు నిద్రపోవు నటుల వర మొందెను. ఆఱునెలల కొకనాఁడు భోజ నాదులకుఁ దెలియును. అప్పు డితఁ డజేయుఁడై యుండును. నేఁడు నీచే దశాననుఁడు రణరంగమున నోడి యీతని మేల్కొలిపె. నేఁడు జాగరణవినమ్ము కాదు కావున నితఁడును దేవర చేతఁ జచ్చును. వానరులు బెదరకుండ నిదియొక దారు యంత్రమని చాటఁబంపుము"ని చెప్పిన రాము నానతిని నీలుఁ డట్లు కావించెను.

కుంభకర్ణుఁడును రావణు నాస్థానమునఁ జొచ్చి యన్న చరణముల కెరగి యుచితాసనాసీనుఁడయి తన్ను మేల్కొలు పుటకుఁ గారణమడిగెను. రావణుఁడును దాశరథులపరాక్ర మంబుగ్గడించి ప్రహస్తాదుల మరణంబు దెలిపి "మహా బల శాలివగు నీ సహాయముగోరి యిట్లు చేసితి. కావున వానరులఁ జంపి హత శేషులఁ గాపాడు"మనియె.

అన విని కుంభకర్ణుఁడు "అన్నా ! మీఁది కార్యము నే నిదివరకె చెప్పితినిగదా! మోహమునఁ జేసిన ఫల మనుభ వింపక తీరునా?" యని యనేక నీతులు రావణునకుఁ జెప్ప నాతఁడు బొమలు ముడివెట్టుచుఁ "బెద్దవాఁడని యెంచక నాకు

నీతులు బోధించెదవా?" యనిన కుంభకర్ణుఁడు చేతులుజోడించి యన్నంజూచి నారదుఁడు తనకుఁ జెప్పిన వృత్తాంతముఁ దెల్పి రాముఁడు సీత నర్పింపుమని యెంతచెప్పినను వినఁడయ్యెను. అంత నాతని సంతోషపెట్టఁదలఁచి కుంభకర్ణుఁ డన్నతో "మన వారి నందఱ శరాఘ్నుల నేర్చిన రాము నేనోర్చెద. భయపడకు మ"ని భయంకరమగు నొకశూలము గేలఁబూని యుద్ధమున కేతెంచి ప్రళయభైరవాడంబరమున నార్చిన నందఱును రఘు వీరు వెనుక కుంజనిరి. అంత రాముఁడు వారల భయముదీర్చి పురికొలుప వానరులు పర్వతములను వృక్షములను బెఱికియా కుంభకర్ణునిపై వైచిరి. రావణు తమ్ముఁడును తన శూలమున వానినన్నిటిని నడుమనె నఱికివైచుచుండెను. వానరులు పాషాణ పాదప్రహారముల నొంపఁ జలింపక కుంభకర్ణుఁడు వారినందఱఁబట్టి పాతాళసన్నిభంబైన తన కంఠబిలమున దిగ వైచి మ్రింగుచుఁ దప్పిచని నాసాకర్ణకోటరముల వెడలు వారి నొడిచికొని నమలుచుఁ గ్రిందపడిన వారిఁ గాల నేలఁ జమరు చుండె. ఇట్లు ఘోరముగ సమరముసేయుచుఁ దన్నెదిర్చిన సుగ్రీవుని మూపురమునఁ బెట్టుకొని లంకాభిముఖుఁడై రాజ మార్గమునఁ జనుచుండ వానరాధిపుఁడు తన తీవ్రదంతనఖాగ్ర ముల నాతనినాసాకర్ణములఁదెంచి తప్పించుకొని తనసైన్యముఁ జేరె.

కుంభకర్ణుఁడును సిగ్గుచే నన్నకు మొగముసూప వెఱచి రామలక్ష్మణుల వానరుల మ్రింగెదననుచు నేగుదెంచి వానరులతోఁదలపడియె. అ తఱి విభీషణుఁ డందఱఁ దలమీఱి సంగరమున కేతెంచిన,కుంభకర్ణుఁడతనిఁజూచిసంతసించి“తమ్ముఁడా సోదరస్నేహము విడిచి నన్నుఁ గొట్టుము. రాక్షసాన్వయ బీజ మంతరింపకుండ రాము నను గ్రహముచే నీవు లంకనుండఁ గలవు. మన వంశము రక్షించుటకు దాశరథి నాశ్రయించితివి కావునరక్షణీయుండవు. కావునఁదొలఁగిమీయన్నఁజూడుమ” నుచు ననేకప్రకారముల వనచరుల సమయించుచున్న కుంభకర్ణుఁజూచి రాముఁడు “సక్కంచర! నాదెసకురమ్ము! బ్రహ్మాదుల లోకములకుఁ జనినను నినుఁ జంపుదు” నన నాతఁ డిట్లనియెను.

> “వీఁడు కుంభకర్ణుఁడు సుమ్ము; విక్రమంబు
> దూల నీచేతఁబడ విరాధుండు గాఁడు;
> ఖరుఁడు గాఁడు, మారీచుఁడు గాఁడు; మనుజ
> వర! కబంధుండు గాఁ డల్ల వాలి గాఁడు.

ఇదె నీతో సమరము సేయవచ్చితిని. నీయస్త్రసంపదయు నీ వింటినేర్పును జూచి నిన్ను మ్రింగెద.” ఇట్లు కుంభకర్ణుఁడు పైకి రాగ రామచంద్రుండు వాలిని జంపినబాణమ్ము నాతనిపై నేయ వాఁడు గంపింపక గదఁద్రిప్పుచుఁగదియ దాశరథియును వాయవ్యాస్త్రంబుఁ గొని వలచేయి దునుమ నదియు సింహనాదంబుతో నచటికపుల రూపడంగ గదతోఁబడియె.

ఇట్లతఁడు వికలహస్తుఁడై యొక్క చేతితో నొక్క సాలంబు పెటికి యాభీలాకృతితోడఁబఱతేర రాముఁడైంద్రమున నాహస్తము దునిమి వెంటనె రెండర్ధచంద్రబాణముల రెండుకాళ్ళు దునిమి యామ్యాస్త్రముచేఁ బర్వతకూటనిభంబైన యాతని తల ద్రుంప నదియు లంకాపురహర్మ్యంబులఁ ద్రొక్కికొనుచు జలధి మునిఁగె. కోటివానరులు పుడమిఁ జదియ నాతని కాయంబును నాభీలారావముతోడఁ నేలపైఁ బడియె. అంత హతశేషులగు రక్కసు లత్యంతభయమ్ముతోడలంకకుఁ బాఱిరి. కుంభకర్ణు మరణమునకు రావణుఁడును శోకించెను.

పిమ్మట దేవాంతక నరాంతక మహాపార్శ్వాదులును రోషమున సంగర మొనర్చిన నంగదాదులు వారి మడియించిరి. అతికాయుని లక్ష్మణుఁడు చంప నింద్రజిత్తు బ్రహ్మాస్త్రంబుచే రామలక్ష్మణుల మూర్ఛనొందించె. అంత హనుమంతుఁడు జాంబవంతు నుపదేశమున సంజీవినిఁదెచ్చి వారలఁబున ర్జీవితులఁజేసిన వానరులు లంకఁగాల్చి యకంపనాదులఁజంపిరి. పదంపడి సుగ్రీవుండు కుంభుని హనుమంతుఁడు నికుంభునిఁ బరి మార్చిరి. మకరాక్షుఁడు రామునిచేఁ జచ్చె. ఇంద్రజిత్తుని లక్ష్మణుఁడు దునమె. రావణు శక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛ నొందినఁ గ్రమ్మఱ సంజీవిని గొనివచ్చి హనుమంతుఁ డాతని బ్రతికించె.

—♦ మండోదరి రావణునకు బుద్ధి సెప్పుట ♦—

రావణుఁడు దనసుతులును, సోదరులును, హితులును భటులును సమసిన, శుక్రాచార్యుతో యోజించి జయమునకై

పాతాళహోమంబు సేయఁదొడఁగిన నదియు నంగదాదులచే భంగంబునొందె. అక్కారణమున మండోదరి దుఃఖించుచుండ దశాననుఁ డమ్మగువఁ జూచి "మగువా! నేఁడు రాఘవుఁ జంపుదు. లేదా యాతనిచేఁ జత్తును. ఇది నిక్కము. నే రణమునఁజచ్చితి నేని నీవు సీతవధించి యగ్నిప్రవేశము సేయు మ"నిన మండోదరి ప్రాణేశుఁజూచి "నాథా! నీవు పూజ్యుఁడగు రాముని రణభూమిలో గెలువఁజాలవు. అతఁడు దుష్టులఁగన్న సహింపఁడు. మహానుభావుఁడగునతని గెలువమిక్కుటికైనను నలవిగాదు. అమ్మహాత్ముండు మత్స్యంబై శ్రుతిచోరుఁడగు సోమకుఁజంపె. కమఠాకారముదాల్చి మందరనగమ్ము వీపున ధరించి సురల కమృతమొసంగె. వరాహరూపమున హిర ణ్యాక్షుఁజంపి జలాంతర్మగ్నయైన ధారుణి నుద్ధరించె. నరకే సరియై హిరణ్యకశిపు వధించి ప్రహ్లాదు నుత్తమశీలుగాఁ నించె. వామనుఁడై బలి మర్దించె. పరశురాముఁడై తనకుఠారమున దుర్మదాంధులగు రాజుల నవలీలఁ దునుమాడె. ఇప్పుడునిన్ను జంప దశరథసుతుఁడై జనియించె. అతఁడు పిన్ననాఁడె విశ్వా మిత్రు యాగంబు గాచి తాటకఁదునిమి, మారీచుఁ బాఱద్రోలి సుబాహునిఁగూల్చె. ఇదియు నీవె యెఱుంగుదువు. మఱియు నెవ్వారును సజ్యంబుగాఁ జేయఁజాలని శివునివిల్లు ద్రుంచి సీతఁబెండ్లియాడె. నిన్ను చెఱసాలఁ జొన్పిన కార్తవీర్యుని గూల్చిన పరశురాముని నాజి భంగపఱచెను. జనకు నియోగ మున దండకాటవి సొచ్చి ఖరదూషణాదుల వధించె. వాలిఁ జంపి సుగ్రీవునకుఁ గిష్కింధఁ బట్టంబుగట్టినట్లు నినుఁ జంపి

లంకారాజ్యము విభీషణున కిచ్చును. శలభంబువలె వాని బాణాగ్నిం బడి యేలకాలెదవు? సీత రామున కిచ్చి మన రాజ్యము నొసఁగి భోగములుమాని కానల తపము సలుపుద మ"నెను. రావణుఁ డాత తన భార్యఁజూచి "ఏల యిట్లు చింతిల్లెదు? పరమార్థ మొక్కటి సెప్పెద వినుము.

"ఎఱుఁగుదు పద్మబాంధవకులేశుఁడు పంకజనాభుఁడౌట; యే
నెఱుఁగుదు మున్న యిందిర మహీసుతయై తనరారు సీతగా;
నెఱుఁగుదు నాకు రాఘవమహీశుని చేత వధక్రమంబు; ని
క్కెఱిఁగియు ముక్తినొందఁగ నభీష్టముగల్గుట నింత చేసితిన్."

అని యనెను.

## —♦ రావణుని మరణము ♦—

ఇట్లని యుద్ధసన్నద్ధుఁడై రథంబెక్కి రామునితో సంగర మొనర్చు రావణుని, పృథివినిఁ బదాతియై యరిభీకరుఁడై యని నిల్చిన రామునిఁ జూచి సురేంద్రుఁడు దయార్ద్రచిత్తుఁడై తన సారథియగు మాతలిఁ జూచి "దేవహితమ్ముఁ గోరి రాముఁడు దైత్యభర్తతోడ రణంబు సేయుచున్నవాఁడు. కావున నీవు వేగమె మన యరదము రాముకడకుఁ గొనిపొమ్మ"నియాన తిచ్చిన నాతఁడును నవరత్నశోభితమగు నరదము జవమునఁ గొనివచ్చి, రామునకు సమర్పించిన నాతఁడును విభీషణునను మతిని నద్దివ్యశతాంగంబు నారోహణముసేసె. రామరావణులయుద్ధమ్ము సూడఁగోరి నాకవాసులు కుతూహలమునఁ జనుఁదెంచిరి.

అమ్మహాసంగరమున రావణుఁడు రామునిపై గాంధర్వా స్త్రంబునేసిన రాఘవుఁడును బ్రతివిశిఖమున దానిఁ బొడిసేసె. రాక్షసేంద్రుఁడు రాక్షసబాణము బ్రయోగింప వైష్ణవాస్త్ర మున రాఘవుఁడు దాని నడఁచె. దోషాచరుఁడు సర్పబాణ మేయ దాశరథియు గరుడాస్త్రమున దాని శాంతము నొందించె. దశాననుఁడు వారుణాస్త్ర మేయ దశరథాత్మ జుఁడు వాయవ్యాస్త్రమున దాని నాశనమొనర్చె.

ఇట్లయ్యిరువురును బరస్పరకాంక్షఁ బోరుసలుపుచుండ నగస్త్యుఁడను మునీంద్రుఁడు రామునికడ కేతెంచి యాతని ననేకవిధముల స్తుతించి "రామా! నీవు సర్వజ్ఞుఁడవయ్యు మానుషభావమున నెఱుఁగమి దాల్చుచున్నవాఁడవు. నేను నీకొక్కటి యుపదేశించెదననుట బేలతనమైననుసకలలోక హితంబుగోరి శుభముల నొసఁగు 'నాదిత్యహృదయ' మను పుణ్యమహాస్తవం బుపదేశించెద. దాని సాదరముగఁ బఠిం పుము. నీకు జయముసమకూరున"ని దానినుపదేశించియరిగె. అంత రాముఁడు దానిపఠించి, నిశితాస్త్రములఁబ్రయోగించిన రావణు శిరములును బాహువులును దెగిపడియు నెత్తురును నొప్పియుఁ గానరాక వెంటనే మొలచుచుండెను. అక్కార ణమున నినకులాధీశుఁడు దైత్యభర్తఁగూల్పనుపాయముగానక విన్నఁబోయి యలసియున్నఁజూచి, వినతుఁడగుచువిభీషణుఁడు వానికిట్లనియె. "రామచంద్రా! బ్రహ్మవరముచే వీని నాభియం దమృతముకుండలాకృతినున్నది. అక్కారణమున నీచేఁదెగియు శిరములును హస్తములును మరలఁబుట్టుచున్నవి. కావుననాభి

ప్రదేశమున నగ్నిబాణము వైచిన నచ్చటియమృత మింకును. అంతట మదమాంసములు దూలిన నిశితాస్త్రముల నూట తొమ్మిదిమారులు కరములును, శిరములును ద్రుంచిన నద్దనుజాధిపుఁడు సావఁగలఁడు.'' ఇట్లు విభీషణుఁడు చెప్పిన రాముఁ డాగ్నేయాస్త్రంబు మంత్రపూర్వకముగా సంధించి తదీయ నాభీగతమగు నమృతముఁ దదనలమున కాహుతిఁ జేసి నూటతొమ్మిదిమారులు దలలును జేతులును నశ్రమ మున దునిమిన రక్తసిక్తమగు నారాక్షసేంద్రునిశరీరము రవి మండలముక్రియ నొక్కశిరమున నొప్పుచుండినను నతఁడు ధైర్యమవలంబించి రాముపై ననేకవిశిఖముల నేయుచుండె. అత్తఱి మాతలి రామునిఁ జూచి "మానవనాథా! యీ దురాత్ముని నాలస్యముసేయక చంపుము. తొల్లింటి యట్ల శిరములును జేతులును మొలచునేమో? బ్రహ్మాస్త్రమున వానిఁదెగటార్పుమ"న దాశరథియు బ్రహ్మాస్త్రమును భక్తి తోఁ దలఁచి సురలు సంతసించునట్టుల రావణుపై నేయ నదియు రావణు నురంబుదూరి తదీయప్రాణములఁ గ్రోలుచుఁ బుత్త్రియగుసీతనిమిత్తము వగుచు వసుమతికి రాక్షసాధముని వధించితినని చెప్పఁబోవు పగిది నిల భేదించుకొని పాతాళంబు సొచ్చి నిమిషమాత్రమున, గ్రమ్మఱి రాము తూణీరము సొచ్చె. రామబాణక్షతంబుల రుధిరధారలొలుక నింద్రునివజ్రంబుచే నేలఁగూలిన కులపర్వతముమాడ్కి

రావణుఁ డాక్రిందన మొనర్చుచు భూతలపతితుఁడయి యసువులఁ దొఱఁగెను.

ఇట్లు జయవిజయులు ద్వితీయజన్మమున రావణకుంభకర్ణులై జనియించి మించిన విష్ణుఁడు రామావతారమెత్తి వారల సంత మొందించెను.

# మూడవ భాగము

—♦ శిశుపాల దంతవక్త్రిల జననము ♦—

చేదిదేశమున దమఘోషుఁ డనురాజు కలఁడు. వానికి సాత్వతియందు శిశుపాల దంతవక్త్రిలను నిరువురు పుత్త్రిలు జనియించిరి. అందుఁ బెద్దవాఁడగు శిశుపాలుఁడు చతుర్భుజ లలాట నేత్రములతో నుదయించి రాసభరవమున నేడ్చుచున్నఁ జూచి తల్లిదండ్రిలు భయవిస్మయాధీన మానసులై యుండ వారికి నొక్క యశరీరభూతము "వీని నితరులుసంపఁ జాలరు. ఇతరు లెవ్వరు వీని నెత్తికొన్న యధికముగనున్నభుజములును మిగిలిన కన్నును నడఁగిపోవునో యాతనిచే నితఁడు మరణమొందున" నెను. అయ్యశరీరి వచనములకు వారలాశ్చర్యమనస్కులై యాకుమారులఁ జూడవచ్చినవారిచేతికెల్ల వాని నెత్తికొన నిచ్చుచుండిరి.

ఇట్లుండ నొక్కనాఁడు రామకృష్ణులఖిలసుహృద్బాంధవ మంత్రిసమేతులై యతివికృతస్వరూపధరుఁడైన యాబాలునిఁ దమమేనత్తయగు సాత్వతినిఁ జూడఁగోరి చేదివిభునిపురమున కేగిరి. మేనత్తయగు సాత్వతియు నబ్బాలుని మొదట బలభద్రిచేతికి నెత్తుకొననిచ్చి యనంతరముకృష్ణుచేతికి నెత్తుకొన నిచ్చెను. కమలనాభుఁడాకుమారు నెత్తుకొనుడు నందఱాశ్చర్యపడి చూచుచుండఁగ నధికముగనున్న చేతులును నధికమగు నేత్రమును గ్రక్కున నడంగెను. సాత్వతియు నద్భుతచిత్తయై

యశరీరవాణి పలుకులనప్పుడు దలఁచి తన నందనునకు మురవైరివలన మరణమగుట యెఱిఁగి "నాపుత్త్రుఁడు నీతిలేక దుష్టమార్గవర్తియై నీకపకారము సేయుచున్నను దయామయుఁడవై నీ మఱఁదికి నపరాధశతముల సైపుమ"ని తన మేనల్లుఁడగు జనార్దనుఁ బ్రార్థించెను. కృష్ణుండును నందులకు సమ్మతించుటచే శతాపరాధములు నిండునంతకు నితఁడన్యులచే వధింపఁబడక కృష్ణునిచే నంతము నొందవలసెను.

—♦ శిశుపాలునికి శ్రీకృష్ణునియందుఁగల విరోధకారణము ♦—

కుండినపురాధీశుఁడగు భీష్మకుఁడను రాజునకు రుక్మిణి యను పుత్త్రికారత్నము గలదు. అయ్యిందువదన తనయుల ప్రాయమునఁ దన తండ్రి గేహమున కేతెంచు నతిథి జనుల వలనఁ గృష్ణుని రూపబలగుణాదుల విని కృష్ణుఁడే తనకు దగిన విభుఁడని యెంచె. ఆలలనామణి రూపగుణశీలములఁ జింతించి యా జనార్దనుఁడును నామెఁ బరిణయమాడఁగోరి యుండెను. బంధువులందఱును గృష్ణునకు రుక్మిణి నీయఁగోరి యుత్సాహభరితులై యుండ నామె పెద్దన్నయగు రుక్మి వివేకహీనుఁడై యా సుదతిని శిశుపాలుని కీఁదలంచెను.

అంత రుక్మిణి యాతని యింగితమెఱిఁగి తనకాప్తుఁడగు నొక బ్రాహ్మణు నగ్నిద్యోతనుఁడనువానిఁ జీరి కొన్ని రహస్యవచనములు సెప్పి ద్వారకానగరమునకుఁబంపెను. ఆతఁడును గృష్ణుఁగని యాశీర్వదించి సవినయముగ "దేవా! విదర్భాధీశుఁడగు భీష్మకుఁడను రాజుఁగలఁడు. ఆరాజుకూఁతురు రుక్మిణియను కన్యకామణిగలదు. ఆచంద్రముఖి నిన్ను వివాహ

మాడఁగోరి యొక్క సందేశము విన్నవింపుమని నన్నుఁబంపె వినుము.

> "శ్రీయుతమూర్తి యో పురుషసింహమ సింహము పాలిసొమ్ము గో
> మాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీపదాంబుజ
> ధ్యాయినియైన నన్ను వడిఁ దాఁగొనిపోయెద నంచునున్న వాఁ
> డాయధమాధముం డెఱుఁగ డద్భుతమైన భవత్ప్రతాపమున్."

కావున నీవు చతురంగబలముతోడ నెల్లి యేతెంచి శిశుపాలాదుల సంగరరంగమున జయించి రాక్షసవివాహమ్మున నన్నుఁ గొనిపొమ్ము, వచ్చెదను. అంతిపురముననుండు నన్ను గొనిపోవుట యసాధ్యమని దలఁచితివేని యుపాయముసెప్పెద వినుము. పెండ్లికిముందు భవానికిఁ బూజసేయ నన్ను మావారు గౌరియాలయమునకుఁ బంపుదురు. నేనును గౌరిని బూజించి మా గృహమున కేగు సమయమున నీ వేతెంచి నన్నుఁగొనిపొమ్మ"ని చెప్పెనని రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశమును ఆపె రూపసౌందర్యాది విశేషములును బ్రాహ్మణుఁడు హరికి విన్నవించిన నయ్యాదవేంద్రుఁ డిట్లనియె.

> "కన్నియమీఁద నాతలఁపు గాఢము; కూరుకు రాదు రేయి నా
> కెన్నఁడు, నావివాహము సహింపక రుక్మి దలంచు కీడు; నే
> మున్నె యెఱుంగుదుం బరుల మూఁక వధించి కుమారిఁదెత్తు; వి
> ద్వన్నుత మ్రాఁకుఁద్రచ్చి నవవహ్నిశిఖన్ వడిదెచ్చుకైవడిన్.
>
> వచ్చెద విదర్భభూమికిఁ జొచ్చెద భీష్మకునిపురము సురుచిరలీలన్
> దెచ్చెద బాలన్ వ్రేల్మిడి వచ్చెద నడ్డంబు రిపులు వచ్చినఁబోరన్."

అనిపలికి రుక్మిణీదేవి పెండ్లినక్షత్రంబు దెలిసికొని రథమెక్కి యాభూసురు వీడ్కొల్పి తానును బంధువులతోడ విదర్భ దేశమునకుఁ జనియె.

అందు భీష్మకుఁడు కొడుకునకు వశుఁడై తనకూతు శిశుపాలున కిత్తునని శోభనోద్యోగములు సేయించె. అంతఁ జైద్యుఁడు వైదర్భిం గైకొనఁగనంచుఁ గడుగర్వమున నవ్వీటి కేతెంచెను. రామకృష్ణులు బంధులఁగూడివచ్చినను బోలుఁ దోలి శిశుపాలునకె యమ్మానినిఁగూర్చెదమంచు జరాసంధుఁడును, దంతవక్త్రుండును, సాల్వ,విదూరక, పౌండ్రకాదులును జనుదెంచిరి. భీష్మకుఁడును శిశుపాలు నెదుర్కొని పూజించి యొక గృహమున నతని విడియించె.

రుక్మిణీదేవియు హరిరాక కెదురుచూచుచుండ నామెచేఁ బంపఁబడిన భూసురోత్తముఁ డేతెంచి రుక్మిణిఁ గనుఁగొని "నీగుణోన్నతికి మెచ్చి నాకపరిమితధన మొసఁగి చక్రి యిదె వచ్చుచున్నాఁడు. నీతపంబు ఫలించె"నని చెప్పిన నాకాంతామణియు నాతనికంజలిగావించి యాతని మహిమఁ గొనియాడె.

రామకృష్ణులు తనకూఁతునివివాహమునకువచ్చుటవిని భీష్మకుఁడు తూర్యఘోషములతో వారి నెదుర్కొని సకల సంపత్పరిపూర్ణములైన నివేశములు కల్పించి విడియించి పూజించెను. అప్పుడు విదర్భపురప్రజలు హరిరాక వినివచ్చి యాతనిఁజూచి

"తగు నీచక్రి విదర్భరాజసుతకున్ దథ్యంబు వైదర్భియుం
దగు నీచక్రికి నింతమంచి దగునే దాంపత్య మీయిద్దఱిం
దగులంగట్టిన బ్రహ్మ నేర్పరిగదా దర్పాహతారాతియై
మగఁడౌఁగావుతఁ జక్రి యీరమణికిన్ మాపుణ్యమూలంబునన్."

అని పలికిరి. ఆ సమయమున రుక్మిణీదేవి యుమామహేశులఁ గూర్చి తనకుఁ గృష్ణుఁ బతి సేయుమని ప్రార్థించి యిందుధర సుందరీమందిరంబు వెలువడి గృహమున కేతెంచుచుండ నామె సౌందర్యంబుఁగని యందఱు విభ్రాంతాత్ములైరి. రుక్మిణియు జగన్మోహనుఁడగు చక్రిఁగని రథారోహణముఁ గోరుచుండెను. అంతఁ గృష్ణుఁడు నిఖిలభూపాలగణంబుల గణింపక తృణీకరించి రాజకన్యం దెచ్చి తన రథంబుపై నిడికొని శంఖంబుపూరించుచు సన్నతోడ నడువ యాదవవాహినీ పరివృతుఁడై ద్వారకానగరమార్గముపట్టి చనియె.

శిశుపాలుఁడును నాలిఁ గోల్పడిన వాని చందమున నొక్కచో వగచుచుండ జరాసంధాదు లాతని నోదార్చి యాతఁడు బ్రతికియుండుటకు సంతసించి వానికి "దేహధారి స్వతంత్రుఁడు గాఁడనియు, జంత్రగాని చేతి జంత్రపుబొమ్మ కైవడి నీశ్వరతంత్రి పరాధీనుఁడయి యుండుననియు, దైవ నియుక్తమైన కాలమునఁ జేసి లోకములు పరిభ్రమించు ననియు, మంచికాలము ప్రాపమైన మనము కృష్ణుజయింతుము" మనియు బోధించి యాతని పరితాపము నివారించి తమ దేశములకుఁ జనిరి. నాటంగోలె శిశుపాలుఁడు వాసుదేవుని యందు వైరము పూనియుండె. ఇట్లు కొంతకాలము జరుగుచుండెను.

—♦ ధర్మజ రాజసూయము ♦—

పూర్వము మయుఁడు ఖాండవదహనమున నర్జునునిచే రక్షింపఁబడి తనదు శిల్పకుశలత్వమేర్పడ దేవతావిమానంబునకు సాటియనఁదగు నొక్కసభ నిర్మించి యెనిమిదివేల రాక్షస కింకరులచే మోపించికొనివచ్చి ధర్మరాజున కొసఁగె. పాండవాగ్రజుఁడును దైవజ్ఞ దత్తముహూర్తమున నాసభాప్రవేశము సేసి మార్కండేయాది మహామునులచేఁ బుణ్యకథలు వినుచుఁ దమ్ములతోఁ దాను సుఖముగ నుండెను.

ఇట్లుండ నొక్కనాఁడు ప్రభాకర తేజుఁడగు నారద మునీంద్రుఁడు పాండవాగ్రజు గృహమున కేతెంచినఁ దమ్ములును దానును నాతని విధ్యుక్తముగఁబూజించి యున్నతాసనమున నునుచిన నమ్మహాత్ముఁడు వారలకు రాజనీతి విషయములఁ గొన్నిఁటిని దెల్పి యుధిష్ఠిరుఁజూచి "పాండవాగ్రజా! వినుము. రాజలోకమున వైవస్వత సభనుండు మీ జనకుఁడగు పాండు మహారాజు నన్నుఁ జూచి 'మునీంద్రా ! నీవు భూలోకమున కేగి, నాయగ్రసూనుతో రాజసూయ మొనర్చిన వారు హరిశ్చంద్రునివలె నింద్రలోకమున మహా వైభవముతో నుందురు; కావునఁ దమ్ముల బాహుబలంబు పెంపున రాజసూయంబు సేయుమని బోధింపుము. అట్లయిన నాకు నాకలోక సుఖప్రాప్తి కలుగును' అని పలికెను. కావున నప్పాండురాజు వచనములు నీ కెఱిఁగింప వచ్చితిని. నీవును రాజసూయముసేసి, నీ పితృగణము నింద్రుసభ నుండఁజేయుమ"ని చెప్పి తనత్రోవఁ జనియె.

అంత ధర్మరాజు తనతమ్ములఁజూచి "పితృసంకల్పము సేయుట సుతులకుఁగర్తవ్యము. అయిన నిది నిర్విఘ్నముగ సమాప్తినొందినఁ బ్రజాసంహృతిగలుగునను శంకయుగలదు. కావున నేనేమిసేయుదున"ని డోలాయమాన మానసుఁడైయున్న ధర్మరాజునకు ధౌమ్యాదు లిట్లనిరి: "రాజా! రాజసూయము సేసితివేని దోషములువాసి సర్వసంపదలు లభించును. రాజులందఱును భవత్ప్రీత్యావనిర్జ్ఞేయులగుదుర"ని చెప్పినఁ దమ్ములును నట్లె సెప్పిరి.

ధర్మజుఁడును రాజసూయముసేయ సమకట్టి దాని నిర్విఘ్నముగ నిర్వహించుటకై జగద్ధితంబుగ మర్త్యలోకమునఁజనియించిన యాదిపురుషుఁడగు వాసుదేవుఁడె యోపునుగాని యన్యులకశక్యమనియెంచి యాతనిరావించి నారదుసందేశము విన్నవించినఁ జక్రియు నాతనిఁజూచి "రాజసూయమహాధ్వరమునకు ననుజుల బలిమిచే నీవయర్హుఁడవ"ని చెప్పి తన విరోధియు మదాంధుఁడునగు జరాసంధుని భీమునిచేఁ జంపించెను.

పిమ్మట ధర్మజుపంపున భీమసేనుఁడు పూర్వదిగ్విజయమును అర్జునుఁ డుత్తరదిగ్విజయమును సహదేవుఁడు దక్షిణదిగ్విజయమును నకులుఁడు పశ్చిమదిగ్విజయమునుజేసి యమితధనరత్నరాసులఁగొనివచ్చిరి. విరాట, ద్రుపద, శిశుపాల, గాంధార రాజులను నానాదేశాధిశులును వేదవేదాంగ విదులైన యగ్రజన్ములును స్వకర్మనిరతులయిన వైశ్య శూద్రులును నాయాగమున కేతెంచిరి. మఱియు నమ్మఖంబునకు గజపురము నుండి భీష్మాది బంధుజనులును జనుదెంచిరి.

అప్పుడు ధర్మరాజు సువర్ణ రజతరత్న దాన విషయము లందుఁ గృపాచార్యునిఁ గృతాకృత పరిజ్ఞానమునందు భీష్మ ద్రోణులను సకలవస్తువ్యయమునందు విదురుని నానాదేశా ధీశులు దెచ్చియిచ్చిన యుపాయనంబులఁ గైకొన దుర్యోధనుని భక్ష్యభోజ్యాది వినియోగమునందు దుశ్శాసనుని నియోగించి తాను యజ్ఞదీక్షితుఁడై యజ్ఞశాల కరిగె.

అందు బ్రహ్మర్షి పరివేష్టితుఁడయిన బ్రహ్మవలె పాండ వాగ్రజుఁడు బ్రహ్మవిదులయిన బ్రాహ్మణసత్తములచేఁ బరి వేష్టితుఁడై యెంతయు నొప్పియుండెను. అచ్చోట నితర నాదంబు లెవ్వియు వినఁబడక వేదనినాదములును వాదిత్ర మహానాదములును జెలఁగుచుండెను. కురుపితామహుఁడగు భీష్ముఁడా క్రతువు సూచి సంతుష్టుఁడై యత్యంత ధర్మమతి యగు నంతకతనూజుంజూచి "ధర్మనందనా! సద్గురుఁడును, ఋత్విజుఁడును, భూతలేశుండును, నిష్టుఁడును, పూజనీయుఁడు నగువాని సద్గుణగరిష్ఠుని నొక్కనిఁ బూజితుఁ జేయుమ"నియె. అట్టివాఁ డెవ్వఁడో తన కెఱింగింపుమని యడిగిన ధర్మరాజుం జూచి శాంతనవుఁ డిట్లనియె. "ఎవ్వాఁడు భూభారమువాప లీలాగృహీతశరీరుఁడై యదువంశమునను దయించెనో, ఎవ్వాఁడు సంతసించిన సకలభూతములు సంతసించునో యెవ్వాఁ డఖిల లోకపూజ్యుడో యట్టి శ్రీకృష్ణుఁ బూజింపుము. అతండె యగ్రపూజార్హుఁడు. అతని నర్చించిన నీయజ్ఞము సఫలమగును" అని పలుకఁ బితామహువాక్యముల నాదరించి సహదేవునొవ

నీతంబగు నర్ఘ్యంబు లోకపావనుఁడగు వాసుదేవునకు విధ్యుక్తప్రకారమున ధర్మనందనుఁ డిచ్చెను.

—♦ శిశుపాలుఁడు శ్రీకృష్ణు నాక్షేపించి యాతనిచేఁ జచ్చుట ♦—

దానిఁజూచిసహింపక శిశుపాలుఁ డధోక్షజు నాక్షేపించుచు ధర్మరాజుఁజూచి "ధర్మనందనా ! భూమీశులును బూజ్యులగు భూసురోత్తములు ననేకు లుండ గాంగేయు దుర్వ్యవసాయమునఁ గష్టచరితుఁడగుకృష్ణుఁబూజించి నీయవివేక మందఱికి నెఱిఁగించితివి. విచారవిదూరుఁడగు భీష్ముఁడును వెడఁగుదనమున నుత్తములనేకులుండ జడుండగు వాసుదేవునకుఁ బూజనిమ్మనియె. వృద్ధుల బుద్ధులు సంచలింపకుండునా? తమకిష్టులున్నయెడలఁ గోరిన ధనములనిచ్చి వారి యభీష్టముల నెరవేరురుగాని మహాత్ములగు భూపతులును బూజార్హులగు భూసురోత్తములు నుండు సభను బూజావిధికనర్హుఁడగు నచ్యుతునిఁ బూజించుట పాడియగునా? వృద్ధుఁడగు వాసుదేవుఁడును ఋత్విజుఁడగు వ్యాసుఁడును నాచార్యులగు కృపద్రోణులునుండ భీష్మపలుకులచే బేలవయి పూజ్యులగు వారి పూజింపనొల్లక జనార్దనుఁ బూజించితివి. ఒకవేళ భూపతియని పూజించితి వనుకొన్నను, యయాతిశాపముచే యాదవులు రాజులు కారుగదా? రాజులందఱిలో యుధిష్ఠిరుఁడు పూజ్యుఁడని లోకులు నీగుణాళిఁ బ్రకటింపనది యథార్థంబని యెంచి నృపాలు రందఱును నీ జన్నమునకేతెంచిన, నిండఱి నిట్లవజ్ఞసేయుట ధర్మమగునా ? వివేకము

లేక నీవు వాసుదేవునకర్ఘ్యమిచ్చిన నాతఁడయినను నాకిది తగ దని చెప్పక లజ్జావిహీనుఁడై పూజఁ గైకొను టుచితమగునా ?

"చనఁబేడికి దారక్రియయును జెవిటికి మధురగీతియును జీకునక
త్యనుపమసురూపదర్శనమును జేయుటఁబోలుఁ గృష్ణుఁబూజించుటిలన్.
"ఈ యవనీశ్వరప్రవరు లిందఱు నిన్ను నగంగ నిట్లుగాఁ
జేయుదె ధర్మరాజను విశేషసమాఖ్య నిరర్థకంబుగా
ధీయుత" యంచు ధర్మజనదీసుతకృష్ణుల నెగ్గులాడుచుం
బోయె సదంబు వెల్వడి సపుత్త్రబలుండయి చైద్యుఁడల్కతోన్.

యుధిష్ఠిరుఁడును శిశుపాలుపిఱుందనచనియాతనిమంచి మాటలనోదార్చుచు నాతనితో "ధీరులును, బుద్ధిమంతులునగు రాజోత్తములకువాక్పారుష్యముతగునా? అదివిషముకంటెను దహనముకంటెను మిగుల దారుణము. సృష్టికర్తయగుబ్రహ్మ యుదయమునకుఁ గారణమైనవాఁడును వేదాదిసమస్తవిద్యలఁ బ్రశంసితుఁడయినవాఁడును త్రిలోకపూజ్యుఁడునగుట యెఱిఁగి గాంగేయుఁడు మాధవుఁడు పూజార్హుఁడని చెప్పె. లోక పావనుఁడగు భీష్మునకుఁ దెలిసినట్లు కృష్ణునిప్రభావము నీకెట్లు దెలియును? ఎచ్చోటనయినను నార్యులచరితంబల్పులకు నెఱుఁ గంగ శక్యమగునా? నీకంటెఁ బెద్దలగు భూపతులు జగదేక వీరుఁడని యచ్యుతునర్చన కానంటింపఁ గాదన నీకుఁదగునా? యని పలుకుచున్న వానిఁగాంచి భీష్ముఁడు "పాండవాగ్రజా! దుర్ణయుఁడగు శిశుపాలుఁడు బాలుఁడు. అకారణముగఁ బెద్దలఁ నవమానించుటయె యాతనికి సహజగుణము. రాగకోప పరిభూత మనస్కుఁడును, అల్పరాజ్యమదాంధుఁడు నగువీనికిఁ

ధర్మ మెట్లు గనగును?” అని వాని వారించి శిశుపాలునిఁ జూచి యిట్లనియె. “శిశుపాలా ! మూర్ఖ ! వివేకహీనుండవై కృష్ణుఁడు పూజార్హుఁడు గాఁడని పలికితివి. సభాస్థితులగు నీయవనిపాలురందఱు నాతనిచే నాహవజితులై యాతని శరణార్థులుగాక యితరు లెవ్వరో చెప్పుము. అదియునుగాక

ఉత్తమజ్ఞానవృద్ధునా నుండెనేని
బాలుఁడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు;
క్షత్రియుండు పూజ్యుండు విక్రమసమృద్ధి
నుర్విపతులలో నధికుఁడై యుండెనేని.

“ ఈ రెండు కారణములచే జగదాధారుఁడగు మురారియే యర్ఘ్యమున కర్హుఁడు. ఇచ్చోటనె కాదు, ముజ్జగముల నాతఁడె యారాధ్యుఁడు. వృద్ధు లొక లక్షయున్నను సద్గుణగరిష్ఠులె మాననీయులు. కావున నీ రాజులలోఁ ద్రివిక్రముఁడె గుణవృద్ధని భక్తితోఁ బూజయొనర్చితిమి. ఇతరులు పూజితులై తృప్తులగుదురు. దామోదరుఁడు పూజితుఁడగుడుఁ బుణ్యాదిశయమున లోకత్రయము పూజితమయి తృప్తిఁబొందును. పంచభూతములును, నఖిలదిశలునుజంద్రసూర్యులును దానయై తన దివ్యమహిమచేఁ జరాచరాత్మకమైన భూతప్రపంచముఁ దాల్చిన సర్వవంద్యుఁడగు శ్రీకృష్ణునిఁ దత్వవిదులగు మహాయోగులెఱిఁగినట్లు నీకెఱుఁగ నలవియగునా ?” ఇట్లనుచున్న సమయమున బుద్ధిమంతుఁడగు సహదేవుఁడు సభాసదులఁజూచి “పూజార్హుఁడని జనార్దనున కర్ఘ్యమిచ్చితిమి. దీనికొడఁబడమని చెడ్డతనమునఁ బలుకు వీరులపై నిదె నాచరణ మిడిమెద”

వనిపలికిన సభాసదులెంతయు భీతచిత్తులై యేమియుఁ బలుక కుండిరి. తత్సమయమున సహదేవుపై పుష్పవర్షము గురిసె. సభాసదులు విస్మయాకులితమానసులైరి. కలహాబంధుఁడగు నారదమునీంద్రుఁడు తనకుం జెయుఁ గృష్ణమృగాజినమును బలుమఱు వీచుచు వేడుకతో నాడెను.

అత్తఱి శిశుపాలుని సేనాధిపతి సునీథుఁడనువాఁ డతి రోషపరుషవచనుఁడగుచు స్వపక్షక్షత్రియులనెల్లనొక్కెడఁ జేర్చికొని చైద్యుననుమతిని యుద్ధసన్నద్ధుఁడైయున్నసమ యమున వేగముగ నటునిటుఁ బరుగెత్తుచున్న తురంగము లను తరంగములచేతను, మదపుటేనుఁగులను మొసళ్ళచేతను, భీకరసైనికులను మత్స్యములచేతను, భయంకరమైన యాదవ వాహిని నిర్దయతరరోషమారుతసమీరితమై క్షణములోఁ గలంగెను.

అట్టి సకలక్షత్రియ క్షోభము సూచి భయసంభ్రమా క్రాంతహృదయుఁడై ధర్మరాజు భీష్మునిఁజూచి "పితామహా! ఇత్తఱి భూమిఁగల క్షత్రియులందఱును ప్రళయకాలపారా వారంబుల మాడ్కిఁ గలంగిరి. నా జన్నమున కేవిఘ్నము గలుగకుండ, వీరలకుఁ జిత్తశాంతి యొనర్పు"మని ప్రార్థించిన ధర్మరాజుంజూచి భీష్ముఁడు "యుధిష్ఠిరా! దైత్యాంతకుఁడగు నారాయణుఁడు నీయజ్ఞమునకు రక్షకుఁడైయుండ నొరు లెవ్వారు విఘ్నము సేయఁజాలుదురు? చైద్యునికై ఘూనియుద్ధ సన్నద్ధులైయున్న యీశిశుపాల ప్రముఖ భూపతు లంద ఱా హరి యల్గినూచనేని యప్పుడెట్లయ్యెదరో చూతము. మత్తేభ

కుంభవిదళనవిష్ఠురనఖముఖమగు హార్యక్షంబుపై శునకములనేకములయ్యును నేమిసేయఁగలవు? ఎల్లవారును సింహపరాక్రముఁడగు కృష్ణునెఱుఁగరా?"యనిన నప్పలుకులు శిశుపాలునకుఁ గర్ణశూలములయిన నాతఁ డాగ్రహించి "ముదివెట్టియగు నీ భీష్ముఁడు కృష్ణునిఁ బరమేశ్వరుఁడంచుఁ గొనియాడెను. పాండవేయులు, నీతఁడుతప్ప నితరులెవ్వరును ధర్మతత్త్వమ్ము లెఱుఁగరుకాబోలు?" నంచు నలుకతో భీష్మంజూచి యిట్లనెను. "నీవు మంచితనమున నెల్లవారి నవమాన్యులఁ జేసితివి. ఓడతోఁగట్టిన యోడవలె ధర్మరాజునినుఁ బట్టుకొని గతగౌరవుఁడై కడుఁదూలె. దురాత్ముఁడవై నీవిట్లు పలికిన నిచ్చటి భూమిపతులెట్లు సైచువారు? పూతన యను రక్కసిఁజంపుటయు నచేతనమగుశకటముఁబడఁద్రోయుటయుఁ బాదాహతిచే యమళార్జునంబుల విఱుచుటయు వల్మీకమాత్రమగుపర్వతము నెత్తి బలవంతునివలె దానిక్రింద నేడుదివసములుండుటయు వృషభము వధించుటయు నను నీమొదలగు కృష్ణునిబీరములువొగడుచున్న నీనాలుక శతఖండములయిననే గాని యాతనిఁ బొగడఁజాలవు. నిక్కముగ నాతఁడెట్లర్ఘ్యదానమునకు యోగ్యుఁడయ్యెనో చెప్పుము. స్త్రీలను గోబ్రాహ్మణులను నన్నంబిడిన వారిని విశ్వసించినవారిని వధియించుట పాతకమని పెద్దలు సెప్పుదురుగదా? గోవిందుఁడు గోవధయును స్త్రీవధయును జేసెను. నీవునుగడుధర్మువెఱఁగినవాఁడవయి వీని కర్ఘ్యమిప్పించితివి. అదియునుఁగాక యన్యకామినియైన యంబయును కన్యక నీ వపహరించి తెచ్చిన

నీతమ్నుఁడు విచిత్రవీర్యుఁడు ధర్మాత్ముఁడు కావున దాని విడిచి పుచ్చెను. మఱియు సంతానహీనుఁడ వనుజననిందితమయిన యధర్మము నీయందుండ జనులు నీయనుశాసన మెట్లు నమ్ముదురు?

“తొల్లి పారావారతీరమ్మున నొక ముసలియంచ న్యాయాన్యాయముల నుడువుచు ధర్మమార్గమున నుండుఁడని పక్షులనెల్ల శిక్షించుచుఁ బ్రాణిహింససేయక తపము సలుపుచుండెను. అంత సముద్రజలచరములయిన పక్షులు దానికి భక్ష్యములు దెచ్చి పెట్టుచుఁ దత్సమీపమునఁ దమతమ యండములనుంచి యాహారాన్వేషణమునకై యతిదూరమరిగిన నిచ్చట నాహంసయు నాగ్రుడ్లఁదినుచుండె. దాని నొక్క పక్షి గని యాయండజముల కెల్లఁ జెప్పిన నవి యెంతయుఁ దుఃఖించి యాయంచ నంతము నొందించెను. కావున నీవును నటులనే యధర్మప్రవృత్తుఁడవై ధర్మము బోధించుచుఁ బాండవులకనర్థమాపాదించుచున్నాఁడవు. బలసంపదచే నుపేంద్రుఁడెంతయు నవనిపాలుర జయించెనంటివి. ఆతని యున్నతియును నాతని బలశౌర్యంబులును నే నెఱుఁగనా? భయాతిరేకమున నీజనార్దనుఁడు సకలక్షత్రియ భయంకరుఁడగు జరాసంధునకు రణరంగమునఁ బదిమారు లోడి పాఱె. తుద కామహాబలుని జయింపఁ జాలక బ్రాహ్మణవేషమున భీమార్జునులను దోడు సేసికొనియాతని వధియించెను. ఇవియన్నియును నాతని పరాక్రమములుగ నెంచి వందివలె నాతనిఁబొగడుచుందువు. ప్రొద్దుపోక పొగడఁదలఁచితివేని సుగుణవంతులయిన కర్ణశల్యాదులగు మహాశూరులఁబొగడఁగరాదా? గాంగేయా! అన్యకీర్తనమును, నితరుల

నిందయునుఁ నాత్మస్తుతియు నాత్మనిందయు నార్యవృత్తములు గావని యార్యులైన మునులు సెప్పలేదా?" ఇట్లు సక్రోధ రూక్షవీక్షణములఁ జూచుచున్న శిశుపాలునిఁ జూచి సహింపఁ జాలక భీమసేనుఁ డతిరౌద్రాకారమున సకలజనసంత్రాసకర ముగ నలిగి దంతసందష్టదారుణముఖుఁడై శిశుపాలనిర్మూల నాభీలసంరంభమున నుండెను.

భీష్ముఁ డప్పు డాతని వారించి యద్దురాత్ముని జనన వృత్తాంతమును; నాతఁడు కృష్ణునిచేఁ దక్కనితరులచే మరణ మొందకుండుటయు సకారణముగ నెఱిఁగించి "వాయునందనా! ఇతరులైన నన్నిల్లుగ్గులు వలికి మదీయబాణానలంబుచే దగ్ధులు గాకుందురా?" యని పలుకుచున్న గాంగేయ భీమసేనుల నతిక్రమించి శిశుపాలుఁడు దామోదరున కభిముఖుఁడై యిట్లనియె:

"యదునందనా! భీష్ముని ప్రేరణచే నవమాన్యుఁడ వగు నిన్ను మాన్యుఁడవని పాండవులుపూజించిరి. మోహాంధుఁ డగు భీష్ముఁడును నీవును సంగ్రామరంగమున నన్నెదిర్చి కదనంబు సేయుఁడు."

అనియిట్లు గర్వమునఁ బలుక నాగర్వోక్తులు విని చక్రధరుఁ డఖిలరాజచక్రంబు విన నిట్లనియె: "ప్రాగ్జ్యోతిష పురమున భగదత్తుపై మేము వోయిన నీతఁ డన్యాయవృత్తిని బాలురకును వృద్ధులకును భయముగలుగునటుల ద్వారకా పురము గాల్చెను. వీరులైన భోజరాజన్యులు తమకాంతల తోడఁగూడ రైవతకాద్రిఁ బ్రమత్తులై క్రీడించుచుండ దయా

రహితుఁడై వారల వధించె. దేవాభుఁడైన మాతండ్రియగు వసుదేవుఁ డొనరించు నశ్వమేధయాగమున కభ్యర్చితమైన హయము నపహరించి జన్నమునకు విఘ్నము గలిగించెను పాపాత్ముఁడై బభ్రుభార్యను దనకు భార్యగా జేసికొనియె. మఱియు వాగ్విషయములైన యపకారము లనేకములు సేసెను. మాయత్తనన్నుఁ బ్రార్థించుటచే నిద్దురాత్ముఁడు సేసిన యపరాధశతంబు సహించితిని. ఇప్పుడు మీరందఱు నెఱుంగ నాయందకారణవైరమూని యత్యంత శత్రుఁడయ్యెను."

అనిన విని శిశుపాలుఁ డతిపరుషవచనుఁడగుచుఁ బురుషోత్తముఁజూచి "నీదయయు, నీకోపమును నాకేల? దుష్టాత్మ! నాకిచ్చిన కన్యఁ జేకొని యిట్లు పలుకుటకు నీకు సిగ్గులేదా?" యనిపలుకుచుండ ననలజ్వాలాభీలంబగు దైత్యాంతకుచక్రము రాజచక్రమెల్లను భయమొందుచుండఁ జైద్యుని తనువున రుధిరధారలు బోరని యొలుక శిరము దునిమె. అంత నాతఁడు వజ్రిహతిచేఁ ద్రెళ్ళు పర్వతముచందమునఁ బుడమిపైఁబడ నాతని దేహము వెల్వడి యొక్క మహాతేజ మంబరమంతయు వెలుఁగ నేతెంచి రాజులందఱు విస్మయము నొంది చూచుచుండఁ బరమేశ్వరుఁడగు కృష్ణు దేహము సొచ్చెను.

ఇట్లు మధువైరిమీఁది మత్సరమున మత్తిల్లి మూడు జన్మములనుండియు సతతంబు దదీయ లోపగుణధ్యానపారీణుఁ డగుటచేఁ జేదిదేశాధిపుఁడు నిర్ధూతపాపుఁడై విధిరుద్రాదుల కందరాని పదవిఁ జెందెను.

—♦ దంతవక్త్రుని మరణము ♦—

సాల్వుఁడనువాఁడు శివప్రసాదమున సౌంభకమను విమానము వడసి ద్వారకాపురిపై దండెత్తి యుద్యానవనముల ధ్వంసముగావించి, బావులఁ గలఁచి, కూపములఁ జెఱచి, పరిఖలు పూడ్చి, సువర్ణధ్వజపతాకములు నఱికి గోపురప్రాసాదముల భస్మముగావించి, కాంచనరత్నాదివివిధవస్తువులగొల్లపుచ్చి, ప్రజలఁజెఱఁబట్టి పెక్కుబాధల నలయించుచుండెను.

కృష్ణుఁడును మీనకేతన మలరార నున్నతరథస్థితుఁడై రణోద్వేకే తెంచిన,సాత్యకికృతవర్మ మొదలయినయదువీరులు చతురంగబలములతోడ భూమి వడంక గోవింద స్యందనమ్ము దలకడచి వారల నెదుర్కొనిన, నత్తఱి దేవదానవసంకుల సమరవిధమునఁ దుములసంగరం బయ్యె. అయ్యెడ కృష్ణుఁడమ్మయవినిర్మితమాయావిమానమ్ము నిజగదాహతిచే నింతింత తునియలు గావించి సముద్రమధ్యమునఁ దొరంగఁజేసెను.

అంత సాల్వుఁడు కోఱలువెఱికిన సర్పంబు విధమున గండడంగి విన్ననై బొలివోనిబీరమున భూమికి డిగ్గి యాగ్రహమున వజ్రసంకాశమగు భీకరగదాయుధంబు ధరించి కదియరాఁగఁ గృష్ణుఁడు గదాయుక్తముగ నాతనికరంబు ఖండించి వెంటనె రత్నమకుటశోభితమగు సాల్వునిశిరము కులిశముచే నిందుృఁడు వృత్రుని శిరంబు దుంచినటులఁ దుంచె.

ఇట్లు మాయావియైన సాల్వుఁడు కృష్ణుచేఁ బొలియుటఁ గనుఁగొని నిజసఖులగు సాల్వశిశుపాలాదులకుఁ బారలౌకిక క్రియలు మైత్రితోడఁ గావించి దంతవక్త్రుఁడు భీషణాకారమునఁ బండ్లు పటపటగీటుచు గదాయుధంబు గేలఁ ద్రిప్పుచు మండు వేసవిని మించు దినకరుంబోలి యుగ్రతఁ జనుదేరఁ గాంచి యదువల్లభుఁడును గేల గదఁ ద్రిప్పుచు నరదంబు డిగి విరోధికి నెదురుగాఁ జనెను.

అంత దంతవక్త్రుఁడు నీచవర్తియై యదరుచు నట్టహాసముఖుఁడై వలచేత గదఁ ద్రిప్పుచు దామోదరుఁ గనుఁగొని నవ్వుచు "నీవు మదీయ భాగ్యముచే నా దృష్టి పథంబునకు గోచరుఁడవైతివి. మిత్రద్రోహి వగు నిన్ను మాతులేయుఁడ వని సన్నింపక దేహమునందు వర్తించు నుగ్రవ్యాధి నౌషధాదిక్రియల నివర్తింపఁ జేయు వైద్యునివలె మదీయ గదాదండంబుచేఁ బరేతనిలయమునఁ గనిచి మున్ను నీచే నిహతులయిన నాదుసఖుల ఋణంబుఁ దీర్తున"నుచు దుర్భాషలాడుచు డగ్గరి తన చేతనున్న పెనుగదచేఁ గృష్ణునితల బెట్టుగ మొత్తెను. ఆ సమయంబున నంకుశాహతిచేఁ గనలు మదగజంబు కైవడి నా దైత్యమర్దనుఁడు భీకరగదఁ బూని దంతవక్త్రునియురంబు గ్రుచ్చిన నాతఁడు రుధిరంబు గ్రక్కుచుఁ దక్షణంబ పర్వతాకారంబగు దేహంబుతో నొఱలుచు, నేలఁగూలి కేశపాశంబులు చిక్కువడఁ దన్నుకొనుచుఁ బ్రాణంబులు విడిచె.

అప్పుడు నిఖిలభూతము లాశ్చర్యమొందఁ దద్గాత్రంబు నుండి యొక్క సూక్ష్మతేజము వెలువడి గోవిందుని దేహమ్ము ప్రవేశించె. సిద్ధసాధ్యగంధర్వాదు లద్భుతానంద మొంది హరి మహిమ ననేకవిధముల నుతించిరి.

ఇట్లు జయవిజయులు విప్రశాపముచేఁ బ్రథమజన్మం బున హిరణ్యాక్ష హిరణ్యకశిపులై, దితికి జనియించిన విష్ణుఁడు వరాహనారసింహ రూపముల వారల వధించె. ద్వితీయజన్మం బున వారలె కైకసికి రావణకుంభకర్ణులై జనియించిన రామావ తారమెత్తి వారల సంహరించె. మూడవ జన్మమున సాత్వతికి శిశుపాల దంతవక్త్రులై పుట్టిన యాదవవంశమునఁ గృష్ణుఁడన నుదయించి వారి వధించి తనలోఁ జేర్చుకొనియె.

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే.

సంపూర్ణము.



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

# కఠినపదముల కర్థములు

( ఇందలి యంకెలు పుటలను దెలియఁజేయును. )

—:0:—

1 శ్రీనిలయంబై=సంపదల కునికిపట్టయి, భక్తలోకపాలనగుణధామంబై = భక్తులను బరిపాలనచేయు గుణముచేఁ బ్రకాశించుచున్నదై, ఆర్యజనసన్నుతిభూమంబై = పెద్దలపొగడ్తలచే దట్టమైనదై, మాధవాంఘ్రిసరోజంబులు=విష్ణుదేవుని పాదకమలంబులు, నగర + ఉపవనమ్ములు= పురమందలి తోటలు, నిర్మల ధర్మమూర్తి=స్వచ్ఛమయిన న్యాయమే ఆకారముగాఁ గలవాఁడు, పెంపెసఁగుచుఁ = అతిశయించుచు, సంతానవనసంతానంబులు = సంతానము లను పేరుగల చెట్లతోటల యొక్క గుంపులు.

2 సుందరీయుక్త వైమానికులు=స్త్రీలతోఁగూడి విమానములపైఁ దిరుగువారు, మయూరములు=నెమిళ్ళు, రథాంగముఖ్యవిహంగంబులు=చక్రవాకపక్షులు మొదలగు పక్షులు, అరవిందనయను కథాగానంబులు = విష్ణుదేవుని చరితములతోఁగూడిన సంగీతములు, అనూనంబుగా = ఎక్కువగా, మొఱయించుచుఁ = ధ్వని చేయుచు (మ్రోగించుచు) ప్రవాళ లతికాకులంబులయిన కూలంబులు=పవడపు తీగెలతో నిండిన గట్లు, కమలాకరంబు=కొలఁకు, భవనాంభోజము=ఇల్లను కమలము, భృంగాకృతిఁ = తుమ్మెదయాకారంబున, ఏపారుచుండును = అతిశయించుచుండును, పంచాబ్దంబుల కుమారకులై = ఐదు సంవత్సరముల యీడుగల బాలురై, నవరత్నతోరణ...కక్ష్యాషట్కముఁ=తొమ్మిది విధములగు మణులతోఁ గట్టఁబడిన తోరణములతో నొప్పుచున్న గోడలతోడను, తలుపులతోడను, గడపలతోడను రచియింపఁబడిన లోగిళ్ల నాఱింటిని, వనమాలికా విరాజితోరస్కులు = అకులతోడను

పూలతోడను గట్టబడిన దండలచేఁ బ్రకాశించుచున్న వక్షస్థలము గలవారు, వేత్రదండాభిరాములు = బెత్తములచే మనోహరమయిన వారు.

3 శ్రీవల్లభదర్శనలాలసులు = విష్ణుదేవుని చూచుటయం దాసక్తిగలవారు, రోషారుణితాంబకులు = రోషముచే నెఱ్ఱగాఁ జేయఁబడిన నేత్రములు గలవారు, బృందారకులు = దేవతలు, అంతరాయము = ఆటంకము, దౌవారికులు = ద్వారపాలకులు, నిటలతటఘటితాంజలులు = నొసటి యందుఁ జేర్చిన రెండుచేతులు గలవారు, పరాభవము = అవమానము, వైజయంతి = విష్ణుని మెడయందుండు వనమాలిక.

4 విధాత = సృష్టిచేయువాఁడు (బ్రహ్మ), దుష్కృతము = పాపము, వివర్ణత నొందినట్లు = రంగుమార్పునొందినట్టు.

5 మస్తకన్యస్తహస్తులు = తలయం దుంచఁబడిన చేతులు గలవారు, అనలము = అగ్ని, ఆహుతులై = హోమద్రవ్యంబులై.

6 తనూభవ = కూఁతురు, కర్ణధారుఁడు = ఓడనడుపువాఁడు, వ్యసనార్ణవము = దుఃఖసముద్రము.

7 బుధజనపీడాకరులు = పెద్దలకుఁ గీడొనరించువారు, భూతేశుఁడు = శివుఁడు, విగతకౌతుకరై = పోఁగొట్టఁబడిన సంతోషము గలరై.

8 మొయిళ్ళు = మేఘములు, మొదవులు = గోవులు, తనూభవులు = కుమారులు, విరించి = బ్రహ్మ.

9 అర్కనివాసంబులుగ = జిల్లేడుచెట్ల కునికిపట్టుగ, కాంచనావాసంబులుగ = ఉమ్మెత్తచెట్ల కునికిపట్టుగ, గీర్వాణులు = దేవతలు, పశ్చిమదిశానాయకుండు = వరుణుఁడు, రోషవహ్ని = క్రోధాగ్ని, క్షమాజలంబు = ఓర్పనెడినీరు.

10 విశ్వంభర + ఉద్ధరణము = భూమిని లేవనెత్తుట.

11 కమలగర్భుఁడు = బ్రహ్మ, రోదోఁతరాళంబు = బ్రహ్మాండము, అసురాంతకుఁడు=విష్ణువు, వనచరము=అడవియందుఁదిరుగునది, నీటియందు సంచరించునది.

12 దురితపయోధితరి = పాపములనెడు సముద్రమును దాటించువాఁడు. కృష్ణ + ఉరగంబు = నల్లత్రాఁచు, వినయవినమితోత్తమాంగుఁడు = అడఁకువచే వంచఁబడిన తలగలవాఁడు, నక్తఁచరుఁడు=రాత్రులందుఁ దిరుగువాఁడు (రాక్షసుఁడు)

13 నిజప్రభాపటలంబుచే=తనకాంతులసమూహముచే, అసువులఁదొరఁగె=ప్రాణములను విడిచె.

14 దంతసందష్టదశనచ్ఛదుఁడు = పండ్లచేఁగొఱుకఁబడిన క్రింది పెదవిగల వాఁడు, ఆశ్వాసించి =ఓదార్చి, నిరాగారనివిష్టపాంథులు=చలికొంద్రలోఁ జేరిన బాటసారులు.

15 శమనుఁడు=యముఁడు, జాతస్యహిధ్రువోమృత్యుః=పుట్టినవానికిఁజావు నిశ్చయముగదా ! తత్వజ్ఞులు=నిజము తెలిసినవారు, అజ్ఞులు=మూఢులు

16 ఖగములకు=పక్షులకు, అంతకభూతుఁడు=యముఁడైనవాఁడు, విగతశోకులైరి=పోఁగొట్టఁబడిన దుఃఖముగలవారైరి.

17 నిర్జరులు=దేవతలు. చీమగమిచే=చీమలగుంపుచే

18 వివిధప్రాణి...సంధాత=అందఱినొసటియందును వ్రాయుటయను గొప్పవిద్యయందు నేర్పుగలవాఁడు, దామోదరుఁడు=విష్ణుమూర్తి.

19 మహేంద్రభవనంబు=ఇంద్రునియిల్లు. మహీరుహములు = చెట్లు; పన్నగతల్పునకు = శేషుఁడేశయ్యగాఁగలవిష్ణుని, దితిసుతవ్యాపారభాషావిపర్యయములు=హిరణ్యకశిపుని పనులను అక్రమప్రసంగములు

20 అయస్కాంతసన్నిధికి=సూదంటురాయిదగ్గర

21 మకరందము = తేనె

22 భృంగంబు = తుమ్మెద, ధుత్తూరంబులకుఁ = ఉమ్మెత్తచెట్లకు రసాలపల్లవంబులు = తియ్యమామిడిచిగురుటాకులు, త్రివర్గపాఠములు =ధర్మార్థకామములను దెలుపుపాఠములు.

23 నుడువులు=మాటలు, ప్రకృతిజన్యగుణము = స్వాభావికమగుగుణము,

24 చికిత్సకుఁడు=వైద్యుఁడు, అభిచారహోమంబు = శత్రునాశనమునకై చేయుహోమము, అనలము = నిప్పు, గరళము = విషము.

26 యువభావంబునఁ = బాల్యమున, ఫాలాక్షుఁడు = శివుఁడు

27 సహస్రాక్షుఁడు=దేవేంద్రుఁడు, జనితార్భకునిఁ=పుట్టినశిశువును.

29 అశనిసంకాశభాషణంబులు=పిడుగుతో సమానమైనమాటలు.

31 మహోద్దండంబగు = మిగులభయంకరమయినదగు, ఖద్యోతము = మిణుగురు పురుగు.

32 అంకగతుఁడయిన = తొడయందున్న.

33 అసమానప్రభావిభాసి = సాటిలేనికాంతిచేఁ బ్రకాశించువాఁడు, వాసుదేవ. . .తముఁడు = విష్ణుదేవునియందలి ధ్యానమనెడు సూర్యకాంతిచేఁ బోఁగొట్టఁబడిన అజ్ఞానాంధకారముగలవాఁడు, ఆగమరహస్యవేది = వేదములందలి రహస్యములను దెలిసినవాఁడు, ఆశల జయించి= దిక్కులను జయించి, జామాత = అల్లుఁడు, ఆకర్ణాంతవిశాలనయనయుగళి = చెవులవరకు వ్యాపించియున్న విశాలమైన కన్నులయొక్క జంట గలది

34 ఈతిబాధలు=అతివృష్టి, అనావృష్టి, మూషికములు, శలభములు మొదలగువాని బాధలు.

35 ధర్మభూధరంబు = బంగారుకొండ (మేరుపర్వతము), హీరకాంతులచేఁ = వజ్రమణులయొక్క ప్రకాశములచే, అపరచిత్రభానునివలె = రెండవసూర్యునివలె.

37 విబుధలోకారాధ్యశీలుఁడు = పండితబృందములను బూజించు స్వభావము గలవాఁడు.

38 తామ్ర + ఓష్ఠములు = ఎఱ్ఱని పెదవులు, వింశతి = ఇరువది

40 తాపసజనకామితప్రదాత = మునులయొక్క కోరికల నిచ్చువాఁడు, భోగీంద్ర నీలకంఠములు = సర్పములును, నెమిళ్ళును.

42 అబ్జభవుఁడు = బ్రహ్మదేవుఁడు, ఇంగితము = హృదయమందలి యభిప్రాయము.

44 అమరజ్యేష్ఠుఁడు = దేవతలలో మొదటివాఁడు - బ్రహ్మ.

45 మాతామహుఁడు, తల్లితండ్రి (తాత), నికాయము = గుంపు అధ్వరము = యజ్ఞము.

46 భవాదృశులే = మీవంటివారలే, మాతులుఁడు = మేనమామ.

48 యక్ష + ఈశుఁడు = కుబేరుఁడు, బదనిక = ఒక విధమయిన యౌషధి.

49 ధరాధరంబులు = కొండలు, జలజాకరంబులు = తామరకొలఁకులు.

50 వింశతి భుజుఁడు = ఇరువది చేతులు గలవాఁడు (రావణుఁడు), ఉద్వాహము = పెండ్లి.

51 సారంగములు = లేళ్ళు, వల్మీకములు = పుట్టలు.

52 వీత + ఆమయుఁడు = వ్యాధులు లేనివాఁడు, పంచశతాబ్దంబుల = అయిదువందల సంవత్సరములు, ప్రపితామహుఁడు = పితామహుని తండ్రి (ముత్తాత.)

53 అన్వేషించుచున్నాఁడను = వెదకుచున్నాఁడను, దౌహిత్రి = కూఁతు కూఁతురు.

54 ధవళప్రభాభాసిత కైలాసము = తెల్లఁదనముయొక్క కాంతిచే నెగతాళిచేయుచున్న వెండికొండగలది. లాలాజలము = నోటినుండి స్రవించు నీరు (చొంగ).

55 బహూకరించి= మర్యాద చేసి, పేరోలగము=నిండుకొలువు.

56 తార్కాణము = నిదర్శనము, అడిదము = కత్తి, ఈర్ష్యామగ్నుఁడు = అసూయయందు మునిఁగినవాఁడు, నగజాత = పార్వతి,

57 త్ర్యంబక సఖుఁడు = కుబేరుఁడు.

58 నరవాహనుఁడు = కుబేరుఁడు, ఇందుకళామౌళి = శివుఁడు, చమూబృందము = సేనాసముదాయము.

61 సువర్ణ కుంభ స్తంభములు=బంగారుకుండలుగలకంబములు, మౌక్తిక వితానంబులు = ముత్యాల మేలుకట్లు, సోపానములు = మెట్లు.

63 దుర్వార గర్వాకర దర్వీకరభీకరంబులు=నివారింపశక్యముగాని గరువమునకు చోటయిన పాములవలె భయంకరమయినవి.

64 రిపుభటచయనాశంకర = పగవారి బంట్లసమూహమును నాశనము చేయువాఁడా !, స్వచ్ఛందగతిన్ = స్వేచ్ఛాగమనమున.

68 అసంఖ్యలలనామణులు = లెక్కలేని స్త్రీరత్నంబులు, ఆసన్ననదీవిలోకనకౌతుకంబునన్ = సమీపమందలినదిని చూచు వేడుకతో.

71 అమరీయుక్త పురందరు చందమునన్ = దేవతాస్త్రీలతోఁగూడియున్న దేవేంద్రుని విధమున, ప్రాగ్వారాశి = తూర్పు సముద్రము, జలఖేలాయత్తచిత్తాబ్జుండు = నీటియాటలందు స్వాధీనమయిన మనఃకమలము గలవాఁడు.

73 కులిశాహతిచేన్ = వజ్రాయుధపు దెబ్బచేత.

77 వాలజనితఝంఝానిలంబు = తోఁకవలనఁ గలిగిన పెద్దగాలి.

79 కలహాశనుఁడు = జగడమే యాహారము గాఁగల నారదమహాముని,

80 సూర్యతనూజుఁడు = యముఁడు.

83 మృగమదమిళ్రగంధమిళితాంగులు = కస్తూరి కలిపినగంధముతోఁ గూడిన అవయవములుగలవారు.

నిర్ఝరంబులు = సెలయేళ్ళు, రక్తసిక్తాంగులు = నెత్తుటితోఁ దడపఁబడిన అవయవములు గలవారు, వికసితకింశుకంబు=పుష్పించిన మోదుగచెట్టు.

85 బాహాస్ఫాలనంబుచేసి = చేతులఁజఱచి.

88 శశికాంత సోపాన పంక్తులు = చంద్రకాంతపురాలతోఁగట్టిన మెట్లయొక్క వరుసలు. అజానులంబోన్నత బాహుద్వయము = మోఁకాళ్లవఱకు వ్రేలాడుచున్న చేతులయొక్క జంట.

89 దంష్ట్రాకరాళవక్త్రంబు=కోఱలచే భయంకరమైననోరు, భయకంపితగాత్రుఁడు=భీతిచేవణకుచున్న శరీరముగలవాఁడు, సమరకాంక్షితశూరుని = యుద్ధమునకైకోరఁబడినవీరుని,దుష్టజనసమవర్తి = చెడ్డవారికి యమునివంటివాఁడు, ఉత్సంగంబు = తొడ.

90 భువనైకవదాన్యుఁడు = లోకములందు ముఖ్యమైనదాత.

91 వైరోచని = విరోచనుని కుమారుఁడు (బలిచక్రవర్తి)

92 తుహినకిరణుఁడు = చంద్రుఁడు.

94 విపక్షకులశిక్షాదక్షము = శత్రుసమూహమును దండించుటకు సమర్థమయినది.

95 పంకిలము = బురదగలది, ద్విజరక్షాదక్షుఁడు=బ్రాహ్మణులను గాపాడుటయందు సమర్థుఁడు, రూపవిజితమారుండు = చక్కదనముచే జయింపఁబడిన మన్మథుఁడుగలవాఁడు.

101 యూపస్తంభములు=యజ్ఞపశువును గట్టివేయుకంబములు, విశసించి చంపి, పలలంబు = మాంసము.

108 సుపర్ణానిలబలసంపన్నులకా = గరుడునియొక్కయు వాయువు యొక్కయు బలమువంటి బలముగలవారలను, వలీముఖోత్తములు = వానరశ్రేష్ఠులు.

104 అధ్వరసంపూజితవీతిహోత్రుండు = యజ్ఞములందు లెస్సగఁబూజింపఁబడు అగ్నిగలవాఁడు, సర్వసంయమిజనస్తోత్రపాత్రుఁడు = అందఱు మునులును గొనియాడుటకుఁ దగినవాఁడు.

107 జీమూతములు = మేఘములు.

110 పక్షవేగపరిహాసితవాయువు = ఱెక్కలవేగముచే నవ్వఁబడిన గాలిగలవాఁడు, ఘోరాయతహేతికా = భయంకరమయిన పెద్దకత్తితో, చరణఘాతమార్ణగ్రావుఁడు = పాదఘట్టనలచేఁ బొడిగాఁ జేయఁబడిన బండలుగలవాఁడు, దశాస్యమానోన్మూలి = రావణుని గర్వమును నాశనము చేసినవాఁడు.

118 రాఘవధనుర్విముక్తక్రూరశిలీముఖాగ్ని = రామునివింటిచే విడువఁబడిన పదునైన బాణములవలనఁ బుట్టిననిప్పు.

120 త్రిజట = విభీషణునికూఁతురు. వైనతేయుఁడు = వినతకొడుకు (గరుత్మంతుఁడు) దుగ్ధవారాశి = పాలసముద్రము.

121 మద్యభాండములు = కల్లుకుండలు.

123 పాషాణపాదపప్రహారంబులకా = ఱాళ్ళు చెట్లు అను ఆయుధములతో తీవ్రదంతనఖాగ్రములు = వాడిగలపండ్లయొక్కయు గోళ్ళయొక్కయు కొనలు.

125 సాలంబు = మద్దిచెట్టు, అఖిలారావము = భయంకరమగుధ్వని

126 శ్రుతిచోరుఁడు = వేదముల దొంగిలినవాఁడు, పద్మబాంధవకులేశుఁడు = సూర్యవంశపురాజు, దివ్యశతాంగము = దేవతల సంబంధమయిన రథము.

128 దోషాచరుఁడు=రాక్షసుఁడు(రావణుఁడు) తూణీరము=అంబులపొది.

181 రాసభరవమునన్ = గార్దభస్వరముతో.

138 గోమాయువు = నక్క, ఎల్లి = రేపు, భవాని = పార్వతి.

134 తూర్యఘోషంబులతోన్ = వాద్యధ్వనులతో.

187 డోలాయమానమానసుఁడు = ఉయ్యాలవలె నూగుచున్న మనస్సుగల [వాఁడు,

అగ్రజన్ములు = బ్రాహ్మణులు.

138 ఉపాయనంబులు=కానుకలు, అంతకతనూజుఁడు=యమునికుమారుఁడు (ధర్మరాజు)

140 పేడి = నపుంసకుఁడు.

141 ఆహవజితులు = యుద్ధమందు జయింపఁబడినవారు.

143 మత్తేభకుంభవిదళననిష్ఠుర నఖముఖము = మదపుటేనుఁగుతలను జీల్చుటయందుఁ గఠినములగు గోళ్లకొనలుగలది, యమళార్జునంబులు = జతగానున్న మద్దిచెట్లు.

145 సక్రోధసాక్షివీక్షణము = కోపముతోఁగూడిన కఠినపుచూపు.

147 పరిఖలు = అగడ్తలు.

148 మాతులేయుఁడు = మేనమామకుమారుఁడు.

